


౧౬. సంపుటం. ప్రమాది, వైశాఖమాసము ( 1939) మే సంఖ్య. ౫

# రామన్న

శ్రీ వేలూరి శివరామశాస్త్రి

[రామన్న ప్రోలమహారాజు ఆశ్రయము పొందుట.]

"శ్రీజాగ్రన్నయనాంబుజా! యచలరాజీతుంగశృంగధ్వజా!
రాజద్రాజబిడౌజ! కాకతిమహారాజాధిరాజా! మహో
తేజా! భూరిభుజా! సమస్తధరణీదేవోత్తమ స్వర్గభూ
మీరాజా! నీకు శుభంబు! నీకు జయలక్ష్మీనిత్యకల్యాణముల్."

అంచుం బ్రోలమహీశు నోలగమునం దాశీర్వదించెం గడుం
గంచుం గీచినయట్లు భూమిసురుఁ డొక్కం డుక్కుచుంబోని పై
సంచిన్ నించెడివాఁడు సిగ్గుచెలితో సావాసముం జేయు గో
రంచుంబంచియవాఁడు రామనసమాఖ్యాకుం డభీకుం డొగిన్.

వానిభార్య వచ్చి వానివెన్కఁ జనుంగు
ముసుఁగు రాణివాసమున వసించె
వారికుర్రఁ డొకఁడు వారి మధ్యస్థలి
బొమ్మరిల్లుగాఁగఁ బొనరఁ జేసె.

ప్రోలఁడు భూమీసురునకుఁ
గేలులు రెంటిని బ్రపత్తిఁ గీలించుచు నిం
డోలగమునకును వచ్చితి
రేలా తమ రబినఁ బాఱుఁ డిట్టుల ననియెన్.

తొలిజన్మమంద మీరలు లక్ష్మి నోమితి రేము జ్యేష్ఠాదేవి నోమినాము
ప్రాగ్భవంబున మీరు వాగ్దేవి నోమితి రేము నిద్రాదేవి నోమినాము
గతజన్మమున మీరు గౌరి నోమితి రేము కాళరాత్రికిఁ గాళ్లు కడిగినాము
దేవతలను దొల్లి సేవించితిరి మీరు దయ్యాల నెడ మేము దలఁచినాము
మీకు మాకును భేదంబు లేకొలందు
లందులం జేసి మిముఁ జూడనాయె మనసు
ఇట్టి యాతండు మీకు నెట్లని మదికి
ఇంచుచో పీని నుంచి పోషించుకొనుఁడు!

ఆ పాఱుఁ డిట్టులన్ వాన్
వ్యాపారము సేయ, వించు బ్రభు 'వెట్టులైనన్
బాపఁడురా!' యనుకొంచును
'ఏపని చేయఁగలవ'నియె నెలుఁగెత్తి వెసన్.

'శాంతిక పౌష్టిక సంస్కారములఁ జేయఁ బండితుండగు వసిష్ఠుండఁగాను
కొడుకుకూరిమి చేత నడిదురంబున యోగి పాండితి సూపు ద్రోణుండఁగాను
నిదురబోయినవారి నిస్త్రింశధారచేఁ దునిమెడు ద్రోణపుత్రుండఁగాను
కడుపు చెక్కలుగాఁగఁ గదలించి నవ్వింప గండంపు నందికేసుండఁగాను
ఇట్టి యాపన్న రామన్న యేమి సేయఁ
గాకతీశుండు ప్రోలభూకాంతుమోల ?
చాల మీయుప్ప తినెడి విశ్వాస మెప్పు
డేమరంబోని పని యొండె యిత్తఁడు నేర్చు.'

అంచు వచియించు విప్రువాక్యములు వించుఁ
బ్రోలఁ డతనిఁ బరీక్షింప బుద్ధిఁ దలచెఁ
గాకతియుఁ బ్రోలరాట్పరీక్షకును దలఁచెఁ
గాకతిమహాశక్తిగుడి నష్టై గంట మ్రోఁగె.

ఓలగమువారియందలి
పోలిమి లద్దాన మోదపూర్ణము లాయెన్
మేలయ్యె మే లంచును
బ్రోలం డాశ్రయ మొసంగె భూమిసురునకున్.

౨

[యుద్ధమున కొమ్మన సేనాపతి పడియుంటచే ప్రోలఁడు మోడువలె స్తబ్ధుఁడై పోవఁగా శత్రువొకఁ డతనిపై కత్తిదూయుట. అపు డెవరికి తెలియకుండ రామన్న వచ్చి శత్రువును దునిమి పోవుట.]

చాళుక్యావనిపాలవంశమునకున్ సామంతుఁ డన్మాట ని
ర్మూలంబుం బొనరించు చన్యవిషయంబుల్ గెల్చుచున్ వైరులం
దాలుం దప్పలఁబోలె జోపుచు మహా త్రైలింగరాజ్యంబు నల్
మూలల్ ప్రాకఁగఁ జేయుచుండె బలిమిం బ్రోలం డహోరాత్రముల్.

పరిసరవర్తులైన పరిపాలకులందున మేటు లుత్కలే
శ్వరుఁడును గన్నడేశ్వరుఁడు సఖ్యముఁ బూని తెలుంగునాటి చి
ల్లరదొరమూక కింత ధనలాభము సూపి స్వపక్ష మెంతయుం
ఉరముగఁ జేయుచుం దెలుఁగుదేశము ముట్టడివేసి రీసునన్.

ఎక్కడఁ జూచినన్ సమరమే యెటు సూచిన రక్తపాతమే
యెక్కడఁ జూచినన్ శిబిరమే యెటు సూచిన నార్తనాదమే
యెక్కడఁ జూచినన్ సుభటులే యెటు సూచిన జీవహింసయే
యిక్కరణిన్ గతించె నొకయేఁడు తెలుంగుమహీతలంబునన్.

ప్రోలమహామహీశ్వరుని భూరితరాహవపాటవంబునం
గూలిరి యుత్కలాన్వయులు గొందఱు, కొందఱు కన్నడుల్ మహిం
గూలిరి, కొంద ఱాంధ్రులును గుప్పనఁ గూరలుగాఁగఁ బోరిలో
గూలిరి వారిచేతఁ దెలుఁగుంబొలిమేరల నాల్గుమేరలన్.

ఇమ్మెయి రెండుదేశములయేలిక లొక్కటియై కలంచు యు
ద్ధమ్మునఁ బ్రోలతేఁడు తనదండను రెడ్డిమగం డొకండునుం
గమ్మవజీ రొకండు నొకకాఁపుదునేఁడును గుట్ర బన్నఁగాఁ
గొమ్మనవాహినీపతిని గొల్పడెఁ గోలుమసంగు గ్రోల్పులన్.

వాఁడిమగఁ డిటుల్ పుడమి వ్రాలఁగఁ బ్రోలమహీశుఁ డాకుల
ల్లాడకయుండు రావిబలె నల్లన నల్లన విస్తుపోయె నీ
పోఁడిమి చూచి మిత్రుబలెఁ బొల్చెడి శత్రు వొకండు వాఁడిక్రొ
వ్వేఁడి మెఱుంగుగుంపులను వీడ్కొను కత్తిని దూసె జేనిపై.

అయ్యెడఁ బ్రోలభూమివిభుఁ డత్తఱిఁ జీకటు లావరింపఁగాఁ
జయ్యన నేలఁగూలె, నలశాత్రవుఁ డాతనిమీఁద దూకఁగా
'ఇయ్య దకృత్య మియ్యది యకృత్య మకృత్య మ'టంచు నొయ్యనన్
గుయ్యిడ నాత్మబాంధవుఁ డొకండును లేఁ డొకక్రోసుమేరలోన్.

ప్రోలాధీశుని కంఠనాళముపయిన్ రూకతూసి ప్రాణాశియై
వ్రాలంబోయెడుచోన గాలిగతిగా రామన్న వే వచ్చి డా
కేలం గత్తిని, గత్తి దాల్చిన కయిం, గేల్ దాల్చు భూపాలు, భూ
పాలుం గాచెను సేనఁ, దున్మి తనత్రోవం బోయె నజ్ఞాతుఁడై.

దవ్వుల నున్న సేన లవి దాపులకుం జనుదెంచి చూడఁగా
నెవ్వరు లేనిచోట స్మృతిహీనుఁడు రేఁ డిటు లుండె, నంతటన్
జివ్వకుఁ బాపి శాత్రవుల నేత్రములం బడిపోవకుండఁగా
నవ్విభునిం బురంబునకు నల్లనఁ జేర్చెను గొన్నిసైన్యముల్.

3

[మూడు శక్తులు తనను మ్రింగవచ్చినట్లును కాకతి వాని నాఁపినట్లును ప్రోలనికి పీడకల వచ్చుట. మెలకువ కలుగఁగనే ఆఁడుకూయి వినఁబడుట. రామన్నను ప్రోలఁడు అపుడు పరీక్షించుట. అందులకు అతనిని ప్రోలఁడును అనుగమించుట.]

చిటపటఁ జిన్కు సాగెఁ బెనుచీకటి బూతమువోలెఁ గ్రమ్మె ది
క్తటములనుండి గాలి విటతాటముగాఁ జెలరేఁగె వృక్షముల్
పటపటమంచుఁ గూలెఁ బరివారముతో నలపంచభూతముల్
కటకటఁ బొంది యొండొకటి కయ్యము సేయఁగ లేచె నొయ్యనన్.

అట్టి నడికిరేయియందునఁ బ్రోలండు
పీడకల నొకండు తోడు గొంచు
పాలవన్నెపట్టుపానుపుమీఁదను
కనులు తెఱచి చూచెఁ గరము బలిమి.

అంతఁ గ్రమక్రమంబుగను నాతనికిన్ స్మృతి వచ్చె స్వప్నవృ
త్తాంత మ దిట్లు: త న్నొగి భయంకరశక్తులు మూఁడు గ్రమింగఁగాఁ
బంతము పట్టి వచ్చి పయిఁబడ్డటు లంతటిలో ననంత వి
క్రాంతి పరీతమూర్తి యగు కాళతి వానిని నాఁపినట్టులన్.

పిమ్మటఁ బ్రోలరాజునకు వింతగఁ దోఁచె నరాతి నెవ్వఁడో
కి మ్మనకుండఁ జంపుటయుఁ గీడు తొలంగఁగఁజేసి తన్ను దే
వమ్ముగఁ గోటపట్టునకు మార్చుటయుం, బయి నిట్టి చెట్టస్వ
ప్నమ్మెద నావరించుటయుఁ బైఁ బ్రకృతి ద్రుతభావభంగియున్.

అప్పుడు కూఁత వ్రేటు దవులందులనుండి యొకాఁడుకూయి తా
నప్పృథివీశశేఖరున కల్ల వినంబడ 'నక్క టక్కటా
యిప్పు డి దేడనుండి జనియించెనొ? దీని విధం బదేమినై
యొప్పెనొ? యేమి చేయనగునో? యని యాతఁడు మల్లడింగొనెన్.

ప్రోలనిమానసంబునను భూసురుఁ డప్పుడు తోఁచెఁ, దోఁచినన్
లీలగ లేచి బంటులను లేపి మహీసురుఁ బిల్వఁ బంపఁగా
వైళమ వారు పోయి ద్విజవర్యుని గేహము తల్పు కొట్టి 'రి
ప్డేల?' యటంచు విప్రుఁ డనె నేలికయాన వచించి రాభటుల్.

పాఱుఁడు మంచి దటంచును
వారల వెనువెంట రాజభవనపు సింహ
ద్వారంబు సొచ్చి తేనిని
'జేరం'జనె నిట్టు లనియె క్షితిపతి యంతన్.

'అయ్యా మీవలనం బ్రయోజనము మా కావంత యే నింతవ
ట్టయ్యున్నట్టులు లేదుగాని యిపు డేల్లా తత్ప్రసంగంబు లా
కుయ్యాలించితిరే! య దెవ్వరిదొ? నాకుం జూడ మీవల్ల సా
హాయ్యం బేర్పడు నంచుఁ దోఁచుడును మీకై పంపితిన్ బంటులన్.

నావుడు భూదేవుఁడు కరు
ణావలయితమైన యార్తనాదము విని త
ద్రావద్రావిత హృదయో
ద్భావిత నాదమ్ముతోడఁ దా నిటు లనియెన్.

‘ నావలనం బ్రయోజన మనందగు వస్తువు లేదు కాని నే
నీవిషయం బొనర్పఁ దమ కెట్టి ప్రయోజన మబ్బు ? నైననుఁ
దేవరవారి చిత్తమున దీనికిఁ బ్రాపును బ్రోపు లబ్బెడుం
గావున నేను వోయి విధిగా నిది నిర్వహణం బొనర్చెదన్.’

అంచు విప్రుండు కందుకమట్టువోలె
సౌధసోపానజాలంబు చయ్య దాటి
యేఁగి తూనీఁగవోలె నయ్యిరులబయలఁ
గాఱుకాటుకచందానఁ గలిసిపోయె.

భూసురుఁ డేఁగినంతటను భూధవుఁ డిట్టుల లోఁ దలంచె ; ‘ నీ
భూసురుఁ డేఁగునో ? ప్రలయభూరిభయంకరమైన రేయి సం
త్రాసము చెంది యింటికిని దా జని పండునో ? లేక బల్మి నా
కోసము వోయి గుండె చెడి కూల్పడిపోవునో ? జాతిభీతిచేఁ ? ’

అం చిట్టులు ప్రోలఁడు లో
నెంచుచు నయ్యాఁడుకూయి యెటు పుట్టెనో యా
పంచకు నొక్కఁడె హేతి స
మంచితుఁడై యేఁగె ధైర్య మది తోడునగన్.

౪

[ప్రోలఁడు, ధ్వనిని బట్టి కాళికగుడికి వెళ్లి పొంచుండి వినుట. అటఁగల ఆఁడుది _ ‘ నేను కాళికని, మఱాఁడుశక్తులు మీరాజును తినఁబోఁగా నేను బతిమాలుకొంటిని, అవి ఒక బాలుని తలిదండ్రులతో బలిగోరినవి, అందులకు నే నేడ్చుచుంటిని, నీవాడ్తువా తీర్తువా? పోవయ్యా,’ అని అనగా ‘ఇంతేకద’ అని రామన్న ఇంటికేగుట. ]

అకస ముగ్రమై యఱచిన ట్లశనుల్ పడి చప్పుడాయె భూ
లోకము వీఁకమై నరకలోకముదాఁకను గ్రుంగిపోవునో
కాక యిదేమి యన్నటులు కంపము సాగ మహాసమీరముల్
పైకొని రేఁగి శైలములపాఁతు లగల్చుచుఁ బోయె రివ్వనన్.

ప్రోలఁడు లేచుచుం బడుచుఁ బోవుచుఁ గాకతిదేవళాన నొం
టోలమునందు నుండి కనె నుగ్మలి నొర్తుక నేడ్చుదాని నా
భీలతరాకృతిం గడు గభీరను, నాపెకుముందు విప్రునిం
జాల దయార్ద్రమానసు విశాల ముఖాంచిత భూరిసాహసున్.

ఆర్తిపరీతయై మిగుల నార్చుచు నుగ్మలి విప్రుఁ గాంచి 'నీ
వార్తవో తీర్తవో ద్విజుఁడవయ్యును వచ్చితి భీతి కెంతయున్
మూర్ఖులు కారె మీరు ద్విజముఖ్యులు పౌ మ్మిఁకఁ బొమ్ము పోవయా
కర్తవు గావు నావెతకుఁ గారణముం బాలియింపఁగా' ననెన్.

పాఱుఁడు నవ్వి సంయుతరవంబున 'నమ్మరొ లేని భీసమా
చారము నాదుముందరను జాటకు చెప్పకు, నీదుభీతికిం
గారణ మెట్టిదైన నది కాఁగనువచ్చును నేను దానిన్
వారణ సేయవచ్చు నని పల్కిన నంతట నామె యిట్లనున్.

నీ నెవ్వతె ననుకొంటివొ
కానీ, నేఁ గాకతిని వికారము గనఁబో
కీనుడి వినుపయి నాదగు
నానను జేయంగలాఁడవా రామన్నా!

ఇంతి యిటు వల్కినంతట
నింతేకద యమ్మ దీని కింత భయంబా ?
పంతము వేసి యొనర్చెద,
వంతన్ వచియింపు మన్న వామాక్షి యనెన్.

వ్యక్తులుమాత్రమె కాకల
శక్తులునుం గుట్ర బన్ను సన్నాహముతో
యుక్తములై యున్నవి (శ్రీ)
సూక్తములం బోవు మ్రింగనున్నవి జేనిన్.

ఇక్కడనే వసించు చముడేశ్వరి మాహుః యేకవీరియున్
మెక్కఁగఁబోయి రీనృపుని నే నది గాంచుచు నంత నమ్మరో
యక్కరొ యంచు వేఁడ విని యవ్వొక తల్లిని నొక్కతండ్రి నిం
కొక్కకుమారునిన్ బలి నొసంగు మటం చనిపోయె నీదెసన్.

అంచుఁ గాకతి వల్కి నయంత విప్రుం
డింతియేకద యనుకొంటి నేమొయంచు
నేను నాయాలు బిడ్డలు మేము వత్తు
మిపుడె యంచును మరలెఁ దా నింటిదెసకు.

ఈమాటలు వినుచుండిన
భూమీశ్వరు మేన నెల్లఁ బులకలవారె నిం
కేమి విచిత్రము జరుగడు
నో మఱి చూతమని ప్రోలఁ డొదిగియెయుండెన్.

౫

[ రామన్న ఆలుబిడ్డలతో కాకతికడకు వచ్చుట. కాకతి వారిని బలి యిచ్చుటకు గొనిపోవుట. ప్రోలఁడు వెళ్ళలోపలనే వారిని జంపు శబ్దము వినఁబడుట. అతఁడు దుఃఖించి మెడకు గండకత్తెర వేసికొనుట. దేవి ప్రత్యక్షమై వరము వేఁడుమనుట. ప్రోలఁడు రామన్నను అతని యాలు బిడ్డలను ఇమ్మనుట. ఆమె యిత్తుననుట. ]

ఆకులపాటు లేక తఱి యాఁటడిపుచ్చక నీటఁ దోఁగి గం
ధాకలనం బొనర్చి పసుపంచుల తెల్లని పట్టుపుట్టముల్
స్వీకృతి సేసి విందుగొను చెలువునఁ దల్లియుఁ దండ్రి బిడ్డఁడున్
గాకతి దేవళంబునకుఁ గ్రచ్చఱ వచ్చిరి భక్తియుక్తులై.

వచ్చినవారిఁ గాంచి యల వామవిలోచన మంటకంటితో
వ్రచ్చెడు కత్తితో మొయిలువర్ణముతోఁ దగి కాకతమ్మయై
మెచ్చితి మీదు రాకకును, మీకు భయం బెదఁ గల్గినన్ మిముం
బుచ్చెద నింక శక్తు లవి ప్రోలనృపాలునె ప్రమింగఁగా కనెన్.

కాకతి దేవి యిట్టు లనఁగా నల మువ్వురు నేకకంఠులై
'మాకు భయంబు లేదనిరి మంత్రము చెప్పుచు దేవి వారలం
గైకొనిపోయెఁ బ్రోలఁడును గ్రచ్చఱఁ బోకకముందె వారినిన్
వీఁక వధించు శబ్దములు విశ్రుతమాయెను మూఁడు వానికిన్.

అక్కట ముం దిఁకేమి విషయంబులు కన్పడునో యటంచిటుల్
నక్కటి నీ కుటుంబమును నాశము సేసితి నేను పోరిలో
గ్రుక్కుటకన్న నాజననిసూరెలఁ జచ్చుట మేలుకాదె యం
చక్కన గండకత్తెరను నొయ్యఁ దగుల్చుకొనెన్ నృపుం డొగిన్.

తగిలిన గండకత్తెర ముదంపడినట్టులు పూలమాలయై
జగదధినాథు నెమ్మెడ నెసంగఁగ దానికి విస్మితాత్ముఁడై
సొగసె నృపుండు ముందు పొడచూపుచుఁ గాకతి 'కోరుకో వరం
బిగ' ననె, తేఁడు 'మూవురను నిమ్మ'నెఁ గాకతి 'యిత్తుఁ బొమ్మ'నెన్.

ఇటు వల్కుచుఁ బల్కుచుఁ దా,
నటు లంతర్ధాన మొందె నాకాకతి, యు
త్కటభూతరూపమును నం
తట నంతర్ధాన మొందె ధరణీస్థలిలో.

౬

[ప్రోలఁడు సంతసించి రామన్నకు సేనాధిపత్య మిచ్చుట.]

అంతటఁ గొల్వులోన నుదయంబునఁ బాలునిఁ జూచి రాత్రివృ
త్తాంత మెఱుంగనట్లు వసుధాధిపుఁ డిట్లనె: 'మీదు దర్శనం
బెంతొ శుభావహంబు తమ రేఁగిన కర్జము తీరెనో కొ ? య
య్యింతి యెవర్తొకో? యటుల నేడ్వఁగ నేలొకొ? యేడ నున్కిడో?'

'ఓనరపాల! యోర్తు గుడి నున్నది యాబిడ నామరూపముల్
లేనిది, బిడ్డ కాపద దలిర్పఁగ నేడ్చెడు, నంతఁ దోడుగా
నే నటు వోవ మ్రింగుకొని యెట్టులొ న న్నిటు పుచ్చె నెంతయుం
బైని కథాప్రణాళికిఁ బ్రమాణము తా' మని బ్రాహ్మణుం డనెన్.

పాలుని సాహసంబునకు బల్మికి నమ్మిక కయ్యపార గం
భీరత కిచ్చ మెచ్చి పృథివీపతి బ్రాహ్మణ! యామెబిడ్డకున్
జేరిన కీడు బాపుటకు నీవె సమర్థుఁడ వంచు నాతనిన్
జేరువఁ జేర్చి చేసి యభిషేక మొసంగె బలాధిపత్యమున్.

ఈ పగిది జేఁడు ద్విజు సే,
నాపతిగాఁ బడసి ముగురునాథులకూట
వ్యాపార మడఁగ శాత్రవ
భూపులు సెడ నాంధ్రరాజ్యమును వెలయించెన్ *.



* ౧౯౧౦ సంవత్సరమున బుచ్చిరెడ్డిపాలెమున ఒక రెడ్డిగారు ఈకథ చెప్పిరి. నాతో నిమచున్న అన్నదరపు రాఘవశాస్త్రిగారు నన్నుఁ జూచి "ఈ కథకు పద్యాకార మిమ్మనిరి. అపుడే ఈ పద్యములు చెప్పితిని. జమీన్ రైతుపత్రికలో ఈకథయే కొంత మార్పుతో ప్రకటింపబడినది. నేను కొంత మార్చితిని. ఈ మార్పులవలన అసలు చరిత్ర కేమియు భంగము లేదని సహృదయు లెఱుఁగుదురు.

# యక్షగానము[1]

## పుట్టు పూర్వోత్తరములు

(శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి)

### మధురకవిత

ప్రాచీనాంధ్ర లక్షణకర్తలు తెలుఁగుఁ గవిత్వమును 'ఆశు, మధుర, చిత్ర, విస్తరము' లను పేళ్లఁ జతుర్విధముల విభజించిరి. యక్షగానాదు లందులో మధురకవిత్వమునఁ జేరును.

"మధురకవిత్వం బన్నది నాటకాలంకారంబులు, కళికోత్కళికలు, విభక్త్యర్థదేవతోదాహరణములు, సప్తతాళ నటనలు, నట్టొట్లు, గీతప్రబంధంబులు, చతుర్భద్రికాష్టభద్రికలు, బిరుదావళి, నామావళి, భోగావళి, రంగఘోష, జయఘోష, త్యాగఘోష, చతురుత్తర సంఘటనలు, యక్షగానంబున వెలయు పదంబులు, దరువులు, ఏలలు, ధవళంబులు, మంగళహారతులు, శోభనంబులు, ఉయ్యాలజోలలు, జక్కులరేకు పదంబులు, చందమామసుద్దులు, అష్టకంబులు, ఏకపద ద్విపద త్రిపద చతుష్పదాష్టపదలు నివి యాదిగాఁ గల్గునన్నియు."

—లక్షణదీపిక.

మధురకవితలు ప్రాయికముగా భాష, భావము, ఛందము దేశిగా నుండుటచే సంగీతసంస్కారము గలిగిన సామాన్యజనుల నాలుకలమీఁద నాట్యమాడునవిగా నుండును; గాన దొలుత నవి యంతగా లిపి కెక్కక పోయెను. సంస్కృతప్రాయ రచనలు గల చిత్ర, విస్తర కవితల ప్రాబల్యమునఁ గూడ వానికి సత్కవితలలోఁ బరిగణన మంతగా లేకపోయెను. ఇటీవల కవులుగా పురాణ ప్రబంధరచయితలే పరిగణింపఁబడుచుండిరి గాని మధురకవితారచయితలు లెక్కకెక్కకున్నారు. ఆంధ్రవాఙ్మయవృక్షమున ముఖ్యమయిన మధురకవితాశాఖ యిందాఁక సుపరిశీలనము లేకయే యున్నది.

### దేశినాటకములు

ఇక్కడ నా కిప్పుడు దేశినాటకము లనఁదగిన యక్షగానరచనముల ప్రశంసయే ప్రసక్తమగుటచే వాని పుట్టుపూర్వోత్తరములఁ గూర్చిమాత్రమే నాకు గోచరించిన విషయముల నించుక వివరింతును. యక్షగానము లన్న పేరుగల దృశ్యరచనములు నన్నయాదుల కాలమున గూడ నున్నవనుటకుఁ బ్రబలాధారములు గానరావు గాని యానాఁడే కొన్ని దేశిదృశ్యరచనము లున్నవని మాత్రము గుర్తింపనగును. నన్నయ కిన్నూరేండ్లకుఁ దర్వాత నున్న పాల్కురికి సోమనాథుఁ డిట్లు చెప్పినాఁడు:

1. ప్రస్తుతము ముద్రణమునం దున్న సుగ్రీవ విజయ యక్షగానమునకు పీఠిక.

"భ్రమరులు జాళెముల్ బయనముల్ మెఱసి
రమణఁ బంచాంగ పేరణి యాడువారు
ప్రమథపురాతనపటుచరిత్రములు
క్రమమెుంద బహునాటకము లాడువారు
లలితాంగ రసకళాలంకారరేఖ
లలరఁగ బహురూప మాడెడువారు

* • *

అమరాంగనలు దివి నాడెడుమాడ్కి
నమరంగ గడలపై నాడెడువారు
ఆనియద్గతి యక్షు లాడెడునట్టి
భావన ప్రోఁకులపై నాడువారు
భారతాదికథలు చీరమఱుఁగు
నారంగ బొమ్మల నాడించువారు
కడునద్భుతంబుగఁ గంథనూత్రంబు
లడరంగ బొమ్మల నాడించువారు
నారదు గంధర్వ యక్ష విద్యాధ
రాదులై పాత్రల నాడించువారు"

— పర్వతప్రకరణము ; పండితారాధ్యచరిత్రము.

పై ద్విపదలందు, నేఁటి వీథినాటకములు, దొమ్మరాటలు, తోలుబొమ్మలాటలు మొదలగునవి పేర్కొనఁబడినవి. ఇట్టి యాట సంప్రదాయములు వీనిఁ బేర్కొన్న సోమనాథుని కిన్నూతేండ్ల పూర్వకాలమునఁ గూడ నుండుట సంభావ్యమే. తెలుఁగునకు సాటిభాషలగు ద్రవిడకర్ణాటభాషల పద్ధతులనుబట్టియుఁ, దెలుఁగులో నిప్పు డుపలభ్యమానము లగుచున్నకొన్ని ప్రాచీన దృశ్యరచనముల తీరులను బట్టియు, ద్రావిడభాషాసామాన్యముగాఁ దొలుత వెలసిన నాటకరచనల స్వరూపము కొంత గుర్తింపవచ్చును.

## కురవంజి[2]

తొలుత ద్రావిడభాషలలో వెలసిన దృశ్యరచనములు కురవంజు లనఁబడునవి. ఆంధ్ర కర్ణాట ద్రవిడ దేశముల యరణ్యములలో వసించు నాటవికులు చెంచులు, కురవలు (కొరవ, కోవ, కోయ) అనువారు. అందు కురవజాతివారి యంజె = అడుగు (నృత్యవిశేషము) కురవంజె యనఁబడెను[3]. చిందు, గంతు, గొండ్లి, అంజ, అంగ - ఇత్యాదులు నృత్యవిశేషములు. బహుకాలమునుండి శివక్షేత్రములగు శ్రీశైలము, ఇంద్రకీలనగము (బెజవాడకొండ) మొదలగు పర్వతములమీఁదను నృసింహక్షేత్రములగు వేదాద్రులు (పెక్కులున్నవి) మంగళాద్రి, సింహాద్రి, గరుడాద్రి, మాల్యాద్రి, వెంకటాద్రి మొదలగు పర్వతములమీఁదను తిరుమలమీఁదను వర్షోత్సవములు (యాత్రలు, జాత్రలు, జాతరలు) జరుగునప్పు డక్కడికి, నాగరకప్రజలు చేరుచుండువారు. వారి వినోదమునకై యక్కడి

---

2. వాల్వివి సుజ్జరి విల్వేసు (?) దండలాస్యము కందుకక్రీడ యల్లికయును
కొరవంజి శుభలీల సుజరాతి దేసి చొపదము జక్కిణి దురుపదము మదన
పదబొత్యమును జోగెసదవాలి శారదాసామ్రాజ్యమును జిందు పవతి మచ్చ
రంబును నాట్యకదంబంబు మొదలైన నాట్యముల్ పావణింపు నవరసజ్ఞ

(విజయరాఘవ నృపాలుని ప్రహ్లాద చరిత్ర - యక్షగానము). ఇందు 'కొరవంజి' నృత్యవిశేషముగానే పేర్కొనఁబడినది.

3. కురవంజె, కురవ + అంజె (అంజ, అంజె, అంకియరూపాంతరము). కురవంజియ నుండి కురవంక అనురూప మేర్పడి యుండవచ్చును. కన్నడమున 'కురవంజియ' వ్యవహార మున్నది.

యాటవికులు, రాత్రులందు నృత్యవిశేషములు నెఱపి ధనార్జనము చేయుచుండువారు. అక్కడక్కడి కొరవ (కొరవ, కురవ రూపాంతరములు) జాతులవారు చేయునృత్యములు కొరవంజు లనఁబడెను. కొరవంజి యన్న పేరు తొలుత వారినృత్యమునకు, పిదప నృత్యవిశిష్టమయిన వారి చిన్నచిన్న గేయరచనలకు, నాపై కురవజాతివారికిఁగూడఁ జేరైనది. కురవజాతివారు తొలుత చేయునృత్యవిశేషము కాలక్రమమున నాయాపర్వతప్రదేశముల స్థలమాహాత్మ్యకథలతోను, శివ విష్ణు లీలాకథలతోను మిళితములయి గేయనాట్య రూపములను బడసెను. తొలుత, మాయా కిరాతవేషులగు పార్వతీశివుల కథలతోనున్న కిరాతార్జునీయము, నృసింహస్వామి చెంచితను బెండ్లాడు చెంచెత కథ మొదలగునవి కురవంజులుగా వెలసెను. ఇట్లు వెలసిన యాదృశ్యరచనములు తొలుత నత్యల్పముగా గేయభాగములును విశేషముగా నృత్యమును గలవైయుండెను అవి సింగి, సింగఁడు - అని యిద్దఱుపాత్రములు గలవై సంస్కృతమునఁ గల వీథినాటకములఁ బోలియున్నవి. సింగి, సింగఁడు సంస్కృతనాటకములలోని నటీనటుల వలె నాలుమగంద్రు. వీ రిద్దఱే కథాపాత్రము లగుచుందురు. కొన్నింట కథాసంధాయకుఁడు - సంధివచనములఁ జెప్పువాఁడు, విదూషకుఁ డనఁదగినవాఁడు - మూఁడవ పాత్రము - కోణంగి యనువాఁడు - కాన నగును. కోణంగి తర్వాత బోడిగాడు ననఁబడెను. కోణంగి సంస్కృతనాటకములలోని విదూషకస్థానీయుఁ డగుట స్పష్టముగాఁ గానవచ్చును. సంస్కృతనాటకములలోని ధ్రువాగానమే కురవంజులలో దరు వనఁబడెను. దేశిరచనలలోనుండి సింగి, సింగఁడు, కోణంగి, దరువు - అనునవి నటీనటులుగను, విదూషకుఁడుగను, ధ్రువగను సంస్కృత నాటకములఁ జేరనేమోయనికూడ యోజింపఁదగిన ట్టున్నది. ఎంతోకాల మిట్లు కొండపట్టులందు సాఁగుచుండిన గేయనృత్యసందర్భములు నగరములకుఁగూడఁ గ్రమముగా వ్యాపించినవి. చెంచులు, కురవలు అడవుల నుండి పులిగోళ్లు, అడవిపందికోఱలు, అడవి పండ్లు, వెదురుబియ్యము, వెదురుబెత్తములు, పిల్లనఁగ్రోవులు, సూదంటురాళ్లు, ఓషధులు, తేనె మొదలగు నాటవికవస్తువులను నగరములకుఁ గొనివచ్చి యమ్ముచు నప్పుడప్పుడు తమగేయ నృత్యవిశేషములను నగరములందును, బల్లెలందును బ్రయోగించుటచే నవి నాగరిక దేశములందును వ్యాపించెను.

## యక్షగానములు

ఇట్లు నగరములందు నభిరుచి గొల్పిన యాగేయవిశిష్టనృత్య దృశ్యములు, జక్కులవారు (యక్షులు, కళావంతులు) తర్వాత నగరములందును బ్రయోగింపఁ జొచ్చిరి. వీరి ప్రయోగములందు దృశ్యమయిన నృత్యాభినయములతోపాటుగా నధికముగా గేయ, వచనరూపమయిన శ్రవ్యరచనము గూడఁ జేరెను. కురవంజులకంటె యక్షగానములు పర్యాప్తముగా శ్రవ్యములగు కవిరచనములు గలవి. వీరిరచనములలో బహువిధములగు పురాణకథ లెల్లఁ జేరినవి. కురవంజులలోని సింగి, సింగఁడు పాత్రలు మాఱి రామ నల హరిశ్చంద్ర సీతా దమయంతీ చంద్రమత్యాది పాత్రలు వచ్చినవి. కాని వీనిలో నాటకరచనా పారంపర్య సంస్కారసూచకముగా, 'ఎఱుకతసాని'పాత్రము

వెలసినది. కురవంజులలోని దేశిరచనల కంటె నత్యధికముగా వీనిలో దేశిచ్ఛందోబద్ధములగు గేయరచనలు ప్రబలినవి. రాజసభలలో, యూరిజాత్రలలో, యక్షగంధర్వాదివేషముల ధరించి వేశ్యలు[4] ప్రదర్శించునవి గావునను, నృత్యధర్మములకంటె గేయధర్మము లధికముగాఁ గలవి కావునను నివి యక్షగానము లనఁబడెను. కళావంతులలో నొకతెగకు నేఁడు జక్కులవా రనుపేరు గలదు. యక్షాదివేషముల ధరించి నృత్యగాన ప్రదర్శనములను గావించుటచేత నే వారికా పేరు వచ్చియుండ వచ్చును. శ్రీనాథుఁడు క్రీడాభిరామమున జక్కులవారిని గూర్చి కొంత ప్రశంస నెఱపినాఁడు.

కోణాగ్ర ఘంఘర్ష ఘుమఘుమధ్వని తార
కంఠస్వరంబుతో గారవింప
మసిబొట్టు బోనాన నసలుకొల్పినకన్న
కొడుపుచేఁ దాటించు కెడపదడప
శ్రుతికి సుర్కర్షంబుఁ జూపంగవలయుచోఁ
జెవిత్రాడు బిగియించు జీవగఱ్ఱ
గిలుకుగిలుకు వ్రేలియందు కింకిణీసచ్ఛంబు
తాళమానంబుతో మేళవింప
రాగమునమండి లంఘించు రాగమునకు
నురుమయూరుద్వయంబులై కొత్తరిల్ల
కామవల్లీమహాలక్ష్మి కైటభారి
వలపు వాడుచువచ్చె జక్కులపురంధ్రి"

అప్పకవి యక్షగానలక్షణము నిట్లు చెప్పినాడు:

తుద నేడులఘువులు తొలఁగించి చదివినఁ
ద్రిపుటకు వృషభగతిపదయుగము
లలిఁ గడపల నొక్కలఘువు మానిన జంపె
మను ద్విరదగతిసమపదయుగము
సురుతసురచ్చరకు దురగనల్గనా
హ్యయ నేకతాళి యామధురగతి
సంకీర్ణదివ్యదినాలు గలతాళమున మాత్ర
లోలి విశ్రాంతి పద్మాలుగింటఁ
జెలియ నర్ధంబు నర్ధచంద్రికలు వీన
యక్షగానప్రబంధంబు లకుకవచ్చు
రగడభేదంబు లివి యండ్రు రసఁగవీంద్రు
లవితనిజసేవకస్తోమ యబ్ధిధామ.

పై పద్యమునుబట్టి చూడఁగా యక్షగానములందలి ప్రధాన గేయరచనములు దేశిరచనలగు రగడలలోఁ గొంత మార్పు జరిపి - త్రిపుట, జంపె, ఏక, అట అను తాళముల కనుగుణముగాఁ గల్పింపఁబ?

4. శ్రీనాథుఁడు భీమఖండమున దాక్షారామభీమేశ్వరమహోత్సవసమయములందు సానులు (వేశ్యలు) వేషములు వేసికొని నాటకములాడుట నిట్లు వర్ణించెను.

విరులదండలతోడి వేణికాభారంబు పొంకంబు పిఱుదులఁ బొరలి యాడ
మణిశిలాకోటికోమలరుచుల్ తొంగరబు రవలిమల్లెలమ్రోఁత యవఘళింపఁ
సుదురు సించిన చిన్నిసుబ్బచన్నులమీఁద ముత్యాలత్రిసరంబు ముకువుఁ జూప
బలమానతాటంకవజ్రాంకురచ్ఛాయ లేఁతచెక్కులఁ జుక్కలించి యుమియ
సాని యీశానిరై మహోత్సవమునందుఁ గేల నవచంద్రకాంతపు గిన్నె పూని
పీఠి భిక్షాటన మొనర్చునేళఁ జేయు, మరులు నృత్యంబు జగముల మరులుకొలుపు. —ఆ. ౧. ౧౦౫.

వ......మహోత్సవమండపమునందుఁ జేరోలగుఁబుండి, కుండలీదండలాసక శ్రేణీశ్రేణిభంగుఁదుకదుక ధమారిచేలమత్తిల్లి హల్లీసకాదినృత్యంబు లవలోకింపుచు- —ఆ. ౧. ౧౧౭.

శ్రీనాథుని కాలమున దేవోత్సవాదులయందు వేశ్యలు వేషములు కట్టి నాటకములఁ బ్రదర్శించుసంప్రదాయము నెలకొనియున్నది.

నవిగాఁ గానవచ్చును. అప్పకవి రగడవికార రచనములను తాళములపేరనే పేర్కొనెను గాని వానికి పేరులు వేఱ తెలుపలేదు. అప్పకవి పేర్కొన్న యీ రచనములే తాళ యక్షగానములలో నింక ననేకవిధము లయిన దేశిరచనములు చేరినవి. ఏలలు, జోలలు, సువ్వాలలు, ఆరతులు, ధవళములు, శోభనములు, చందమామసుద్దులు, వెన్నెలపదములు, తుమ్మెదపదములు, గొబ్బిపదములు, కోవెలపదములు, చిలుకపదములు, అల్లోనేరెళ్లు, త్రిభంగులు, సీస-కందార్థములు, ద్విపదలు, త్రిపదలు, చౌపదలు, షట్పదలు, మంజరులు, జక్కులరేకులు - మొదలగునవి వానిలోఁ గొన్ని.

యక్షగానము లిట్లు వెలసినను ప్రాచీనము లయిన కొరవంజిరచనములును నీ కాలమునఁ గూడఁ గొన్ని సాఁగుచునే వచ్చినవి. దేవోత్సవ రాజాస్థానాదులం దిట్లు వేశ్యలచేఁ బ్రదర్శింపఁబడుచున్న యక్షగానములు పెంపొందుచుండు కాలమున దక్షిణదేశమున విజయనగరరాజ్యమున కుపశాఖలుగా తంజావూరు, మధుర రాజ్యము లాంధ్రనాయక రాజుల పరిపాలనమున వెలసినవి. ఆంధ్రదేశమునందును, దక్షిణదేశమునందును ఈ కాలమున యక్షగానరచనము మిక్కిలి ప్రబలఁ జొచ్చెను. ఇవి యిట్లు కలావతులచేతఁ బ్రదర్శింపఁబడుచున్న వాటగొఱఁతగాఁ గని పట్టియో యేమోకాని, కృష్ణాతీరమునందలి కూచిపూఁడి గ్రామమున సిద్ధేంద్రుఁ డను యోగీంద్రుఁ డొకఁడు భాగవతకథలను పారిజాతము, గొల్లకలాపము మొదలగు పేరుల యక్షగానములుగా రచియించి శాస్త్రీయమయిన భరతనాట్య సంప్రదాయములకు రక్షగా, స్త్రీనిస్సహాయముగా, నాయూరిబ్రాహ్మణులచేతనే ప్రదర్శనము చేయింప నేర్పాటుచేసెను. ఆయూర జన్మించిన బ్రాహ్మణుఁ డెవ్వఁడుగాని, ఒక్కతూరియైనను యక్షగాన ప్రదర్శనమున స్త్రీవేషమును ధరించి తీరవలెననియు, అది వారి కులాభ్యుదయహేతు వనియుకూడ శాసించెనఁట. నేఁడుకూడ కూచిపూఁడి బ్రాహ్మణులు శాస్త్రీయమయిన భరతనాట్యముతో భాగవతకథలను ప్రదర్శించువారుగా నున్నారు. ఈ సంప్రదాయము వెలసినపిదప నేతత్ప్రదర్శకులకు భాగవతులనియు, తద్రచనములకు భాగవతములనియుఁ బేరయ్యెను. ఈభాగవతకథలలో పారిజాతహరణకథ హృద్యతర మగుటచే దానికిఁ బ్రచార మెక్కువయ్యెను. అది హృద్యతర మగుట కందలి నవతులకయ్యపుఁబట్టు ప్రధానకారణము. దీనినిఁబట్టి యక్షగాన సామాన్యమునకుఁ బారిజాతము లనియుఁ బేరయ్యెను. ఏయక్షగానముఁ బ్రదర్శించినను అందు నవతుల కయ్యపుఁబట్టునకుఁ బ్రసక్తి గల్పించుటయో, లేక, పారిజాతమునందలి తత్కథాఖండమునే స్వతంత్రముగాఁ బ్రదర్శించుటయో పిదప నేర్పడెను. ఈ నవతుల కయ్యపు కథపట్టు హృద్యతర మగుటచేఁ బ్రబంధకవులనుగూడ నిది వలపించెను. కళాపూర్ణోదయమున పింగళి సూరన్న పారిజాత కథలోని నవతులకయ్యపుఁబట్టు నిట్లనుకరించెను.

"మానినీవృత్తము:

అంత మదింపకుమే యని పల్కిన
నంత మదింపకవే యనుచున్
గంతు లమందెద లెమ్మని పల్కిన
గంతు లడంచెద లెమ్మనుచున్

రంతుల కేమి ఫలం బని పల్కిన
రంతుల నేమి ఫలం బనుచున్
బంతము మాడఁగదే యని పల్కిన
బంతము చూడఁగదే యనుచున్;

సీ. ఒట్టుసుమీ యన్న నొట్టుసుమీ యందు
చేసేమి యనిన చేసేమి యనుచుఁ
గానీగదే యన్నఁ గానీగదే యంచు
నింకేల యనిన నింకేల యనుచు
నోసి పోవే యన్న నోసి పోవే యంచు
నా వంటి దనిన నా వంటి దనుచు
మఱువకు మిది యన్న మఱువకు మిది యంచు
నీ చెంత యనిన నీ చెంత యనుచు
నొక తెమ్మగనికి నాసించు టొప్ప దనిన
నొక తెమ్మగనికి నాసించు టొప్ప దనుచుఁ
బట్టి యాడె నారంభతోఁ బ్రహ్మరంధ్ర
స్థితయుఁ జు నిలుచున్న నిలువక పెద్దరొదగ.
కళా. ఆ. ౩, ౧౯౫, ౧౯౬

ఆంధ్రదేశమున వెలసిన యీ కూచిపూఁడి భాగవతముల ప్రయోగవైశారద్యము దక్షిణదేశమునకుఁ గూడ వ్యాపించినది. ఆ నాఁడు కూచిపూఁడి భాగవతుల యాట భాగవత సంప్రదాయము నేఁటికిని దక్షిణ దేశమునఁ గలదు. దక్షిణదేశమున బ్రాహ్మణులు పురుషులే నేఁడును భాగవత యక్షగానములను దెలుఁగువానినే ప్రదర్శింతురు. ఆంధ్రదేశమున వెలసిన యక్షగానము లిన్నూటికిఁ బైచిలుకు పరిగణింపబడినవి. వీని ననుసరించి వెలసిన దక్షిణ దేశపు యక్షగానములు మున్నూటికిఁ బైచిలుకు గలవు. భక్తాగ్రేసరుఁ డనఁబడిన శివనారాయణ తీర్థులవారు కృష్ణలీలా తరంగిణీ కర్త త్యాగరాజస్వామిగారు కూడ పారిజాతాపహరణమని, నౌకాచరిత్రమని భక్తి రసభరితము లయిన యక్షగానములను రచియించిరి. భగవత్కథలతోఁ బురాణ కథలతోఁ బెంపువెలసిన యీ యక్షగానములు తత్ ప్రదర్శనములు నాయకరాజుల కాలముననను, మహారాష్ట్ర రాజుల కాలముననను మితిమీఱి యాయారాజుల శృంగార జీవితవర్ణనాత్మకములుగాఁ గూడ రచితములై ప్రదర్శితము లగుచు వచ్చినవి. దిక్ప్రదర్శనముగాఁ గొన్ని కురవంజులను, యక్షగానములను జేర్కొనుచున్నాను.

"కిరాతార్జునీయము, గంగా గౌరీ విలాసము, అలమేలుమంగావిలాసము, ఎఱుకల వేష కథ, కపోతవాక్యము, గరుడాచలము, త్రిపురసంహారము, దారువనక్రీడ, నల చరిత్ర, నిజలింగ చిక్కయ్య కథ, కన్యకా చరిత్ర, పారిజాతాపహరణము, పార్వతీపరిణయము, మృత్యుంజయ విలాసము, శివపారిజాతము, సముద్రమథనము, విజయరాఘవ చంద్రికావిహారము, రఘునాథనాయకాభ్యుదయము."

భిన్నపాత్ర వేషధారణము లేక సింగి, సింగఁడు (కొన్నింట కోణంగికూడ) పాత్రలతో వెలసిన వీథినాటకము లనఁబడు కురవంజులు యక్షగానరూపమునఁ బెంపొందినపుడు వేషభేదముగల పాత్రభేదములను బెంపొందెను. సంధివచనములఁ జెప్ప కోణంగి, లేక, సూత్రధారుడు, 'వచ్చె నమ్మా సత్యభామ' ఇత్యాదివిధములను, 'అంతట హనుమంతుఁ డేమనుచున్నాడు' ఇత్యాది విధములను బాత్రములఁ జేర్కొనఁగా తద్వేషధారులు వచ్చి తమయాటపాటలు నెఱపుదురు. ఇట్లు పెంపొందిన యక్షగానములు కాలక్రమమున పాత్రబాహుళ్యము రంగభేదములుకూడ గలవై కొంత సంస్కృతనాటక

చ్ఛాయ చొప్పడఁగా నాటకము లను పేరను గూడఁ జేర్చవలసినవి.

## సుగ్రీవ విజయము

ఇంచుమించుగాఁ దెలుఁగున నేనాఁటింటిదాఁక లెక్కింపఁదగియున్న యక్షగానములలో సుగ్రీవ విజయ మొకప్రశస్తకృతి. దీనికర్త కందుకూరి రుద్రకవి. ఈతఁడు విశ్వబ్రాహ్మణవంశ్యుఁడు. కందుకూరికిఁ జేరువనే పాలేటియొడ్డునఁ గల చింతలపాలె మను గ్రామ మీతనియూరు. ఆయూర నేతద్వంశ్యు లిప్పటికిని గలరు. రుద్రకవియూలమున నా వంశమువారికి 'కవివారు' అని యుపనామ మేర్పడినది.

ఆవంశమున రుద్రకవికిఁ దర్వాతఁ బలువురు రుద్రకవినామకు లుండిరి. తొలుతటి రుద్రకవి కృష్ణదేవరాయల యాస్థానమున నష్టదిగ్గజము లనఁబడుకవు లెనమండుగురిలో నొక్కఁడుగా నుండెనట. మల్కిబ్రహీంకాలమునఁగూడ నొకరుద్రకవి[5] యుండెను. ఇబ్రహీంకాలమునఁగల రుద్రకవియే కృష్ణరాయలకాలమున బాలుఁడుగా నుండఁబోలును. చింతలపాలె మనుగ్రామమును మల్కిబ్రహీంప్రభువే రుద్రకవి కొసఁగెను.

అష్టాశీతి చతుశ్శతాధికసహస్రం షై శకాబ్దాగతాః
అస్మిన్ శ్రీజయవత్సరే జయతిథౌ మాసేచ మాఘే తథా
పంచమ్యాం ద్వయతింత్రిణీజనపదం రుద్రస్యవిద్వత్కవేః
ప్రీత్యా శ్రీయిభిరామభూపతిర కాత్ క్షోణీసురాఖండలః.

ఇబ్రహీంప్రభు విచ్చిన యగ్రహారమును నిన్నమొన్నటిదాఁక, తద్వంశ్యులే యనుభవించుచుండిరి.

సుగ్రీవవిజయము రచించిన రుద్రకవియే నిరంకుశోపాఖ్యానమను గ్రంథాంతరము రచియించెను. రెండుగ్రంథము లందును గర్తకు కందుకూరు జనార్దనభక్తత్వము, పెదలింగనార్యపుత్త్రిత్వము గలదు గావున రెండుగ్రంథములు నొక్కరవే యగుట స్పష్టము. నిరంకుశోపాఖ్యానమున "చేరికన్నడభూమిచెఱవట్టుపాశ్చాత్యనృపతికైనను కొంత కృపదలిర్చు" అని సీసచరణ మున్నది. అది విద్యానగరమును దురుష్కులు కొల్లగొట్టినదుస్సందర్భమును దెలుపుచున్నది. విద్యానగరనాశనము క్రీ. శ. ౧౫౬౫ నాఁడు జరిగినది. కావున నిరంకుశోపాఖ్యాన రచన మటుతరువాత జరగినదగును. అప్పకవీయమున వినుకొండలో గుంటుపల్లి భాస్కరయగారి సముఖమున కందుకూరి రుద్రకవి కవితాచర్చ జరపినట్లు కలదు. మనరుద్రకవి యాతఁ డగునేమో! నిరంకుశోపాఖ్యాన సుగ్రీవవిజయకర్త క్రీ. శ. ౧౫౬౮ ప్రాంతములవాఁడేని కొంతతర్వాతవాఁడేని కాఁగలఁడు. దక్షిణదేశమం దల్పముగా నాంధ్రదేశమం దధికముగా యక్షగానములరచనములు, ప్రయోగములు సాఁగుచుండినకాల మది.

శ్రీమద్రామాయణమునఁ గల కథాఖండములలో సుగ్రీవవిజయకథ యొకకండపట్టు. అత్యల్పకాలమున వడివడిగా గంటలలో నడచిన యాకథపట్టు రామలక్ష్మణులు, హనుమంతుఁడు, సుగ్రీవుఁడు, వాలి, అంగదుఁడు, తార అనుకథాపాత్రముల శీలపుమేలిమి

5. రుద్రకవివిషయమును చాటుపద్యమణిమంజరి ద్వితీయభాగమునఁ జూచునది.

మెఱుఁగు తఱుగుల నొఱచిచూపిన యొఱగల్లనఁదగినది.

తెలుఁగున గుత్తెనదీవిరామాయణాదులగు రామాయణగేయకృతులలో సీసుగ్రీవవిజయపుఁగథపట్టు చాల హృద్యరచనములతో నున్నది.

"ఎంతపని చేసితివి రామా ! నిన్ను
ఏమనందును సార్వభౌమా !
చెంత కీటు రాలేక చెట్లలో దాగుండి
వింతమృగమును గొట్టినిన మాయె నాబ్రతుకు"

ఇత్యాది గేయములను పలువురు పాడుచుందురు[6]. ఈ రుద్రకవి సుగ్రీవవిజయమునుగూడ స్త్రీ వృద్ధ పామరాదులు పలువురు పాడుచుందురఁట. ఆయాపాత్రముల పాటలు తత్తద్వేషధారులు వచ్చి పాడునట్లును తక్కిన సంధివచనాదులు ఒక్కరిద్దఱు సూత్రధారప్రాయులు పఠించునట్లును నీ సుగ్రీవ విజయము వీథినాటకగా నాడఁబడుచుండెడిది.

ప్రాచీన సంస్కృత నాటక రచయితలు భాస భవభూత్యాదు లీ సుగ్రీవవిజయౌచిత్యమును దమనాటకములో విమర్శించిరి. శ్రీ రాముని శీలమును శ్రీ వాల్మీకి రామాయణ పద్ధతిని సమర్థించిరి. భవభూతి "యద్వా కౌశల మింద్రసూను దమనే తత్రా ప్యభిజ్ఞో జనః" అని దీనియౌచిత్యము నించుక చెనకెను. మన రుద్రకవి సంస్కృతాంధ్ర రామాయణకవులు త్రొక్కినత్రోవనే త్రొక్కెను గాని, యపూర్వ కల్పనాంశము నేమాత్రము చేర్పలేదు. ఆయా పాత్రములు ప్రసిద్ధరామాయణములలో నెట్టి యుక్తిప్రత్యుక్తులు గలవినా చిత్రితము లయ్యెనో ఇందు నట్లే కలదు. కాని యిది దేశి రచనములతో గేయరూపమున నుండుట విశేషము. ఇందలి క్రింది గేయరచనలు ప్రశస్తమయినవి.

హా సతీమణి ధర్మచారిణి హా గుణోన్నత జనకసుత ననుఁ
బాసిపోయితి వింతలోనే పద్మనయన
లేతమాయలు మదిని దలియఁగలేక పాపపురక్కసునిచే
బోటి నినుఁ గోల్పడితి నిఁక నాకేటిబ్రతుకు.

*    *    *

లలన నినుఁ గలనైనఁ బాయఁగఁగలన నీ విటలేకయుండినఁ
జలన మొందెను నాదు హృదయము జలజనయన !

*    *    *

తరణికులమునఁ బుట్టి శరచాపములు పట్టి
తరుణి గోల్పడుకంటె మరణమే మేలు
నిను శౌర్యవంతుఁడని తనపుత్రి నిడినట్టి
జనకవిభుఁ డీవార్త విని వగవకున్నే

*    *    *

నాయ మెఱుఁగక చంపితివి నరనాథ పాపము
గట్టుకొంటివి
బోయ వింతియకాక నీ వొకభూమిపతివా!
కరుణాపయోధి రాఘవుఁడు ధర్మాత్ముఁడని
నరు లెంచఁగాఁ గాక వమ్మునె నిన్ను

*    *    *    *

ననుఁ జేరుకొని పిలిచి నాముఖాముఖ నిలిచి
జననాథ పోరాడి చంపలేనైతి
పొంచి యేసితి రామభూపాలకుల ధర్మ
మెంచుకోలేనైతి వెంతచేసితివి!

6. ఈ కథకుసంబంధించినవి చాటుధారలును బాలకులు పాడుచుందురు.

సీ. ఎవరయా మీరు - దండంబు దండంబు దశరథసుతులార !...

శ్రీరామ నీ రామఁ జెఱఁగొన్న రావణుని
వారిధిని ముంచితిని వాలమునఁ గట్టి
ఒకమాఁ నాకుఁ జెప్పక పోయితివిగాక
సకలదైత్యులను దునిమి జానకిని దేనె!

*     *     *     *

ఆలిఁ జెఱఁగొని చనినయట్టి దశాస్యు దుంచఁగ నిర్నిమిత్తము
వాలి నేటికిఁ జంపితివి రఘువంశవర్యా!
న్యాయ మేటికిఁ దప్పితివి నరనాథ!
బోయెనే నీరాజనీతియు భూతినుతికున్.

శ్రీరామచంద్రమూర్తి చెట్టుచాటున నుండి వాలిమేన గాఁడ నేసిన వాఁడిములుకుల కంటె నిక్కడ తార ప్రత్యక్షమై నిలుచుండి శ్రీరాముని యంతరంగము నుచ్చిపోవునట్లు ప్రయోగించిన పలుకుములుకులు క్రొవ్వాఁడి గలవి. ఈలఘుకృతి వీరకరుణరస భరితము. నీతిహృద్యము. స్త్రీబాల పామరాదులుకూడ పఠింపఁదగినది.

ఈ యక్షగానమున నీక్రింది దేశిరచనలున్నవి. త్రిపుట, జంపె, కుఱుచజంపె, అర్ధచంద్రికలు, అటతాళము, ఏకతాళము, ద్విపదలు, ధవళములు, ఏలలు. ఇందు అర్ధచంద్రికలు త్రిపుటాదిరచనల ఖండరచనలు గాఁబోలును. ఇందలి యర్ధచంద్రికలెల్ల నొక్క తెలుఁగు నడకగలవిగాక భిన్నగతులతో నున్నవి. సంగీతతాళలక్షణము లెఱిఁగినవారు వానిప్రభేదముల గుర్తింపవలెను.

కురవంజులు అనుగానములు ఇంకను మంచిరచనములుగలవి కొన్ని యున్నవి. అవి యేవేని యీసుగ్రీవవిజయమువలె ముద్రితములయినచో ఆంధ్రమధురకవితా విశేషములను సహృదయు లింక నధికముగా నాస్వాదింపఁగల్గుదురు.



# రెండు గీతములు

'సంపత్'

## ఎవరికోసము ?

ఓప్రభూ! నాఁటి భరత నాట్యోత్సవమున
నొక్క సౌదామినీ రేఖ యొరిగినట్లు
జాఱిపడె నేదొ మణిభూష సాంధ్యవర్ణ
శబలితాలయ నర్తనశాలయందు.
నీవు నాకోసమే జార్చినావటంచు
వలపు దగఁగొన్న తీయని కలలఁ దోఁగి
కడల నెవ్వరులేని యేకాంత మరసి
వెదకి చూతునా భూష కన్పించదోయి.
వెకిలి చూపుల నావృథాన్వేషణమ్ము
నిదుర చెదరిన ముసుఁగుల నదుముకొంచు
లలిత పక్ష్మాంచలాచంచలాంచితాక్షి
నడలు చూపుల జూచె నుషఃకుమారి.

దేవ! అమృతమో - అనలమో - తెలియలేని
వలపుటాసల పేదకోర్కెల చలించు
కరుణజీవిక కది కాన్క కాదయేని
ఎవరికోసము జార్చితోయీ నటేశ ?

## నిశాగీతి :

ఈ నిశాగర్భ కుహరమ్ములోన రేగి
చిమ్మచీకటి పురివిచ్చి చిందులాడ,
ఘోర నృత్యోత్సవాభీల కుటిల భృకుటి
కాళపాక్రౌర్యరేఖావికార మరసి,
చెదర నామెద వెన్నెల కదియునంచు,
చిన్ని నెలవంక చిఱునవ్వు చిందునంచు,
భావిభాగ్యము లాసించి బ్రతుకుచున్న
ఈ నిశీథాన, నాకొఱకింత జాలి,
ఇంత నిట్టూర్పు వొడమని ఈ దరిద్ర
దురిత హేమంత జీవితభరము వోయ
విమలమోహన గీతామృతము - మదీయ
భగ్నజీవిత హృదయ ప్రవాళమధువు;
శర్వరీరాగ హసితమ్ము; సకలపుణ్య
ఫలిత జీవన ప్రాభాత భాగ్యరేఖ—
తక్క, వేఱొకచుక్క లేదాయె దేవ!



# ప్రాకృత కవిత

శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు

రసికులమగు మనకు, ప్రాకృతకవులు గట్టి యిచ్చిన పాథేయము వెలగలది మాత్రమే గాదు, చాల రుచిగలది గూడ. గౌడవహము, ఆదిపురాణము, సేతుబంధము యశోధరచరిత్ర, మొదలగు కావ్యములు మెదడునకును, మనస్సునకును గూడ నానంద మొసగునవి. జైన బౌద్ధ వాఙ్మయములు, ప్రాకృతభాషలయందు, విరివిగా నున్నవి. నాటిసామాన్యభాష బహుశః ప్రాకృతమే యయి యుంటచే మతకర్తలు వానినే యాశ్రయించిరి. అందును, ప్రాకృతములయందు, జైనమున కున్నంత వ్యాప్తి మరి దేనికిని గానరాదు.

ప్రాకృతభాషాపోషణమున నాంధ్రుల కీర్తియు, లెక్కకు రానిదిగాదు. వారి సభలలో ప్రాకృతమును బోషించిరి. కేవలము బోషించుటయేగాక దాముగూడ జేయిగలిగించుకొని బనిజేసిరి. రసఘుటికల వంటి, మనోహరములగు చాటువుల నేర్చి కూర్చి, రూప మిచ్చిన శాతవాహను డాంధ్రుడే. ముగ్గసామి, హాలియుడు, పాలితుడు, మొదలగువా రాంధ్రు లని యూహించుట కవకాశము లున్నవి. "గాథాసప్తశతి"లోని, చాల శ్లోకములలో, మన జీవితము, నాటి యాచారములు ప్రతిఫలించి యున్నవి. ఆ చాటువులయం దసంఖ్యాకము - లాంధ్ర పురుషుల కుంచికలనుండియే యావిర్భవించి నవి. ఆంధ్రులకును, ప్రాకృతమునకును గల సంబంధము నాటిది నేటిది గాదు. జైనబౌద్ధములు - దక్షిణాపథమువైపు, మొగదిరిగినది మొదలు, ప్రాకృతము నాంధ్రరాజులు ప్రేమింప మొదలిడిరి. రసికతాప్రియులగు నాంధ్రుల మనస్సులను, లలితగంభీరమగు నాభాషయే లోగొనజాలదనుట దెలియని తనము. చట్రాళ్ళబోలు సమాసములు, లలితోచ్చారణమునకు దావీయని కర్కశము లగు వత్తులు మొదలగువానితో, "సదమదమై" యుండిన, సంస్కృతముపై బెరిగిన యభిమానమును దిన్నగ జారియుండును. నాటినుండి, యాంధ్రుల యిండ్లయందు, ప్రాకృతభాషాజ్యోతులు వెలుగ మొదలిడినవి. కాని యావెలుగు నిలిచినది కొన్ని దినములే. ఇంతలో దక్షిణాపథమునుండి, ద్వైత విశిష్టాద్వైతములు తన్నుకొని వచ్చినవి. వారి వీరమతాభిమానమునకు, ప్రాకృతకావ్యములకు బొత్తు గుదరలేదు. జైన బౌద్ధముల ద్వేషించిన, దాక్షిణాత్యుల కా భాషకుగూడ బహిష్కారము వేయక తప్పినదిగాదు. దానితో సంపూర్తిగా ప్రాకృతజ్యోతు లారిపోయినవి. కొన్ని ప్రాకృతశ్లోకములు, వేదాంత దేశికులవారు వ్రాసినవని ప్రచారములో నున్నవి. వాని లోని బంధము, గతి మొదలగునవి దృష్టికరముగ లేకపోవుటయేకాక, వికారముగా గూడ బరిణమించినవి. వానిని మరి దేశికుల

వారే వ్రాసిరో, లేక మరెవ్వరైన వ్రాసి, వారిపే రతికించిరో చెప్పలేము. ఒకవేళ వారే పూరించి యుండినను, ప్రతిష్ఠకొఱకై వ్రాసియుందురేమో గాని, యీ భావల యందలి సరసమగు సానుభూతితో మాత్రము గాదు. అంతవఱకు నిజము. వారి నాటకమునయందు ప్రాకృత మున్నది. అయ్యది ప్రాచీనుల సంప్రదాయము ననుసరించి, గతానుగతికముగ వ్రాసినదియె. ఇంతకు, సంస్కృతవాఙ్మయమున ప్రాకృతమును వాడి "ఛీ" యనిపించుకొన్న వారలు, చాలమంది లేరు. సరిగదా!

ఆంధ్రులకు ఆదినుండియు నంటివచ్చిన దురలవాటు యుపేక్ష. ప్రతిదానియందును నిందుమించి పరిణామమే గాన్పించును. అందులో, మతోద్రేక మొకటి తరుముకొని వచ్చినది. ఆ యుపేక్షయు, నీ మతపిచ్చియు జేరి, ప్రాకృతమును బారద్రోలినవి. ఆంధ్రుల కుండిన ప్రాకృతాభిమానము క్రమక్రమముగా సన్నగిల్లి నశించినది. కాగా నేటి "కాంధ్రులకును ప్రాకృతమునకును సంబంధ ముండెనా" యని సందేహించు పద్ధతికి దిగినది మనగతి. చేతికి జిక్కిన కాణాచిని, నడువీథిలో గాల దన్ని, నట్టింట గూర్చొని యేడ్చు "దేబె" లైనాము మనము. మన విజ్ఞానము, మనసహృదయత, కళావిదగ్ధత ప్రతిదియు ప్రాకృతభాషతో నంతరించినది. కడకు మనకు గల స్నిగ్ధలలితగంభీరమగు ప్రత్యేకత నశించి, సంస్కృతమునకు దాసులై దానియడుగుజీడల నడువవలసిన వ్రాత వ్రాసినది. మన మెంతయభాగ్యులము!

అభిమానము లేక, నిజమగు సహృదయతతో బరీక్షించు రసికునకు ప్రాకృతకవనమునకు ముందు, గీర్వాణకవిత యొకమంటిముద్ద. ప్రాకృతము శిరీషమధుర కోమలము. సంస్కృతము వజ్రకఠినము. అందులకే గాడవహాకారుడు సంస్కృత ప్రాకృతములకు, స్త్రీ పురుషుల కున్నంత భేదము గల దన్నాడు. స్వభావమధురమగు నాభాషలో దేనిని జెప్పినను, భాషాబంధమున భావబంధము రింగుమని మ్రోగును. పైగా వారి భావోన్నతి, కల్పనాచాతురి, స్వతంత్రత కన్నులల్లార్చి ధ్యానింపదగినవి. నాటివాడుకభాష యది యగుట మరియొక విశేషము. వారి స్వభావవర్ణనలు మనకు బారెడుదూరములో గాక, మానవజీవితమునం దైక్యమై యనగి పెనగిన ట్లుండును కాని, మనకు, వారి పలుకుదనమును, పదశక్తిని గమనించి యానందించు జీవశక్తి నశించినది. వారిభాష సరిగా నర్థముగాదు. అందుచే వారి భావములను గూడ మనము సరిగా గ్రహింపలేము. గీతిక చదివినవెంటనే, భావము మనయింటి లుంగిళ్ల వరకు నడచివచ్చిన ట్లుండును - కాని భాష బలవంతముగ భావమును దూరము లాగికొనిపోవును. ఇక మిగులునది హతాశ యొకటే. ఇక నాటికి నేటికిగల యాచారములు చాల మారినవి. పాశ్చాత్య నాగరికత యనునది ప్రాచీనజీవితమున కొకతెరయైనది. ఈనాగరికత పల్లెపల్లెకును ప్రాకిపోవుచున్నది. నేడు నెమలిపింఛమును జెక్కిన పల్లెపడుచు, గురువిందహారములు గూర్చుకొన్న క్రొత్తకోడలు, సింగాణి బుచ్చుకొని మొనగత్తెయై ముందు నిలిచి, ఆముమినలాడు సివంగుల జొడాడు బోయెత గానబడుట లేదు. వింధ్యశిఖరములపై, ధనుస్సుల నూనుకొని, క్రొత్తమేఘముల సోయగము జూచుచున్న పుళిందుల

వంటి యమాయికులు, నేడు బల్లెలలో గూడ కంటబడరు. ఈ రీతి వారి జీవితములోని లలితత, భావములలోని ఘనితనము, భాషలోని నయగారము మనకు దెలియక పోవుటచే, ప్రాకృతములోని తీపి మనసున కంటక పోయినది. చూడుడు:

“జహిరసియసింగాయి - ఉద్ధరియ కండాయి
భుయదండ ధక్కలియ - కోదండదండాయి.
లంబంత మాతూర - పింఛోహాణివసణహి
మసిథా ఉమండణాయి - పిత్తల విహూసణాయి
కడిబద్ధచలచీరి - యా యంఘజాలాయి
కరధరియ విఫ్ఫురియ - కత్తియకవాలాయి
పాయడి యణియగురుక - మారూఢలింగాయి
కులఘోసమయ చమ్మ-పచ్చాయి యంగాయి
ముద్దావిశేశేణ - దూరంణ మంతాయి
పయఘుఘ్ఘరోలిహి - ఘువఘువఘుకంతాయి
కవకవకహంతాయి - పలియూరవేసాయి.
ముక్కట్టహాసాయి - ధుుంపడియ కేశాయి
జహివిలివాభేసూయి-కఉలాయిమిలియూయి
కీలంతిడడ్ఢరయి - అట్టంగవలియాయి।
జహికరడపడహోయి - వజ్జంతివజ్జాయి
ఇట్టాయి మిట్టాయి - పిజ్జంతి మజ్జాయి
... ... ...
... ... ...
మారీయె దేవీయె దేవాలయేతమ్మి.

(ఆసహాకచరిత)

ఈనాటను పల్లెటూళ్లయం “దూరి దేవతలు, జాతరలు మొదలగునవి జరుగుచునే యున్నవి. పోతలరాయని యార్భాటము, త్రావి, కాంగ్రెస్సువారి దయచే నేడు దప్పినదిగాని, తందనాలు త్రొక్కువారి వైరికేకలు మన మెఱుగనివి కావు. కాని, యిత్తడితో గావించిన యాభరణములు, నెమలిపురుల శేఖరములు, ముద్రావిశేషములు మొదలగునవి నేడంతరించినవి. భాష క్రొత్తది. ఆచారములు ప్రాతవైనను, మనకు క్రొత్తవి గావలసివచ్చినవి. అందులకే మనకు వారి రచనలర్థము గావు. స్వభావ వర్ణనములే యిటు లుండ నిక భావనానిబద్ధములగు నూహాలుమాత్రము మన కర్థమగునా? వారు గ్రహించు వస్తువులు బ్రహ్మాండమైనవి. వాటి నాధారముగా గైకొని గావించు కల్పనలు మరింత గొప్పవి. అట్టివర్ణనలు, తెలుగునం దొక యాముక్తమాల్యదలో దప్ప, మరి దేనియందును గానరాలేదు. దీనిబట్టి చూడ, రాయలకు ప్రాకృతములయందు, సంపూర్ణమగు నాదరాభిమానములును, గానలసినంత కన్న నెక్కువ పరిచయమును గల దని దోచుచున్నది. శ్రీనాథుడు, “గాథా సప్తశతిని” దెనిగించినాడు గదా! అతని యందును, ప్రాకృత కవుల జాడలు బొడకట్టలేదు. బహుశః, అతడు “పద కవి” యగుటచే, భావములపై నంతగా దృష్టి నిడి, వాని ననుకరింప యత్నింపలే దేమో! ప్రాకృతకవుల, కల్పనాచాతురికిని, వారి వస్త్వాన్నతికి నొక రెండుదాహరణము లిత్తును.

“రవియర కేయరణివహం, సోహాయి
ధవలబ్భదల సహస్సపరిగయం మహుమహ
దంసణజోగ్గం పితామహుప్పత్తి పంకయం
వణహాయలమ్.

ఛాయ—

రవికర కేసరనివహం, శోభతే ధవలాభ్రదళ సహస్ర పరిగతం। మధుమదనదర్శనయోగ్యం, పితామహోత్పత్తిపంకజ మివ నభస్థలమ్.

ధుయ మేహమహుయరాఓ - ఘణ సముధాయడ్డి ఓణయవిముక్కాఓ, ణహపా యవసాహఃఓ, ణియ యట్ఠాణంలిపడిగహా ఓదిశాఓ.

ఛాయ—

ధుత మేఘమధుకరాః ఘనసమయాకృష్టఅవనత విముక్తాః నభఃపాదపశాఖాః నిజ స్థాన మివ ప్రతిగతా దిశః.

పై రెండుశ్లోకములయందును, వస్తుగౌరవ మున్నది. అనంతమగు గగనాండమును, పద్మమునకు బోల్చి చెప్పినపుడు, మనభావన పరిమిత మగుటచేతనో, లేక మన శాశక్తియే నశించినదో జెప్పలేముగాని భావనాకల్పిత మగు నాదృశ్యము నూహింపలేక తికమక లాడుదుము. ఆకస మొకవృక్షమట. ఘనసమయమను పురుషుడు దానికొమ్మలను వంచి నాడట. మేఘములను తుమ్మెద లెగిరిపోయినవట. దిక్కులను కొమ్మలు సమయపురుషుడు పట్టువిడిచిన వెంటనే, యథాస్థానమును జేరినవట. ఓ హో హో! ఇది యెక్కడి దృశ్యము! మేరుపర్వతము ముందు పిపీలికలవలెనున్నాము మనమీ భావనాశక్తియెదుట. ముసలియవ్వల, యూకుడుకథలు గ్రుక్క్రిప్పక విను మనుమలవలె నిశ్చలనిబద్ధనేత్రులమై, చదువవలసినవారమేగాని, మన భావన లా వస్తువుల నందుకొనుట మాత్రము సున్న. వారి వస్తూన్నతివలెనే, కల్పనాచాతురియు మహోన్నత మైనది. పర్వత శిఖరమునందు విరిసిన సూర్యకిరణములవలె, భావనాశక్తియొక్క కడపటితారపై ధ్వనించునవి వారి యలంకారములు. తీగెలు సాగవు. నక్షత్రములవలె తళుకు తళుకుమని మెఱయును చూడుడు:

"చందా అవధవలాఓ ఫురంతడియ రయణంతరియఃశోహాఓ, సా మేృ్మ, సరయస్స ఉరే-ముత్తావల విబ్భమంవహంతి దిశాఓ"

ఛాయ—

చంద్రాతపధవలాః స్ఫురద్దినకరరత్నాంతరిత శోభాః! సా వేృ్యశరద ఉరసి, ముక్తావలివిభ్రమం వహంతి దిశాః.

శరత్కాలమున తెల్లనివెన్నెలచే గూడిన రాత్రులు ముత్యములైనవి. సూర్య కిరణాంతరితములగు పగళ్లు రత్నములవలె నున్నవట. శరత్కాల మనెడి, స్త్రీయొక్క యురమునందు, పరస్పర సంక్రమితకాంతులగు నీ రాత్రిం బగళ్ళు ముత్యాల పేరులైనవి. ఈ యలంకారములోని పనితనము భావుకు డూహింపగలడు.

ప్రాకృతకవుల ప్రకృతివర్ణనలు రమణీయములు. రాగరాగ కవులు కవిసమయములను ద్రాడులతో గట్టి ప్రకృతిని కుంటిదానిని గావించిరి. ఇంద్రధనువును జూచి, ఋతుమదనబాణచక్రముగను, నభోమందార నవకేసరముగను జూచి (సేతుబంధము) యానందించు రసికత, తారాప్రకరములను, గగనసముద్రమునందలి రజనివేలాలగ్నములగు ముత్తియములుగా భావించి యానందించు ఋషిత్వము (సేతుబంధము) మనలో నడుగంటినది. ఆకసమున గుంపులు గట్టి పారు చిలుకగుంపులను ప్రాకృతకవి యెంత మధురముగ భావించుచున్నాడు!

ఉయ పెమ్మరాయ మరగయ - సంవళియాణహాయలా ఓ ఓయరయి ణహాసిరి కంఠబ్భట్ఠవ్వకంతి యాకీరరింఛోలీ.

ఛాయ—

పల్య-పద్మరాగమరకత సంవలితా నభ స్తలా
దవతరంతీ నభశ్శ్రీ కంఠభ్రష్టేవ కంఠికా కీరరింఛోలీ.

[గాథాసప్తశతి]

ఇవియేగాక, సాలీడులు, గిజిగానిగూడులు, వెన్నెల పులుగులు మొదలగున వన్నియు వారికి కవిత సామగ్రియైనవి. అవర్ణించుటయందును, నుబుసుపోకకు మాత్రమేగాక రామణీయకతను, తీక్ష్ణపరిశీలనమును చూచి నింపుదురు. సేతుబంధకారుడు, శరదృతువును వర్ణించుచు "దరశుష్కచ్ఛవింవహంతీవ దివసాః" అన్నాడు. సూర్యకిరణములు సరిగ ప్రసరింపక, ప్రసరింపకయుపోక, తడితడిగా నున్న దివసములజూచి గావించిన మరోత్కృద్ఘాటన మది. వేరొకచోట, శరదృతుచంద్రుని వర్ణించుచు,

పజ్జత్తసలిలధోయే - దూరాలోక్కంత
ణిమ్మలేగయణయలే అచ్చాసణ్ణంవవియం
విముక్కపరభాయపాయడం ససిబింబం.

ఛాయ —

పర్యాప్తసలిలధౌతే, దూరాలోక్యమాన నిర్మలే గగనతలే అత్యాసన్న మివ స్థితం విముక్తపరభాగ ప్రకటం శశిబింబం.

మబ్బులు మూసికొనకుండుటచే, దిక్కులు వెనుక కొదిగినవి. కాగా చంద్రుడు భూమికి దగ్గరగా దిగినట్లును, గగనము వెనుకకు జరిగినట్లును గనబడుచున్నది; అనగా, చంద్రమండలమును, మనకు కంటబడ నంతటి సన్నని సాధనముతో, గగనాంగణమునుండి క్రిందికి, వ్రేలాడదీసిన ట్లున్నదని తాత్పర్యము. ఈరీతి, చాలగభీరమగు తీక్ష్ణదృష్టి ప్రాకృతకవులయొక్క ముఖ్యలక్షణము.

వీరియందు భావదాస్య మనునది మందునకైనను గానరాదు. "నూతనత" యను ధర్మము లేనిది, ప్రాకృతకవి కలము బట్టదు. కరకాండములు, ముఖకమలములు- యెక్కడనో, గ్రహములు వక్రించిననేదప్ప - మన దారి కడ్డదగులవు. రాముడు దర్శించిన సముద్రము కార్యారంభమునకు[1] యౌవనమువలె నుండెనట. రామబాణములచే ఘూర్ణిత మగు సముద్రము[2] విశ్వస్త ప్రసుప్త కేసరివలెగానవచ్చినది కవికి. ప్రభాతమున తరంగసంగతమై చలించు చంద్రబింబము, కింకర్తవ్యవిమూఢమయి చలించు శరధిహృదయమైనది[3]. ఇంకను ఇట్టి స్వాతంత్ర్యమును అలంకారములయందు, పలుకుబడియందు, కడకు భాషానిబంధనములయందును బాటించినవారు ప్రాకృతకవులు. అన్నియు విస్తృతముగ విమర్శింప నీచిన్ని వ్యాసమున నసాధ్యము. స్థూలారుంధతీ న్యాయమున జూపితి నంతే.

ఇట్టి మహత్తరమై, యుత్తమోత్తమమగు కవితను జదువని రసికు లెంత దురదృష్టవంతులు! అంతయో, యింతయో నధికారము గలిగి, ప్రాకృతమునందును నాంధ్రులున్నారనిపించినమన పూర్వు లెంత ధన్యులు! చేతికిదొరకిన రసఘుటికలను జారవిడుచుచున్న మనమో ... చాల యభాగ్యులము గాదా!

---

1. "కార్యారంభస్య యౌవన మివ సముద్రం" (సేతుబంధము.)

2. "అనంతరం శరనిర్భిన్న - వడబాముఖ విద్యుత్కేసర సటోద్ఘాటితః, ఉద్ధావితో రసన్, విశ్వస్త ప్రసుప్త కేసరీవ సముద్రః" [సేతుబంధము.]

3. "కింకర్తవ్యవిమూఢం ఘూర్ణతి హృదయ మివోదధేః శశిబింబమ్" [సేతుబంధము.]

# గ్రామసీమ

శ్రీ గోనుగుంట పున్నయ్య

౧

కను మట్టు తెల్లుపూరిపయికప్పు బెడంగునఁ, గావిజాతిసొం
పునఁ దగు మంటికుడ్యముల ముంగిట గోమయచర్చితంబులై
గొనబగు రంగవల్లు లొనఁగూర్చిన వేదికలన్, మనోజ్ఞమై
నను బ్రియమారఁ బిల్చు సదనం బది నిర్ధనతాతిరమ్యమై.

౨

కనులకు విందొ జానపదకన్యక వచ్చియు రాసి యౌవనం
బున రమణీయమూర్తియయి, ప్రొద్దుదయింపకమున్న ముంగిటం
గనుమ! కలాపి జల్లి యొడికంబున ముగ్గులు వెట్టి, యోరచూ
పునఁ దను దాను మెచ్చుకొను; మోహనముల్ సుమి ఇట్టి దృశ్యముల్.

3

చెలువంపుజవరాండ్ర శిల్పనైపుణిమూల్యమును దెల్పు సంక్రాంతిముగ్గుతీరు
పసుపుఁగుంకుమ మిచ్చి, బంతిపూ లర్పించి గొబ్బిపేరంటాండ్ర గొలుచుపాలు
గోరంటరసమున గుబ్బెతల్ రచియించు కరపాదరాగలేఖనము సొంపు,
ఈడైనకన్నెలఁ గూడి వెన్నెల నాడు "చెమ్మచెక్క"లలోని కమ్మఁదనము,
తదియ వేఁగున భుజియించి తరుణవరుల
యూప గన్నియ లూఁగు నుయ్యాల లీల,
అది యిది యనంగ నేల సర్వాంగములను
రమ్యకవితాస్పదముసుమ్ము గ్రామసీమ.

౪

మండువెండల వేడి మధురంబు గావించు వేఁప మ్రాఁకులనీడ విశ్రమించి,
పూరిళ్లయారామములఁ దీవపందిళ్ల విలసిల్లు కన్నెపూవులకు మురిసి
వటతరుచ్ఛాయాభివర్ణ్యంబులగు గ్రామసరసీతటములందుఁ దిరుగ నరిగి,
కన్నెపైరుల మేన గగురుపాటొదవించి చనుదెంచు నెలగాడ్పు సఖ్య మంది
ఆరుబయళ్ళుల శయనించి యమృతకిరణ
తారకాప్రేమగాథలఁ దలఁచికొంచు,
సుప్రశాంతత నిదురింప సుఖ మొసంగు
పల్లియలు సూవె నా కాటపట్టు లెందు.

రచయిత :

శరత్ బాబు

# పతివ్రత

అనువాదకుడు :

చక్రపాణి

హరీసుడు పాబనాలో ప్రఖ్యాతిగాంచిన వకీలు; ప్రాక్టీసులోనే కాదు; మంచితనానికికూడా. దేశంలో ఉన్న సంస్థలన్నిటితోనూ అతనికి కొద్దో, గొప్పో సంబంధం ఉంది. ఇక సొంతపట్టణంలో అతను లేంది ఏపనీ జరగదు. ఆవాళ ఉదయం 'దుర్నీతి నాశకసమితి' వర్కింగుకమిటీమీటింగు. హరీసుడు అక్కడినుంచి చూసుకుని ఇంటికి చేరుకునేసరికి వేళ చాలా మించింది. ఇప్పుడు రెండుముద్దలు మింగి కోర్టుకు పోయి పనిచేస్తే కాని అతనికి స్వస్థత చిక్కదు. ఈ తొందరలో సరిగ్గా భోజనం చేయడేమోనని అతని విధవచెల్లెలు, ఉమ విస్తరి దగ్గర కూర్చుని కావలసినవి అడిగి వడ్డిస్తూ ఉంది.

ఇంతలో హరిభార్య నిర్మల మెల్లగా వచ్చి కొంచెం ఎడంగా కూర్చుని — "నిన్నటి పత్రికలో చూశాను, లావణ్యప్రభను ఈ సర్కిలుకు ఇన్స్పెక్ట్రెస్‌గా వేశారటగా" అన్నది.

ఈ మాటలలో పైకి ఏమీ కనపడకపోయినా అంతరార్థం చాలా ఉంది.

"నిజమేనా—అయినా లావణ్యప్రభ అనే పేరు కలవాళ్లు చాలామంది ఉండవచ్చు వదినా?" అన్నది ఉమ ఆశ్చర్యంతో.

"ఉండవచ్చు. అందుకనే నేను వారిని అడుగుతున్నాను."

హరీసుడు తల ఎత్తి—"నాకెలా తెలుస్తుంది? గవర్నమెంటు నాసలహా తీసుకుని ఉద్యోగాలు యిస్తుందా ఏమిటి?" అన్నాడు కటుస్వరంతో.

"ఆహా! అంతకోప మెందుకండీ. నేను అటువంటిమాట ఏమన్నాను? ఒకవేళ మీసిఫార్సువల్ల ఎవరికైనా ఉపకారం జరిగితే సంతోషించాల్సిందేగా!" అని ఆమె వచ్చిన విధంగానే మందరగతితో వెళ్లిపోయింది.

హరీసుడు విస్తరిదగ్గరినుంచి లేవబోవటం చూసి ఉమ—"నన్ను చంపుకు తిన్నట్టే అన్నయ్యా! విస్తరి వదిలిపెట్టకు—" అని బతిమాలింది.

హరీసుడు చిప్పున లేచి—"ఉహుఁ! తీరిగ్గా రెండుముద్దలు తినటానికి నోచుకోలేదు. ఆత్మహత్య చేసుకోవటం తప్ప—" అంటూ బయటికి వెళ్లిపోతూ ఉంటే భార్య అన్న ఈ మాటలు అతని చెవిని పడ్డవి:

"ఆత్మహత్య చేసుకోవాల్సిన ఖర్మం మీకేమి పట్టింది? ఆరోజు వచ్చినప్పుడు ప్రపంచమే చూస్తుంది ఎవ్వరు చేసుకునేదీ!"

* * *

ఇక్కడ హరీసుని వెనకటిచరిత్ర కొంత చెప్పవలసిన అవసరం ఉంది. ఇప్పుడు అతనికి నలభైయ్యేడు. అతను ఎం.ఏ. చదివేటప్పటి సంగతి చెప్తున్నాను. హరీసుని తండ్రి రామమోహనుడు బారిసాల్‌లో సబ్ జడ్జీగా కొంతకాలం ఉన్నాడు. వారి పొరుగునే తారకుమార మజుందార్ అనే స్కూల్సు ఇన్స్పెక్టరు ఉంటూ ఉండేవాడు. ఈయన తరుచుగా ఊళ్లకు సర్క్యూటు వెళ్తూ ఉండేవాడు. ఊళ్లో ఉంటేమాత్రం జడ్జీగారింటికి తప్పక వస్తూ ఉండేవాడు. ఈయ నేమిటి? ఇంకా చాలామంది వచ్చేవారు. కోర్టు మున్సిఫ్, డిప్యూటీ కలెక్టరు, పబ్లికు ప్రాసిక్యూటరు వగైరాలు. వీరందరూ రావటానికికూడా కారణం ఉంది. హరీసుని తండ్రి సనాతనుడు. ఇక్కడ జరిగే చర్చలుకూడా చాలావరకు మతానికి సంబంధించినవే. ఈచర్చల మీమాంసకూడా, ఎక్కువ భాగం, పోట్లాటతోకాని తేలేదికాదు. ఇలా అన్నిచోట్ల జరుగుతూ ఉన్నదే. ఒకనాడు ఇలాంటి తగువే జరుగుతూ ఉండగా తారకుమారుడు పేపకెత్తం ఊతం చేసుకుని ఈకూటంలో ప్రవేశించాడు. ఈయన పెద్ద పండితుడు, నిగర్వి, పెద్దమనిషి

వీళ్ల తగువుల్లో ఎప్పుడూ పాల్గొనేవాడు కాదు—తాను బ్రహ్మసమాజికుడు కావటంవల్లనో, లేక అతని శాంత స్వభావం మూలానో. అనాడు వీరినికూడా ఈ ఊబిలో దించారు. ఈ తగువుకు మధ్యవర్తిగా ఉండ మని వీరిని మున్నబు కోరినాడు. దీనికి కారణంకూడా ఉంది. మున్నబు సెలవల్లో కలకత్తా వెళ్లినప్పుడు, హరబాబు మహాభాష్యాల్లోనూ పండితుడని ఎవరో చెప్పారు. హరబాబు మధ్యవర్తిగా ఉండటానికి అంగీకరించాడు. కాని కొద్దిరోజుల్లోనే శాస్త్రవాదాలు చదివిన ఉద్యోగస్థులు వీరి పాండిత్యానికి అచ్చెరు వందారు. సంతసించారుకూడా. ఇక సంతోషించంది సబ్ జడ్జీగారు. జాతిని వదులుకున్న వాడి శాస్త్రజ్ఞానం ఎంతకు అక్కరకు వస్తుందని చప్పరించాడు. అందరూ వెళ్లిపోయిన తర్వాత ఈమాట పబ్లిక్ ప్రాసిక్యూటరు దగ్గర బయటపెట్టాడు. కాని ఆయన వీరితో ఏకీభవించలేదు.—" ఎలాగైనా మంచిపండితుడు. శాస్త్రాలన్నీ కంఠోక్తం చేశాడు. ఇదివరకు స్కూలుమాస్టరు చేశాడుకాదూ?" అన్నాడు.

జడ్జీకి ఈమాటలు రుచికరంగా లేవు. "ఇలాంటి జ్ఞానం పాపాన్ని పెంచటానికి తప్ప పనికిరాదు. వీళ్లకు ముక్తి లేదు" అని తన అక్కసు తీర్చుకున్నాడు.

ఈ సంభాషణ అంతా హారీశుడు పక్కన కూర్చుని వింటూనే ఉన్నాడు. హరబాబు పాండిత్యం చూసి ముగ్ధుడైనాడు. తండ్రి అభిప్రాయం ఎలా ఉన్నా, తను పరీక్ష ప్యాసుకావాలంటే వీరిసహాయం చాలా అక్కరకు వస్తుందని గ్రహించి హరబాబును ఆశ్రయించాడు. ఆయన యిష్టపడ్డాడు కూడా. ఇక్కడనే లావణ్యప్రభతో ఇతనికి పరిచయం. ఆపిల్ల అప్పుడు ఇంటరు చదువుతూ ఉంది. ఇక్కడ హారీశుడు కోర్సు పుస్తకాలలో అర్థంకాని విషయాలేకాక, ఇంకా జటిలమైన తత్వాలనుకూడా చాలా తెలుసుకున్నాడు. అది అలా ఉంచండి.

పరీక్షలు దగ్గరకువచ్చి హారీశుడు కలకత్తా వెళ్లాడు. బాగా రాశాడు. ప్యాసయినాడు కూడా. తర్వాత హారీశుడు లావణ్యను కలుసుకున్నప్పుడు విచారంతో—"మీరు తప్పినా రెందుకు?" అని అడిగాడు.

"ఇదికూడా నా చేత కాదనేనా మీ ఉద్దేశం?" అన్నది లావణ్య.

హారీశుడు నవ్వి—"జరిగిందేమో జరిగింది. ఇక ముందయినా జాగ్రత్తగా చదివి ప్యాసుకండి." అన్నాడు.

లావణ్య సిగ్గుపడలేదు—"ఎంతబాగా చదివినా నేను ప్యాసుకాను. ఇది నావల్లకాదు" అన్నది.

హారీశుడు విస్తుపోయాడు. "ఎందుకని వల్లకాక పోవటం?" అన్నాడు.

"ఎందుకనేమిటి? ఊరకనే" అని లావణ్య నవ్వి నాపుకుని వెళ్లి పోయింది.

ఈసంగతి ఎలాగో హారీశుని తల్లి చెవిని పడింది.

ఆనాటి ఉదయం హారీశుని తండ్రి ఏదో కేసులో తీర్పు రాస్తున్నాడు. ఓడినవాడికి అప్పీలుకు తావు లేకుండా చేయాలనే సదుద్దేశంతో మంచి మంచి శబ్దాలు ఏరి వేస్తూఉండగా భార్య వచ్చి ఈసంగతి ఊదింది. జడ్జీగారి ఒళ్లు మండింది. హారీశుడు ఎవరి నన్నా చంపినా ఇంత వ్యాకులపాటు వీరికి కలిగేది కాదు. కళ్లు రెండూ చింతనిప్పులవలె చేసి—"ఏమిటి! ఇంతదాకా—!" అన్నాడు. ఆపైన అతనినోటి వెంట మాట రాలేదు.

దినాజ్‌పూర్‌లో ఉంటూఉండగా ఒక సనాతన వకీలుతో వీరికి స్నేహం కలిసింది. గీతారహస్యము, కాశీవాస మహాత్మ్యము, శిఖోపయోగము మొదలైన విషయాల్లో ఇద్దరికీ ఏకాభిప్రాయం కుదిరిందికూడా. ఒకనాడు సెలవురోజు చూసుకుని దినాజ్‌పూర్ వెళ్లి అతని కుమార్తె నిర్మలను తన కొడుక్కు చేసుకుంటానని హారీశుని తండ్రి మాట ఇచ్చి వచ్చాడు.

పిల్ల అందమైనదే; దినాజ్‌పూరులో ఉంటూ ఉండగా హారీశునితల్లి పిల్లను చాలాసార్లు చూసింది కూడా. అయినా భర్తమాటలు విని ఆమె గడ్డంమీద వేలు పెట్టుకుంది—"ఏమిటండీ! ఒక్కరూ ఒక మాటకూడా యిచ్చి వచ్చారా? ఈకాలపు పిల్లలు—"

భర్తమాట పూర్తి కానివ్వలేదు. "నేను ఈకాలపు తండ్రిని కానుగా? నేను వొకటి పద్ధతిగానే కొడుకును చూస్తాను. వాడికి ఇష్టం లేకపోతే ఇంకో దోవ చూసుకోమని చెప్పు" అన్నాడు.

భర్తసంగతి ఈమెకు బాగా తెలుసు. అందుచేత తిరిగి నోరు ఎత్తలేదు. భర్త మళ్లీ అన్నాడు:

"పిల్ల రంభా ఊర్వశులతో తులతూగక పోయినా మర్యాదస్తుల ఇంటిబిడ్డ. తల్లిపాతివ్రత్యమూ, తండ్రి హిందుత్వముతో అమ్మాయి మన యింటికి కాపురం చేయటానికి వస్తే హరీశుని అదృష్టం పండిం దను కోవచ్చు."

పెళ్లిసంగతి అందరికీ తెలిసింది. హరీశుడుకూడా విన్నాడు. మొదట అతను కలకత్తా పారిపోయి ట్యూషనులన్నా చెప్పుకు బ్రతుకుదా మనుకున్నాడు. తర్వాత కానీవు సన్యసిద్దా మనుకున్నాడు. ఆఖరికి 'పితా స్వర్గః పితా ధర్మః పితాహి పరమం తపః' — మొదలైన సూక్తులు తలపుకు తెచ్చుకుని మెదలకుండా ఊరుకున్నాడు.

పిల్లతండ్రి పెద్ద ఆట్టహాసం గా అల్లుణ్ణి చూట్టానికి వచ్చాడు. ఊళ్లో మిత్రు లందరినీ జడ్జీ ఇంటికి పిలిపించాడు. పాపం హరకుమార బాబు ఈ సంగతి తెలియక మామూలుగా వచ్చేశాడు. వారి అందరి ఎదుటా జడ్జీగారు తన వియ్యంకునికి హిందుమతంలో ఉన్న నమ్మకమూ, భక్తీ ఎంతగాఢమైందో చెప్పి, ఇంగ్లీషువిద్యలో లెఖ్ఖలేనన్ని లోపాలు చూపించి, అందులో తనకు జెలకు వెయ్యిరూపాయలు సంపాదించిపెట్టే మంచి గుణం ఒక్కటితప్ప ఇక నేమీ లేదని తేల్చాడు. ఈ కాలాన్నిబట్టి కుర్రవాళ్లకు ఇంగ్లీషు చెప్పించక తప్పటం లేదు. కాని ఈమ్లేచ్ఛ విద్యనూ మ్లేచ్ఛసభ్యతనూ హిందువుల శుద్ధాంతఃపురాల్లోకి తీసుకు వచ్చేటటువంటి మూర్ఖులకు ఇహమేకాదు, పరముకూడా ఉండదని శపించాడు.

హరకుమారబాబు తప్ప మిగతావా రంతా ఈ మాటల్లోని సంకేతాన్ని గ్రహించారు. ఆరోజున సభికులు వెళ్లిపోకముందే లగ్నంకూడా స్థిరపడింది. లగ్నానికేమీ విఘ్నం కలగలేదు. యథాసమయంలో పెళ్లి అయింది. పిల్లను అత్తవారింటికి పంపేనాటి ఉదయం తల్లి — నిర్మల పతివ్రతామతల్లి — కూతురి చెవిలో, ఆమె వైవాహికజీవితం ఒడిదుడుకులేకుండా నడవగలందులకు మంత్రోపదేశం చేసింది.

"అమ్మా, మగవాళ్లు చెప్పిందీ ఒకకంట కాచి ఉండాలి. లేకపోతే మనకు దక్కరు. నీవు జీవితంలో ఏదైనా మర్చిపోగాని ఇది మరవకు." ఇవీ బీజాక్షరాలు.

ఈమె కాపురానికి వచ్చినకాడినుంచీ భర్తను చాలా వేధించింది. ఆఖరికి అతను పిలకపెట్టి భగవద్గీత చేత పట్టిన తర్వాత కొంచెం తగ్గించింది. ఇప్పటికీకూడా భర్తను పూర్తిగా నమ్మదు. కాటికి పోయేవరకు కాచి ఉంచేదే ఈమెకు నిశ్చింత.

నిర్మల భర్తయింటికి కాపురం చేయటానికి వచ్చింది —. ఆ ఇంట్లోనే యిరవై సంవత్సరాలనుంచి కాపురం చేస్తున్నదికూడా. ఈ యిరవై సంవత్సరాల్లో ఎన్నో మార్పులు జరిగినవి. హరీశునితండ్రి చనిపోయాడు, నిర్మలతండ్రికూడా లేడు. లావణ్య వివాహం చేసుకున్నది. హరీశుడు జూనియరు వకీలల్లా సీనియ రయ్యాడు అతని యౌవనంకూడా గడిచిపోయింది. ఇప్పుడు మధ్యవయస్కులో ఉన్నాడు. కాని నిర్మలమాత్రం తల్లి ఉపదేశించిన తిరుమంత్రం మరవలేదు.

## ౨

ఈ మంత్రఫలితం యింత త్వరలో కనిపిస్తుందని ఎవరికి తెలుసు! హరీశుని తండ్రి ఇంకా అప్పటికి జీవించే ఉన్నాడు — పెన్షను తీసుకుని మంచపు కుక్కిలో.

ఒకనాడు హరీశునికి మిత్రుని దగ్గరనుంచి ఆహ్వానం వచ్చింది. మిత్రునితండ్రి శ్రాద్ధం. కలకత్తానుంచి వేశ్యను పిలిపించారు. ఆమె చక్కగా పాడగలదు, మంచి రూపసి, ఈడుకూడా మిగలలేదు. ఆవేళ మిత్రులందరూ ఆమెచేత పాటకచ్చేరీ చేయించారు. కచ్చేరీ అయ్యేవరకు ప్రొద్దుపోయింది.

నిర్మల పైఅంతస్తులో కిటికీ దగ్గర నుంచుని భర్తకోసం ఎదురుచూస్తూ ఉంది. వారు పైకి రాగానే — "పాట ఏలా ఉంది?" అని అడిగింది.

"బాగా పాకుతుంది" అన్నాడు హరీశుడు సంతోషంతో.

"మాపులకు ఎలా ఉంటుంది?"

"ఫరవాలేదు, బాగానే ఉంటుంది."

"అయితే, రాత్రంతా ఉండివస్తే బాగుండేదిగా."

ఈ కుత్సిత పలుకుకు హరీశుడు విస్మయం చెందాడు— కోపించలేదు అతని నోటినుంచి— "ఏలాగు?" అనిమాత్రం వెలువడింది.

నిర్మల కోపంతో— "ఎలా ఏమిటి? అలాగే! నేనేం పసి పిల్లను కాను. నాకు అంతా తెలుసు. నా కంట్లో దుమ్ము కొడతారా మీరు? సరే— "

ఉమ పక్క గదిలోనుంచి పరుగెత్తుకుంటూ వచ్చి, భయపడుతూ— "అదేమిటి వదినే! నాన్న వింటాడు" అన్నది మెల్లగా.

"విననివ్వరాదూ! నేను చాటుగా ఏదీ అనను" అన్నది నిర్మల.

దీనికి ఏమి జవాబివ్వాలో ఉమకు తోచలేదు. గోల అయితే తండ్రి లేస్తా డేమో నని భయంతో నిర్మలకు దణ్ణం పెడుతూ, కోపాన్ని దిగమింగి— "రక్షించు వదినా! ఈరాత్రిపూట కేకలు పెట్టి రభస చెయ్యకోకు" అన్నది.

నిర్మల గొంతు పెంచిందిగాని తగ్గించలేదు.

"ఇది రభసా! నీ కెలా తెలుస్తుంది నాకడుపులో మంట?" అని బిగ్గరగా ఏడుస్తూ గదిలోకి పోయి తలుపు తక్కున బిగించుకుంది.

హరీశుడు కొయ్యబొమ్మమాదిరి క్రిందకు వచ్చి, ఆ రాత్రి క్లయింట్లుకూర్చునేబెంచీమీద గడిపాడు. తర్వాత పదిరోజులవరకూ ఉభయులూ మాట్లాడుకోలేదు.

కాని, హరీశుడు ప్రొద్దు కుంకినాక బయటికి పోవటం లేదు. అధవా పోయినా అతనిగాభరా మిత్రులకు పట్టియిచ్చేది. వాళ్లు నవ్వేవారు. "హరీశ్! ముసలివాడవైనకొద్దీ నీకు రోగంకూడా జాస్తి అవుతున్న దే" అని ఎత్తిపొడిచేవారు.

హరీశుడు సాధ్యమైనంతవరకు జవాబిచ్చేవాడే కాదు. మరీ తాళలేనప్పుడు 'ఈ నేరానికే మీరు నన్ను వదిలిపెట్టితే మీరూ సుఖపడతారు; నేనూ బ్రతికి బయటపడతాను' అనేవాడు.

'ఊహుఁ! లాభం లేదు! వాడిని అవమానించబోయి మనను మనమే అవమానించుకుంటాము' అనే వాళ్లు మిత్రులు.

## 3

ఆ సంవత్సరం స్ఫోటకంతో చాలామంది చచ్చిపోతున్నారు. హరీశునికికూడా స్ఫోటకం పోసింది. వైద్యుడు వచ్చి పరీక్షించి, ముఖాన్ని గంభీరంగా చేసి— "చాలా వత్తుగా పోసింది బతకటం కష్టం" అన్నాడు.

హరీశునితండ్రి అప్పటికి చనిపోయాడు. ముసలి తల్లి ఈమాట విని మూర్ఛపోయింది. నిర్మల గదిలోనుంచి వచ్చి— "నేనేగనక పతివ్రతకూతురు పతివ్రతనైతే నా పసుపు కుంకం తీసివేయటానికి ఎవరితరం! మీరు వారిని కనిపెట్టి ఉండండి" అని యకాయకీని అంకమ్మగుడికి వెళ్లి మేకపోతును బలి యిచ్చి— "వారు బ్రతికి లేనే నేను ఇంటికి పోతాను. లేకపోతే యిటునుంచే వారివెంట పోతాను" అని శాల్ది చేసింది.

వారంరోజులవరకు జీవతపాదోదకం తప్ప మరో నీరుకూడా ముట్టలేదు. ఏడోనాడు వైద్యుడు వచ్చి— "అమ్మా! మీభర్తగారికి నిమ్మళించింది. మీ రిక యింటికి రండ"ని పిలిచాడు.

ఊళ్లో వాళ్లంతా గుంపులు గుంపులుగా ఈమెను చూడటానికి వచ్చారు. చాలామంది స్త్రీలు ఈమె కాళ్లమీద పడ్డారు. ముఖాన పట్టెడు కుంకం పెట్టి, 'ఈమె మనిషి కాదు. సాక్షాత్తు కాళికాదేవి' అన్నారు. వృద్ధులు 'సావిత్రోపాఖ్యానం అబద్ధ మన్నారు; కలికాలంలో ధర్మం నశించిందంటారుకాని పూర్తిగా నశించిందా? ఈమె యమునిచేతిలోనుంచి భర్తను లాక్కువచ్చింది చూడండి' అని దృష్టాంతం చూపారు.

బార్ లైబ్రరీలోకూడా ఇదేచర్చ. "కావాలనే పురుషుడు భార్యకు దాసుడవుతాడోయ్! పెళ్లి మనమూ

చేసుకున్నాము — ఏదీ అలాంటి భార్య! ఇప్పుడు తెలిసింది మనకు హరీశుడు ప్రొద్దుపోకనే ఎందుకు బయట రాడో'' అన్నాడు ఒకాయన.

వీరేంద్రుడు భక్తుడు. సెలవల్లో కాశీ పోయి గురుపాదం పట్టి వచ్చాడు. అతను టేబిలుమీద ఒక్క గుద్దు గుద్ది— 'నాకు తెలుసును హరీశుడు రావణుడని. పాతివ్రత్య మంటే మాట లనుకున్నారేమిటి? నేనే గనక పతివ్రతకూతురు పతివ్రతనైతే — అది యింటినించి బయలుదేరితే — అబ్బ! ఒళ్లు గగుర్పొడుస్తుందోయ్!' అన్నాడు.

తారిణీచటర్జీ వయసుమళ్లినవాడు. నల్లమందు భాయికూడా. పీల్చేహుక్కా నౌకరుచేతి కిచ్చి— 'శాస్త్రప్రకారమైతే సహధర్మిణి అనేశబ్దానికి అర్థం చాలా కష్టం. నాకు మాత్రం ఏడుగురు ఆడపిల్లలు. వాళ్ల పెళ్లిళ్లతో నేను కూలిపోతున్నాను' అని నిట్టూర్చాడు.

చాలాకాలమైనాక మళ్లీ హరీశుడు కోర్టుకు వచ్చాడు. వారిని అభినందించినవారిసంఖ్య చెప్పటం కష్టం.

వ్రజేంద్రుడు విచారంతో— 'బ్రదర్ హరీశ్! స్త్రైణుడివని నిన్ను చాలా అవమానించాము. మమ్మల్ని క్షమించు! లక్షేమిటి, కోటికి ఒక్కడుకూడా నీవంటి అదృష్టవంతుడుండడు. నువ్వు ధన్యుడవు' అన్నాడు.

వీరేం — 'సీతా సావిత్రులసంగతి వదిలిపెట్టు. లీలావతీ, గార్గి మొదలైనవారు మనదేశంలోనే పుట్టారు. భాయీ! స్త్రీలు తయారుకాందే స్వరాజ్యం గిరాజ్యం ఏమీ రాదు; మళ్లీ అలాంటివారు తయారుకావాలి. నా ఉద్దేశం, పాబనాలో 'ఆదర్శ స్త్రీ శిక్షాసమితి'ని స్థాపించటం అవసరమని. దానికి పర్మినెంటు ప్రెసిడెంటుపేరు నేను ప్రపోజు చేయనక్కరలేదు. అందరికీ తెలిసిందే.

తారిణీ—దానితోపాటు 'వరశుల్కనిషేధ సమితి'కూడా స్థాపించటం మంచిది దీనిమూలాన దేశమంతా నాశనమైపోయింది.

వ్రజేంద్ర—హరీశ్! నువ్వు చిన్నప్పుడు బాగా వ్యాసాలు రాసేవాడివి కాదూ? నీ 'శ్రీమతి' విషయమై ఒక ఆర్టికల్ రాసి 'ఆనందబజార్'కు పంపటం మంచిది.

హరీశుడు దేనికీ జవాబు చెప్పలేకపోయాడు. అతని కళ్లవెంట కృతజ్ఞతాశ్రువులు రాలినవి.

౪

జమీందారు గోసాయీ చరణుడు చనిపోయినాక అతని విధవకోడలుకూ కొడుకులకూ దావా జరుగుతున్నది. హరీశుడు విధవతరఫు వకీలు. జమీందారు గుమస్తాలు ఎవరు ఏతరఫో తెలియని కారణంచేత విధవ స్వయంగా హరీశునిఇంటికి వచ్చి సలహా తీసుకుపోతూ ఉంటుంది. ఇదివరకు రెండు మూడు సార్లు వచ్చింది కూడా. ఇవ్వాళ ఉదయంకూడా ఆమెబండి వచ్చి హరీశుని ఇంటిముందు ఆగింది. హరీశుడు సంభ్రమంతో ఆమెను తనగదిలోకి తీసుకువచ్చి కూర్చోబెట్టాడు. సంభాషణ ప్లీడరుగుమస్తాలు వింటారేమో నని మెల్లగా జరుగుతున్నది. విధవ అడిగిన ఏదో అనవసరపుప్రశ్నకు హరీశుడు పకపక నవ్వి జవాబు చెప్పబోతూ ఉండగా తెరచాటునుంచి — "నేను అంతా వింటున్నాను!" అనే కటుస్వరం వినబడ్డది.

విధవ చకితురాలైంది. హరీశుడు సిగ్గుతోనూ శంకతోనూ కొయ్య అయిపోయాడు. ఒక జోడుకళ్లూ, చెవులూ ప్రతిక్షణమూ అతన్ని కాచి ఉన్నవని అతను అప్పుడు మరిచిపోయాడు.

తెర తొలగించుకొని నిర్మల యుద్ధసన్నద్ధురాలై, చేతులు ఊపుకొంటూ — "పనసున మాట్లాడుకొని నన్ను మోసపుచ్చాలనేనా? కాస్తసిగ్గన్నా ఉండవద్దా? ఏదీ, నాతో ఇలా నవ్వుతూ మాట్లాడటం ఎప్పుడూ చూడలేదే!" అన్నది విషం కక్కుతూ.

ఈ ఆరోపణ బొత్తిగా అబద్ధం కాదు.

"ఈ గోల ఏమిటి, హరీశబాబూ?" అన్నది విధవ భయపడుతూ.

హరీశుడు విమూఢునివలె ఒక్క క్షణం అలానే చూసి— "పిచ్చిది" అన్నాడు.

నిర్మల— "పిచ్చిదా? నిజమే, పిచ్చిదాన్నే. కాని నన్ను ఇలా చేసింది ఎవరు?" అని భోరున ఏడ్చి, చప్పున వచ్చి విధవకాళ్లముందు మోకరిల్లి తల నేలకు వేసి కొట్టుకో నారంభించింది.

గుమస్తాలు పని వదిలిపెట్టి ఇది చూడటానికి వచ్చారు. జూనియరు వకీలుకూడా వచ్చి వాకిట్లో నిలబడ్డాడు; లోసుకంపెనీ మేనేజరు అతని బుజాలమీదుగా తొంగిచూస్తున్నాడు. వారి అందరి ఎదటనే నిర్మల తల నేలకు కొట్టుకుంటూ — "నాకు అంతా తెలుసు! అంతా గ్రహించాను! పోనీ, మీరే సుఖంగా ఉండండి! నేనేగనక పతివ్రతకూతురు పతివ్రతనై తే, మనోవాక్కాయాలా నా భర్తను తప్ప ఇంకొకర్ని ఎరగనట్టయితే-"

ఇటు విధవకూడా ఏడవసాగింది.— "ఈగోల ఏమిటి హారీశ్ బాబూ? ఈ అపవాదు— "

హారీశుడు ఎవరికీ ప్రతి చెప్పలేదు. భూమి బద్దలై తనను లోపలికి ఎందుకు తీసుకోలేదని అతను తలుస్తున్నాడు. సిగ్గుతోనూ, అసహ్యంతోనూ కోపంతోనూ హారీశుడు ఆ వాళ గదిలోనే ఉండిపోయాడు. కోర్టుకు పోవాలని అనుకోనేలేదు. మధ్యాహ్నం ఉమ వచ్చి బతిమాలి, బలవంత పెట్టి, ఆఖరికి ఒట్టువేసి భోజనం పెట్టింది. పొద్దుటాకకముందు పురోహితుడు చెంబిగ్లాసులో నీళ్లు తెచ్చి కాళ్లముందు పెట్టాడు. హారీశుడు మొదట తన్ని వేద్దామనుకున్నాడు. కాని, తర్వాత కోపాన్ని అపుకుని కాలిబొటనవేలు నీళ్లలో పెట్టాడు. భర్తపాదోదకం త్రాగందే నిర్మల ఏదీ ముట్టదు.

రాత్రి బయటిగదిలో ఏకాకిగా పండుకుని హారీశుడు 'ఈ దుఃఖమయదుర్భరజీవితానికి అంత మెప్పు?' అని ఆలోచించ నారంభించాడు. ఈవిషయంగా అతను చాలాకాలంనుంచి ఆలోచిస్తున్నాడు. కాని, ఈపతివ్రతక్షేమ అనే నాగపాశంనుంచి తప్పించుకునే ఉపాయం అతనికి తట్టలేదు.

౪

రెండు సంవత్సరాలు గడిచినవి.

తాను విన్నకబురు నిజమేనని నిర్మల జాడతీసి తెలుసుకున్నది. లావణ్య యథార్థంగానే, పాఠశాల ఇన్ స్పెక్ట్రెస్ గా వస్తున్నది.

ఇవ్వాళ హారీశుడు కొంచెం పెందలకాడే కోర్టునుంచి తిరిగివచ్చి ఉమను పిల్చి, తాను రాత్రిబండికి అవసరమైన పనిమీద కలకత్తా పోవలసిఉన్నదనీ, తిరిగి రావటానికి నాలుగైదురోజులు పట్టుతుందనీ, కావలసిన పక్కా, గుడ్డలూ సిద్ధంగా ఉంచమనీ చెప్పాడు.

పది పదిహేను రోజులనుంచి భార్యాభర్తలకు మాటలు లేవు.

రైలుస్టేషను దూరం. అందుకని రాత్రి ఎనిమిదింటికి లోపలనే మోటారు బయలుదేరాలి. సాయంత్రం కేసుకుకావలసిన కాయితాలు హారీశుడు హేండ్ బ్యాగ్ లో పెట్టుకుంటూ ఉండగా నిర్మల వచ్చింది.

హారీశుడు తల ఎత్తి చూశాడు కాని ఏమీ మాట్లాడలేదు. నిర్మల కాసేపు మెదలకుండా ఊరుకుని— "ఇవ్వాళ కలకత్తా వెళ్లుతున్నారుకామా?" అని అడిగింది.

"ఊఁ" అన్నాడు హారీశుడు.

"ఎందుకు?"

"ఎందుకేమిటి? హైకోర్టులో అపీలు చేయాలి."

"పదండి, నేనుకూడా వెంట వస్తాను."

"నువ్వుకూడా వస్తావా? వచ్చి ఎక్కడ ఉంటావు?"

"ఎక్కడైనా సరే. మీవెంట చెట్టుకింద ఉంటానికైనా నాకు సిగ్గులేదు."

ఈ మాట మంచిదే. పతివ్రతకు తగిందికూడా. కాని హారీశునికి శరీరంనిండా తేళ్లు పాకినట్టయింది.- "నీకు సిగ్గు లేకపోవచ్చు, నా కున్నది. చెట్టుకింద ఉంటానికి బదులు ఏ మిత్రుని ఇంటికైనా పోయి ఉందామని స్థిరపరుచుకున్నాను" అన్నాడు.

"ఐతే ఇంకా మంచిది. వారి ఇళ్లల్లోకూడా ఆడవాళ్లు ఉంటారు. నాకు ఏ ఇబ్బందీ ఉండదు."

"ఉహుఁ. అలా వల్లకాదు. వారు పిలవందే, కనీసం చెప్పకుండా పెట్టకుండా, నిన్ను వెంటపెట్టుకుని వాళ్ల ఇంట్లో దిగటం నావల్ల కాదు."

"మీకెల్లకా దని నాకు తెలుసును. నన్ను వెంట పెట్టుకుని లావణ్య ఇంటికి వెళ్లటానికి వీలుండదుగా."

హరీశునికి కిచ్చి ఎక్కినట్టయింది. చేతులు కాళ్లూ ఝాడిస్తూ చీత్కారం చేశాడు.

"నువ్వెంత నీచురాలివో అంత అసహ్యంగా మాట్లాడతావు. పాపం ఆమె విధవ, గౌరవ కుటుంబీకురాలు. నేను అక్కడికి ఎందుకు పోతానూ? అసలామె నన్నెందుకు పిలుస్తుంది? పైగా నాకు అంత తీరిక ఎక్కడిది? కోర్టుపనులు తెమిలేవరకు ఊపిరి సలపదు."

"బాగానే ఊపిరి సలుపుతుందిలెండి" అని నిర్మల గదిలోనుంచి వెళ్లిపోయింది.

"మూడురోజులకే హరీశుడు కలకత్తానుంచి తిరిగి వచ్చాడు. నిర్మల—"నాలుగైదు రోజులు ఉంటామన్నారుగా, మూడురోజులకే వచ్చేశారేం?" అని అడిగింది.

"పని త్వరగా అయింది. వచ్చేశాను" అన్నాడు హరీశుడు.

నిర్మల బలవంతాన నవ్వి—"లావణ్య కనపడలేదు కాదూ?" అని అడిగింది.

"ఊహుఁ" అన్నాడు హరీశుడు.

"కలకత్తా ఎలాగూ వెళ్లారు, కాస్త క్షేమమన్నా ఎందుకు కనుక్కోలేదు?" అన్నది నిర్మల చాలా మర్యాదస్తురాలిలాగా.

"తీరిక లేకపోయింది."

"అంతదూరం వెళ్లినవారు, కొంచెం తీరిక చేసుకుంటే పాడేదిగా" అని నిర్మల వెళ్లిపోయింది.

ఇది జరిగి ఒకనెల అయింది. ఒకనాడు హరీశుడు కోర్టుకు వెళ్లుతూ చెల్లెలిని పిలిచి—"ఇవాళ తిరిగి వచ్చేవరకు కొంచెం పొద్దుపోతుంది ఉమా!" అని చెప్పాడు.

"ఎందుకని అన్నాయ్?"

ఉమ దగ్గరలోనే ఉంది. మెల్లగా చెప్పినా సరిపోయేదే. కాని హరీశుడు, తనకు కనపడని ఒక వ్యక్తిని ఉద్దేశించి, బిగ్గరగా—"ఇవాళ యోగీశ బాబుతో ఒకవిషయాన్నిగురించి ఆలోచించాలి—తిరిగి వచ్చేవరకు ఆలస్యం కావచ్చు" అన్నాడు.

తిరిగి వచ్చేవరకు ఆలస్యమైందికూడా. రాత్రి పన్నెండుగంటలకు తక్కువ కాదు. హరీశుడు మోటరు దిగి ఇంట్లో ప్రవేశించాడు. దుస్తులు మారుస్తూ ఉండగా భార్య పై అంతస్తు కిటికీదగ్గర నుంచుని డ్రైవరును ఇలా అడుగుతున్నది:

"అబ్దుల్! యోగీశబాబుఇంటిదగ్గరనుంచే కదూ మీరు రావటం?"

"కాదు అమ్మగారూ! స్టేషన్నుంచి."

"స్టేషన్? బండికి ఎవరన్నా వచ్చారా?"

"కలకత్తానుంచి ఒకఅమ్మగారూ, అబ్బాయీ వచ్చారు."

"కలకత్తానుంచా? బాబుగారు పోయి వాళ్లను ఇంట్లో దిగబెట్టి వచ్చారుకాదూ?"

"అవునండీ" అని అబ్దుల్ కారును షెడ్లోకి తీసుకుపోయాడు.

హరీశుడు ఇది విని నిశ్చేష్టుడైపోయాడు. ఇలా జరగవచ్చుని అతను అనుకున్నదే. అయినా, అతను నౌకరుతో అబద్ధమాడమని చెప్పలేకపోయాడు. ఆరాత్రి పడకగదిలో కురుక్షేత్రం.

మర్నాటి ఉదయమే లావణ్య కొడుకును వెంట పెట్టుకుని ఈయింటికి వచ్చింది. హరీశుడు బయట గదిలో కూర్చుని ఉన్నాడు. "మీ భార్యను నేను ఎరగను. వచ్చి పరిచయం చెయ్యండి" అని వారిని అడిగింది.

హరీశునిగుండె దడదడ లాడింది. "నేను చాలా తొందరపనిలో ఉన్నా'నని తప్పుకోటానికి చూశాడు కాని లావణ్య వదలలేదు. వెంటపెట్టుకుని నిర్మల దగ్గిరికి తీసుకు వెళ్లింది.

తల్లీ కొడుకుల్ని నిర్మల బాగానే మర్యాద చేసింది. కుర్రవాడికి మిఠాయిపెట్టి, తల్లి కూర్చోటానికి చాపవేసింది. "మిమ్మల్ని చూడగలగటం నా అదృష్టం!" అనికూడా చెప్పింది.

లావణ్య దీనికి జవాబుగా అన్నది: మీరెప్పుడూ వ్రతాలూ ఉపవాసాలూ ఉండి శరీరాన్ని కృశింపజేశారని హరీశ్ బాబుగారు చెప్పారు. ఇప్పుడు మీరు అంత ఆరోగ్యంగా ఉన్నట్టు కనపడరే!"

నిర్మల నవ్వుతూ— "అన్నీ అతిశయోక్తులు! కాని, ఈ మాట మీకు ఎప్పుడు చెప్పారు?" అన్నది.

హరీశుడు అక్కడే మంచుని ఉన్నాడు. ఈ ప్రశ్నకు అతనిముఖం వెలవెల పోయింది.

లావణ్య — "కలకత్తాలో. అన్నందగ్గర కూర్చుంటే సరి మీమాటే. వారిమిత్రుని ఇల్లు మా ఇంటికి చాలా దగ్గర. మిద్దె ఎక్కి బిగ్గరగా మాట్లాడితే చాలు వినపడుతుంది.

నిర్మల— "మంచి వీలుగా ఉందికదూ ?"

లావణ్య నవ్వుతూ — "అంతమాత్రానికి ఏమీ లాభం లేకపోయింది. కుర్రవాణ్ణి పంపి రోజూ పిలిపించుకోవలసి వచ్చింది" అన్నది.

"నిజంగా ?"

"పైగా కులం పట్టింపు ఎంత ఉందనుకున్నారూ! బ్రహ్మసమాజంవాళ్లు వండింది తినరు - మా మేనత్త వండినా సరే. అన్నీ నేను వండి, వడ్డించవలసివచ్చేది!" అని నవ్వుముఖంతో హరీశునివంక కౌతుకంగా చూసి— "సరే, ఇందులో మీలాజిక్ ఎక్కడ ఉందో చెప్పండి? నేనుమాత్రం బ్రహ్మసమాజందాన్ని కానా ?" అని అడిగింది.

హరీశుని శరీరం కంపించి పోతున్నది. అతను ఆడిన అబద్ధం బయటపడింది—కాళ్లకింది భూమి కుంగి పోతున్నట్టయింది. అసలు ఆశ్చర్యమేమంటే, ఇంత కాండ జరిగినా నిర్మల ఇవ్వాళ ఒక్కమాటకూడా మాట్లాడలేదు. బహుశా, తను అసత్యమని ఊహించింది సత్యం కావడంవల్ల ఆమె మతి చెడి ఉండవచ్చు!

హరీశుడు పాలిపోయినముఖంతో బయటకు వచ్చి గదిలో స్తబ్ధుడై కూర్చున్నాడు. ఇలా ఎప్పుడో ఒకప్పుడు జరుగుతుం దని అతనికి తెలుసును — చాలాసార్లు లావణ్యకు చెప్పాలనికూడా అనుకున్నాడు. కాని, ఇలాంటి అవమానకరమైన విషయాన్ని ఆమెదగ్గర నోళ్ల పెట్టలేకపోయాడు.

లావణ్య వెళ్లిపోగానే నిర్మల తుపానులాగా వచ్చి — "ఛీ — మీ రంత అబద్ధాలకోరులా! అన్నీ అబద్ధాలే చెప్పతారా ?" అన్నది.

"ఓ, నా ఇష్టం! ఇంకాకూడా చెప్పతాను" అన్నాడు హరీశుడు కన్నెర్రచేసి.

నిర్మల ఒకక్షణం నిశ్శబ్దంగా భర్తవంక చూసి భోరున ఏడ్చింది.

"చెప్పండి, మీ ఇష్ట మొచ్చినన్ని అబద్ధాలు చెప్పండి. మీ ఇష్టమొచ్చినట్టు నన్ను మోసగించండి. కాని ధర్మమనేది ఉంటే, నేనేగనక పతివ్రతకూతురు పతివ్రతనైతే, మనోవాక్కాయాలా సతినైతే — నా కోసం మీరు ఒకప్పుడు తప్పక ఏడవవలసి ఉంటుంది; ఏడుస్తారు; ఇది తప్పదు" అని వచ్చినవిధంగానే చకచక వెళ్లిపోయింది.

ఇద్దరికీ మాటలు ఇంతకుపూర్వమే లేవు. ఈ ఘటన దాన్ని ఇంకా కొంచెం బలపరిచింది—అంతే! హరీశుడు తింటమూ పండుకోవటమూ క్రిందగదిలోనే. మామూలుగా కోర్టుకు పోతూ వస్తూనే ఉన్నాడు— మార్పు విశేషం లేదు. ఇంతకుపూర్వం సాయంత్రం క్లబ్బుకు పోతూ ఉండేవాడు. ఇప్పుడు అది కూడా మానాడు. కారణం, లావణ్యయిల్లు క్లబ్బుకు దగ్గరగానే. పతివ్రత అయిన భార్య రెండు కళ్లూ పదికళ్లు చేసుకుని పదిదిక్కులనుంచీ తన్ను కనిపెట్టి ఉంటున్నదని అతనికి తెలుసును. ఆ కళ్లకు విరామం లేదు, విశ్రాంతి లేదు— అతనిలో ఏదో ఆకర్షణశక్తి ఉన్నట్టు ఆశ్రయించుకు ఉంటవి.

స్నానం చేసి అద్దంముందు నిలబడినప్పుడు — ఈ పతివ్రత ప్రేమాగ్నిలో తపించి రక్తమాంసాలతో కూడిన తన కలుషితదేహం భస్మించి పాపరహితమైన దనిన్నీ, సాధ్యమైనంత త్వరలో ఊర్ధ్వలోకానికి పోవటానికి సిద్ధంగా ఉన్నదనీ అతనికి తోచేది. వారి అల్మారీలో వచన మహాభారతంకూడా ఉంది. కాలం గడవనప్పుడు అది తీసి, అందులోని పతివ్రతోపాఖ్యానాలన్నీ

ఏవి ఏవి చదివేవాడు. ఎంత అద్భుతమైన కథలు, ఎంత ప్రచండమైన పరాక్రమం వారిది! భర్త పాపికానీ తాపి కానీ, కేవలం భార్య పాతివ్రత్యంవల్ల పాపవిముక్తుడై కల్పాంతాన భార్యను కలుసుకుంటాడు. కల్పకాలం ఎంత ఉంటుందో హరీశునికి సరిగ్గా తెలియదు. కాని, అది తక్కువ ఉండదనీ, ఋషులు రాసిన శాస్త్రాలు అబద్ధం కావనీ అతనివమ్మకం. అందుచేత కల్పాంతం మాట తలపుకు వస్తే అతను బేజారయేవాడు. పరలోకానికి తిలోదకాలిచ్చి పక్కమీద పండుకుని ఇహలోకంసంగతి ఆలోచించేవాడు. కాని మార్గం కనపడేది కాదు. దొరలైతే వ్యాజ్యమో పాజ్యమో వేసి ఇంతవర కెప్పుడో వ్యవహారం పైసలుచేసుకుని ఉండేవారు; ముసల్మానులైతే ఎప్పుడో విడాకు లిచ్చేవారు; కాని ఇతను ఏకపత్నీవ్రతుడు, గౌరవకుటుంబానికి చెందిన హిందువుడు—ఊహుం. లాభం లేదు. ఇంగ్లీషువిద్య వల్ల బహుపత్నీత్వం నశించింది. విశేషించి, నిర్మల వంటి పతివ్రతను త్యజించటం అసంభవం. సూర్యచంద్రులకుకూడా ముఖం చూపించనటువంటి నిర్మలను, శత్రువులచేతకూడా అపవాదు వేయించుకోనటువంటి నిర్మలను అతను వదలిపెడితే, నిష్కళంకమైన హిందూ సమాజంలో ఆమెముఖ మెలా మాపుకుంది? లోకమంతా అతన్ని దుయ్యబట్టదా.

ఆలోచిస్తూ పండుకుంటే అతనినిద్ర వేకి ఎక్కేది. లేది హాజానీళ్లతో తల తడుపుకుని మిగిలిన రాత్రి ఈజీచైర్‌లో గడిపేవాడు. ఇలా ఒకమాసం గడిచింది.

ఒకనాడు హరీశుడు కోర్టుకు పోబోతూఉండగా దాసీ ఉత్తరం తెచ్చి వారిచేతికి ఇచ్చి — "జవాబు కావాలట" అని అంది.

దస్తూరి లావణ్యది. కాని కవరు చించి ఉంది. హరీశుడు—"కవరు ఎవరు చించా"రని అడిగాడు.

"అమ్మగారు" అన్నది దాసీ.

హరీశుడు ఉత్తరం తెరిచాడు. లావణ్య ఇలా రాస్తున్నది:—

"ఆవాళ నేను జబ్బుగా ఉండటం మీరు చూచే పోయారు. కాని బ్రతికానో చచ్చానో మళ్లీ కనుక్కో లేదు. పైగా, ఇక్కడ నాకు మీరుతప్ప నా అనేవారు ఎవ్వరూ లేరనికూడా మీకు తెలుసును. ఏమైనా కానివ్వండి. ఈ దఫా నేను చావలేదు. బ్రతికే ఉన్నాను. ఈ ఉత్తరంకూడా నేను ఈ విషయమై రాయటం లేదు. రేపు మా అబ్బాయి పుట్టినపండుగ. కోర్టునుంచి వచ్చేటప్పుడు ఒకమాటు ఇంటికి వచ్చి వాణ్ణి ఆశీర్వదించి పొమ్మని యాచిస్తున్నాను."

"పి. యస్.— రాత్రికి ఇక్కడనే భోంచేయాలి. సంగీతపు ఏర్పాటుకూడా ఉంది.

"లావణ్య"

ఉత్తరం చదివి ఒకక్షణం అతను అన్యమనస్కుడై హఠాత్తుగా తల ఎత్తి చూచేవరకు, దాసీది నవ్వును కన పడకుండా చేయటానికి తల వంచుకుంటున్నది; అంటే, ఈ యింటి దాసదాసీలకుకూడా ఇది ఒక తమాషా అయిందన్నమాట! అతనిరక్తమంతా ఉడికిపోయింది.— దీనికి ఇక హద్దు లేదా? సహించినకొద్దీ అత్యాచారం ఎక్కువ కావలసిందేనా?

"ఉత్తరం ఎవరు తెచ్చారు?" అన్నాడు హరీశుడు.

"వారింటిదాసీది."

"కోర్టునుంచి వచ్చేటప్పుడు వస్తానని దానితో చెప్పు" అని హరీశుడు వీరదర్పంతో మోటారు ఎక్కాడు.

ఆ రాత్రి హరీశుడు ఇంటికి తిరిగివచ్చేవరకు నిజానికి చాలా పొద్దు పోయింది. హరీశుడు కారు దిగి పైవంక చూశాడు.— నిర్మల పడకగది కిటికీదగ్గర ప్రతిమవలె స్తబ్ధురాలై నిలబడిఉన్నది.

౬

డాక్టర్లు ఇంతకుముందే వెళ్లిపోయారు. ఇంటి వైద్యుడు వెళ్లబోయేముందు ఇలా చెప్పాడు.

"బహుశా నల్లమందు అంతా కక్కించామను కుంటాను. అమ్మాయి తప్పకుండా బ్రతకవచ్చు."

హరీశుడు తల ఎగురవేశాడు. దానివల్ల ఏభావం వ్యక్తమైందీ డాక్టరు గమనించలేదు.

"జరగవలసిం దేమో జరిగిపోయింది. రెండు మూడు రోజులు జాగ్రత్తగా కనిపెట్టిఉంటే ఈ ఆపద గడిచిపోతుంది" అన్నాడు మళ్లీ.

"చిత్తం" అని హారీకుడు అలానే చూస్తున్నాడు.

ఆరోజున చార్ లైబ్రరీలో చర్చకొంచెం ఘాటుగా ఉంది.

కిరణ్ — "మాగురువుగారితో ఎప్పుడో చెప్పాడు మనుష్యుల్ని నమ్మవద్దని. ఆరోజున జమీందారు కోడళ్ళ గురించి అయిన 'స్కాండల్' మీ రెవరూ నమ్మలేదు. హారీకుడు ఇలాంటిపని ఎప్పటికీ చేయ డన్నారు. ఇప్పుడు చూశారా ? గురుదేవుని కృపవల్ల మీరు డ్రీమ్ చేయనటువంటి విషయాలు నేను చాలా కనిపెట్టగలను."

బ్రజేంద్రుడు —"అబ్బ, హారీకుడు ఎంత స్కౌండ్రల్ ? అలాంటి ప్రతివ్రత భార్యను పెట్టుకుని ప్రపంచంమీద పడుతున్నాడు విలాసార్థం! ఇలాంటి లుచ్ఛాలకే అలాంటి భార్యలు దొరకడం మరీచిత్రం !"

వృద్ధ తారిణీచటర్జీ హుక్కా చేతపట్టుకుని కునికిపాట్లు పడుతున్నాడు— "నిస్సందేహంగా నన్ను చూడండి, ఇంత ముసలివాణ్ణయినా, నాక్యారక్టరు మీద ఒక్కడుకూడా స్పాట్ వేయలేకపోయాడు. ఇలాంటి నాకే ఏడుగురు ఆడపిల్లలు. వాళ్లకు పెళ్లిళ్లు చేసి దివాలా తీశాను."

యోగీన్ — "లావణ్యప్రభ ఆదర్శమైన స్కూల్ ఇన్‌స్పెక్ట్రెస్ ! గవర్నమెంటు ఈమెను ముఖ్యం చేయటం మంచి దనుకుంటాను."

కిరణ్ — "యాబ్సొల్యూట్లీ నెససరీ."

నిండా రోజయినా గడవలేదు, పతివ్రతభర్త, హారీకుని నడత పట్టణమంతా తెలిసిపోయింది. మిత్రుల కృపవల్ల ఈ సంగతు లన్నీకూడా హారీకునిచెవిని పడ్డవి.

ఉమ వచ్చి కళ్లు తుడుచుకుని— "అన్నయ్యా, నువ్వు మళ్లీ పెళ్లిచేసుకో" అని చెప్పింది.

"పిచ్చా !" అన్నాడు హారీకుడు.

"పిచ్చి ఎందుకు ! మనదేశంలో మగవాళ్లు మారు పెళ్లిళ్లు చేసుకునే ఆచారం ఉందిగా ?"

"అనాగరికులు చేసుకుంటారు."

"అనాగరికు లెందుకని ? నీకష్టాలు ఇతర్లకు తెలియకపోయినా నాకు తెలుసును. జీవిత మంతా ఇలా వృథా కావలసిందేనా ?"

"మరోదోవ ఏముంది చెల్లీ ? భార్యను వదలిపెట్టి పెళ్లిచేసుకునే ఆచారం మగవాళ్లలో ఉంది. కాని స్త్రీలకు లేదు. నీవదినెకుకూడా ఈ అధికారం ఉన్నట్టయితే నేను తప్పక నీమాట వినేవాడిని."

"నువ్వు ఏమి చెప్పతావు, అన్నయ్యా!" అని ఉమ కోపంతో వెళ్లిపోయింది. హారీకుడు ఏకాకిగా చూస్తున్నాడు. నిరాశాపూరితమూ అంధకారమూగా ఉన్న అతని చిత్తములోనుంచి— "దోవలేదు ! దోవలేదు ! ఈ నిరానందజీవితంలో దుఃఖమే ధ్రువము !" అనేమాటలు మాటిమాటికీ వెలువడుతున్నవి.

పొద్దు కుంకింది. అతను చూస్తున్న గదిలో చీకటి అలముకున్నది. పక్క ఇంటినుండు వైష్ణవ స్త్రీలు దూతికాగీతం పాడుతూ భిచ్చమెత్తుకుంటున్నారు. కృష్ణుడు గోపికలతో చెప్పకుండా పెట్టకుండా బృందావనం వదిలి మధుర వచ్చాడు. అత నిలా చెప్పకుండా పారిపోయిరావటం చాలా దుర్మార్గమని దూతికలు నూటిపోటిగా కృష్ణుని నిందిస్తున్నారు. ఆ కాలంలో కృష్ణుడు దూతికలకు ఏమి జవాబిచ్చాడో తెలియదు. కాని ఈకాలంలో హారీకుడు ఎమ్మెడీ తీసుకోకుండా కృష్ణుని తరుఫున ప్లీడరుగా నిలబడి మనస్సులో దూతికలతో వాదింప నారంభించాడు :—"ఓ దూతికలారా ! స్త్రీల ఏకనిష్ఠప్రేమ మంచిదే — ప్రపంచంలో దానికి సాటిలేదు కూడాను. కాని, మీకు అన్ని సంగతులూ తెలియవు, చెప్పినాకూడా గ్రహించుకో లేరు. కృష్ణుడు ఎవరికి భయపడి బృందావనంనుంచి పారిపోయాడో నాకు తెలుసును. కంసుడూ గింసుడూ ఉత్తది; అసలు రాధ ఏకనిష్ఠప్రేమకు జడిసి పారిపోయాడు." తర్వాత కొత్త ఆని మనస్సులో ఇలా అనుకున్నాడు:

"అయితే, ఆకాలంలో అతను పారిపోకుండా దాక్కోవాలన్నా వీల్లు ఉండేవి. కాని ఈకాలంలో మహాకష్టం! పారిపోవాలంటే మార్గం లేదు, తల దాచుకోటానికి చోటు లేదు. ఇక ఒక్కటే మిగిలి ఉంది. అనుభవజ్ఞుడైన కృష్ణుడు దీనుడిమీద దయతలచి కొంచెం త్వరలో తనదగ్గరికి పిలిపించుకుంటే ఈ జీవుని చెర విరగడ అవుతుంది."

# గురుజాడ అప్పారాయస్మృతి*

శ్రీ ఆదిభట్ల రామమూర్తి

తేటతెనుంగుఁ బల్కు-లను దీయని తేనియ ముంచి యుక్తి నో
రూటల నూరుఁ గమ్మనగు లుట్టెడు చిక్కని కండతెన్గుతో
సీటులు దిద్ది, క్రొంజవుల నింపుచు జాను తెనుంగుఁదల్లి కిన్
మాటలఁ గ్రొత్తపోకడల నవ్యతఁ గూర్చిన యప్పరాయనిన్
మాటికి మాటికిం దలఁతు, మన్మది హర్షజలాబ్ధి దోఁగఁగన్.

కమ్మని తెన్గు బాస కొంకకమ్మఁదనంబును గూర్చి మంచిము
త్తెమ్ముల క్రొమ్మెఱుంగువడఁ దీరిచి, యేరిచి, కూర్చు నూత్నభా
వమ్ముల నవ్యకాంతుల నపారముగాఁగల రమ్యఖండకా
వ్యమ్ములఁ దెన్గు వారి హృదయమ్మున కర్పణచేసి, కీర్తికా
యమ్మున ధన్యుఁడై యలరు నాతని గొల్తును అప్పరాయనిన్.

జాజిపూవు తావి, సహకారమాధురి
మొలకలేఁతఁదనము, మొగ్గతళుకు
గలుగు తెలుఁగుబాసఁ గులుకుల నొలికించు
నప్పరాయవర్యు నభినుతింతు.

ఏ కలమ్ము మృదూక్తులను ముత్యాలసరాలతుషారమ్ము రాల్చినదియో,
ఏ లసద్ఘనవాణి యొలి సీలినిగరాల నలసీలగిరిపాట లల్లినదియో,
ఏ కవీశ్వరు పూతహృదయమ్ము క్రొత్తప్రాంతలకూర్పు క్రొందీప్తి నలరినదియో,
ఏ దివ్యవాణి గిరీశము నింటింట సృష్టించి జగతి కర్పించినదియో,

---

* విజయనగరం మహారాజావారి ఆంగ్లకళాశాల విద్యార్థిసంఘము యాజమాన్యమున జరుపబడిన (౨౫-౭-౩౯) మహాకవి గురుజాడ అప్పారాయ స్మారకోత్సవము సందర్భమున – అధ్యక్షులగు శ్రీ కళాప్రపూర్ణ గిడుగు రామమూర్తి పంతులుగారి సమక్షమున— చదివినవి.

ఏ సుహృద్భావ సంపద్వికాసకుసుమ
రాజి బంగారు పుప్పొడి రాల్చినదియొ
అట్టి విజ్ఞానపుంజరూపాధినాథు
నా వచస్విని అప్పరాయునిఁ దలంతు.

షేక్స్పియర్ సత్కవిశ్రేష్ఠుని "ఫాల్‌స్టాఫు"నందలి హాస్యరసాంశములును, శూద్రక కవివతంసుని "శకారుని" వికారములఁ గలట్టి భావములసారమల పాండురంగని తులలేని "నిగమశర్మా"ఖ్యుని భోగపరాయణతయు వేదమువారి యామోదంపు "యౌగంధరాయణుని" యుక్తిఉపాయములును

ఒక్కనీయందె గుప్తమై యున్న వహవా!
వీరికంటెను వయసునఁ బిన్నవయ్యు
మిన్నవై యందరికిఁ దలఁ దన్నినావు!
ఇదె నమశ్శత మందు మోయీగిరీశ!!



# సారస్వత సమీక్ష

శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

మాతృభాషలో ప్రబోధము జరగవలె నని నేడనేకులు కాంక్షించుచున్నారు. ఈ యంశము మది కందేని యానందముఁగొలుపుట నిక్కము. కాని మాతృభాషలోనే ప్రబోధము జరిగినంతన, శాసనసభలందును, పాలనాసంస్థలందును తల్లిమాట ప్రచలిత మైనంతన సంపూర్ణ సాహితీసేవ నివ్వటిల నేరదు. అసదృశసాహిత్య సృష్టియందే ఉదారాశయములు నందన మందిలి ననలవలె సుందరములై వెలసి సౌరభాన్వితమైన సందేశమును జగతిలోనికి ప్రుత్తెంచును. వాఙ్మయాంగణమున నందన సృష్టి గోచరించినవాడే ఉత్తమసాహిత్యలక్ష్యము చరితార్థత గాంచు నని వచింతును.

నందనసృష్టి నిలింపులకే సాధ్యము. నిలింపులైన రచయితలే రమ్యమైనసృష్టి గావింపనేర్తురు. అమర భూమి కెనయైన సాహిత్యక్షేత్రమందే వీరు వనమాలులై యుందు రనుట స్పష్టము.

ప్రస్తుతసమయమున భారతభూమిలోని వివిధ సాహిత్యము లొక్కతీరున లేవు. నైసర్గికముగ భాషకుగల ప్రత్యేకశక్తివలన, గుండెలందు పీయూష పాత్రము లిడికొని ధన్యతలమున నవతరించిన రచయితల సేవవలన, కిరణవితానమును లేఖనీ స్తోమ మొనరించుకొని వెలుగులు వెలారించు సౌందర్యోపాసకుల వ్రతమువలన, ప్రజానీకమందలి సాహితీజిజ్ఞాసవలన, కవులు కొందు అవరానురాగములవలన ఉజ్జ్వలసృష్టి కావలెను. సాహితి వెలుగని భాషలును, భావవిధూతికి నిక్షేపములైన భాషలును భారతదేశమున గలవు.

ప్రత్యేకసాహిత్యాభివృద్ధి విశేషముగ ప్రత్యేక కారణములపై నాధారపడియుండుట విదితమేకదా!

కాలపథమున మైలురాళ్లైన శతాబ్దులను దాటి దాటి పూర్ణపరిణతి గన్నులార జూచుటకై తెలుగు సాహితి యింకను సలుపవలయు యాత్ర ననుసరించి నేటిభాషాధత్తునిసేవ యుండును.

స్వతస్సిద్ధమైన మాధుర్యముగల ప్రపంచభాషలలో తెలుగొకటి. ఆర్యసంపర్కమునుగాని, సంస్కృత సఖ్యమునుగాని యెఱుంగకమున్నే ద్రవిడభాషలందొక్కటై ఆంధ్ర మలరారినది. ఆంధ్రవాణికిని, భారతాంబకును ఎన్నోపోలిక లున్నవి. అన్యభాషల నాంధ్రభాషాయోష తనవి గావించుకొనినది.

తెలుగు పైశాచికభాషకడుపున బుట్టినదని మన భాషాచరిత్ర తెలుపుచున్నది. తెలుగుమాటలు కొన్ని పాళీభాషలోను, పాళీపదములు కొన్ని తెలుగులోను గలవని సోదాహరణముగ తెలుపగలము. సంస్కృతమున దివ్యవాణిని విని, తన సింహద్వారమును తెఱచి, ఆ దేవికి మనభాషామతల్లి స్వాగత మొసగినది. నేటి భాషలని నేము ప్రశస్తినందిన వాఙ్మయములు పూర్ణవర్ణమూల వెలుగనికాలమున పరసకవితాధారలతో తెలుంగొప్పినది. ౬౧౫ లోనే తెలుగుశాసనము తల యెత్తినది. ౬౩౩ లోని విప్పర్తిశాసనము గద్యతోనే యొప్పినను, ౮౮౫ లోని అద్దంకిశాసనము గద్యపద్యాత్మకమై వెలసినది.

తెలుగుకావ్యముల కింపలి చంపువు మేలుబంతి యాయెను. తరువోజ మలయసమీరములీల తెలుగు తోటలో మసలినది. నన్నయ నన్నెచోడులు మార్గకవిత్వ దేశికవిత్వములకు మార్గదర్శకు లైరి. ఆర్యద్రావిడసమ్మేళనము రానురాను ఆంధ్రమున నలరారినది. ఆర్యభాషలలో దేనికిని, ద్రవిడభాషలలో దేనికి గాని తీసిపోనిదై తియ్యందనమునకు, చక్కందనమునకు తెలుగు నెలవైనది. కావుననే కృష్ణదేవరాయలు "దేశభాషలందు తెలుగులెస్స" యనినాడు. "Telugu is the Italian of the East"అని పాశ్చాత్యులే మన

వాఙ్మయమహత్త్వమును ప్రశంసించిరి కాదా? "It is the French of the South" అని కొంద రౌత్తరాహ కవులనుట నేను వినియుంటిని.

జగదీశునిచేతిలోని కాంతికందుకము చిటిలి నక్షత్రములై విహాయసమున రాలినలీల, తిక్కనకలమునుండి ఆంధ్రసాహితీవియత్తలమున జాక్కులు జలజల రాలి ఆనందవ్రతుల మానసనేత్రములకు మిఱుమిట్లు గొలిపినవి. కవియై కలముమీదను, సచివుడై ఖడ్గముమీదను తిక్కన దృష్టి సారించినాడు. ఒక్కొకపు డీత డీసాధనముల నొకదానికి రెండవదానిని మార్చుకొనినాడు. ఈతని యుద్ధఘట్టములను వీక్షింపుడు. మానసికముగ నీమహారథికుడు ధర్మయుద్ధమునకు సన్నద్ధుడై కురుక్షేత్రమున ప్రవేశించి కలముతో కాక కౌక్షేయకాస్ఫాలనముతో రణవర్ణనము గావించినాడు. తిక్కన కర్మవీరుడైన భావోపాసకుడు. స్వీయప్రకృతి కనుకూలించు మహాగ్రంథము నాంధ్రీకరించు నవకాశము లభించుట ఈతని భాగ్యము. సచివుడై ఈతడు తన మేధాశక్తిని ప్రదర్శించినాడు.[1] షేక్స్పియర్ వలె నీతడు దుమ్మును చేగొని రంగారుబంగారును చేయకపోయినను, కొమర్రాజువారు చెప్పినట్లు వ్యాసు డిచ్చిన పుత్తడితో కన్నుకుట్టు నగ చేసినాడు. దుమ్ము దీసి పుష్పాడి చేయకపోయినను, పింగళివారు తెలిపినట్లు అరణ్యమును రమ్యోద్యానము గావించినాడు. కర్మవీరుడయ్యు, ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమున నిలిచినవాడయ్యు, నీమహనీయుడు భగవద్గీతను తనయుద్గ్రంథమునుండి తొలగించుట శోచనీయము. గభీరతాత్త్వికసంభూతికిని, మహితభావైశ్వర్యమునకును నిధానమై పాశ్చాత్యతాత్త్వికకవుల యనుకరణ యనుసరణములను బురికొలిపిన ఈగ్రంథరాజము ఏలనో తిక్కనభారతమున చోటు నందినది కాదు. ఈతని ప్రతిభ అత్యద్భుతమైనదయ్యు, భారతాంధ్రీకరణమున నీతని సహజప్రజ్ఞ కడుంగడు చక్కగ ప్రకాశించినను, కథాకథనమును నాటకరచనమో యనునట్లు పరివర్తన మొనరించి కడుశేరిమితో నీతడు పాత్రపోషణ మొనరించినను, ఈతడు చేగొనిన మాతృక వ్యాసమహాకవిరచితమగుటచే, అనువాదపంథనుండి తిక్కన చాలగ తొలగిపోనందున సంపూర్ణ స్వాతంత్ర్య విజృంభణమునకు నవకాశ మిచ్చు రచనమునకుగూడ నీతడు దొరకియుండిన మన సాహితీసీమంతిని కెంత మేలయ్యెడిదో యని యూహింపక మానము. పరిమళముగల కేతకి పుష్పసృష్టియం దుండును; ఇట్టి పదములే లలితకవితయం దొప్పును. ఇవి మరందపూరితములు. తిక్కనపదములు చెఱకు లిట్టివి. ద్రాక్షలను దెచ్చి తనకైతయం దీతడు పిండుకొనియుండును.

ప్రథమాంగ్ల మహాకవి ఛాసరు భూతలమున నవతరించుటకుమున్నే ఆంధ్రవసుంధరలో శబ్దానుశాసనుడును, కవిబ్రహ్మయును, ప్రబంధపరమేశ్వరుడును వెలసి యశస్తిలకు లైరను ముఖ్యాంశము పఠితలు గమనింతురుగాక ![2]

---

1. ఇతడు రాజ్యతంత్రములను నుత్తించిన మహనీయుడు. తనసేనాయోధులను, ఏలికయోధులను ఈతని కంతో ప్రీతి యుండెడిది. మనుమసిద్ధి దాయాదులవలన రాజ్యముగోలుపోయినపుడు ఓరుగంటి యేలికయైన కాకతీయగణపతిరాజు పాలికరిగి అతనిచే తనరాజశత్రువులను తఱుమగొట్టించి, తిక్కన తనప్రభువునకు రాజ్య మిప్పించెనుగదా!

2. క్రీ. శ. ౧౦౫౦ సం॥ ప్రాంతమునందు రాజమహేంద్రవరమున పాలించుచుండిన రాజరాజనరేంద్రుని యాస్థానమందు నన్నయభట్టారకుడు కవిగానుండెను. క్రీ. శ. పదుమూడవ శతాబ్దము ప్రారంభమున నెల్లూరుమండలమును పరిపాలించుచుండిన మనుమసిద్ధియొద్ద తిక్కనసోమయాజి ఆస్థానకవిగా నుండెను. ఎఱ్ఱాప్రెగడకవి పదునాల్గవ శతాబ్దము నుత్తరార్థమునందు వరలెను. క్రీ॥ శ. ౧౩౨౭ మొదలు ౧౩౭౭ వఱకు ఇంగ్లాండును పాలించిన మూడవ ఎడ్వర్డుకాలమున ఆంగ్లేయులకును ఫ్రెంచివారికిని పొసగిన నూరేండ్లమహాయుద్ధము ప్రారంభమైన వెనుక అంతదనుక మూలబడియుండిన ఆంగ్లము ఫ్రెంచివారిమీది విద్వేషముకతన దలయెత్తగా నేలికకు సేవకుడైయుండిన జియాఫ్రే ఛాసర్ "Canterbury Tales" మున్నగు గ్రంథములు వ్రాసినాడు. కెయిడ్మన్, సైనెవుల్ఫ్‌లను తొల్లింటి గొల్లకవులవాక్కు లెవ్వియో యెవ్వరు నెఱుగరు కావున ఛాసరే ప్రథమాంగ్లకవిగా గణింపబడినాడు.

షేక్స్పియరుమహాకవికి సమకాలికుడై వేమన యిచేకాలములో ప్రపంచవాఙ్మయమందలి స్వాతంత్ర్య భావమును ఆత్మజ్ఞాదిలోనికి నాకర్షించుకొని, పింగళి సూరనార్యుడు తనయుద్గ్రంథములను రచించినాడు. భారతభూమిలోని తోలినవలాకర్త యీతడేసుడీ!

శ్రీచైతన్యుడు వంగావనిలో నవతరించి,నవద్వీప ములో నర్ధనిమీలితనేత్రుడై "నాథా! నాథా!" యని శ్రీకృష్ణుని సంబోధించుచు తన్మయనృత్యము చేయకముక్నే ఆంధ్రజగతిలో నుదయించి శ్యామసుంద రుని పట్టమహిషియై పోతరాజు జగద్గితముగా భాగవత ము నాంధ్రీకరించినాడు. మందుమలలోని మహిత భావ ము భాగీరథియై వెడలినట్టే భాగవతోత్తముని హృదయ మందలి భావోద్వేగము భవ్యకవితాపూరమై వెడలినది. పునరుజ్జీవనోద్యమములో (Renaissance movement) తల యెత్తకముక్నే నిరంకుశాభిప్రాయముల నెదిరించి మార్టిన్ లూథర్ తనమహోద్యమమును లేవందీయుటకు మున్నే దక్షిణభారతమున భావస్వాతంత్ర్యము నుగ్గడించి, పోతన దానిచే జయభేరి మ్రోగింపజేసినాడు. మధుపం బులుకొలాలు పత్రికలు ఈతని రచనమున మందారమక రందమాధుర్యము చవిచూడగలరు. పోతనయేకాక శ్రీచైతన్యునకు దీపించిని భక్తాగ్రేసరులు పల్వురు తెలుగునేలలో ప్రభవించిరి. త్యాగరాజాపగిది కవియు ను, గాయకుడును, మహాభక్తుడును ప్రపంచమున మ రెందు నుదయించెను? నారాయణతీర్థులు, క్షేత్రయ్య, సభాపతయ్యలు రాల్గరగించు విమలగాంధర్వము ఆంధ్ర భావలోనే కలదని సోదాహరణముగ నుగ్గడించిరికదా!

శ్రీనాథుని ప్రకృతి వేఱు. ఈతడాధ్యాత్మిక సంపద నెఱుగడు. కాని, యీతడు గ్రీకుకవులవోలె సౌందర్యోపాసకుడు. కీట్సురచనమువలె నీతనిరచనము మనోహరమై యుండును. బైరను షెల్లీలవలె నీతడు శృంగారమును వలచును. కాని బైరను షెల్లీలు కేవ లము శృంగారమంటే మునిగి తేలలేదుకదా! తాత్త్విక చింతనను, శృంగారమునకును భారతకవులు మేలి చెలిమి గూర్చిరి. ఈయుత్కృష్టక్రియలో శ్రీనాథుడు గాని అతనివోలు శృంగార ప్రియులుగాని సిద్ధహస్తులు కాలేదు. బైరనువలె శ్రీనాథుడు స్వాతంత్ర్యమును కీర్తింపలేదు. దానికై అన్యసీమలో అసువులు బాయ లేదు. కీట్సువలె అపురూపమైన దేవవంది మాగధులలో నొక్కండై జగదీశునిచుట్టు నృత్యముసేయుచు గీతాలా పన మొనరింపలేదు. కాని శిల్పచాతుర్యమున రచనా కౌశలమున, శైలిసౌందర్యమున, రసపోషణమున శ్రీనాథుడు వీరిసమానుడని తలంపకమానము. మహా భోగియై మని, కడకు జోగియైనను ఆత్మవిశ్వాసమును, సాహసమును తనసొత్తులు చేసికొని, "దివిజకవివరుగుండె యదల్ దిగ్గరనగ" నీమహాకవి అమరపురి కరిగినాడు. కృష్ణదేవరాయల ఆస్థానమందలి కవులు అష్టదిగ్గజ ములే! భావనాశక్తియందు పెద్దనాదు లీమహాకవుల కును దీసిపోరు. కొందఱు నెట్టిగ శ్లేషనే పట్టి, పచ్చి శృంగారమున పడి, శబ్దచిత్రములందే ధన్యత గాంచినను తమయుద్రేకమును చిత్తమువచ్చినట్లు విజృంభింప నిచ్చి నను, ప్రబంధకవులు ప్రతిభారహితులని తలపజెల్లదు. మేఘపథములందు విహరించిన ఆంధ్రకవు లనేకు లున్నారు. కాని ప్రత్యక్షజీవితమున నడుములు గట్టి నిలిచి పాత్రసృష్టి గావించినవా రెవ్వరును లేరు. గ్రీకు సాహితిలో Pegaseanwing తోడునట్లు Parnassus పాదమూపునట్లు ఉదుపీథి నెగయువారుకనును, బ్రహ్మకు నైన నెన్నదలముగాని నగమహత్త్వమును మనసాహిత్య మున దోచును. కాని సాహితి కేవలము అతిలోక చిత్రములకే సంబంధించినది కాదు. ఊర్ధ్వప్రపంచ మందే దీనినిలయము నిలువలేదు. సౌదామినీసీమంతినులే దీనిచెలికత్తెలు కారు. సత్యముపై నిలుచు దీనిపాత్రలు ప్రత్యక్షపృథ్వియందే సృష్టికావలెను. కళోరానుభవ మెంతేని జ్ఞానమును కేహార్చును. ఈ జ్ఞానము విశేష ముగ కట్టెదుటి జీవితమునకు,మనుష్యప్రకృతికి దేశస్థితికి సంబంధించినది. ఇది కవిహృదయమున నొక్కొక్కపుడు భుగుల్భుగుల్మను మంటలు లేపును. వేఱొకప్పుడు ఆనందశరధి నుప్పొంగించును. తనదేశమున తనకాలమున ప్రజలు పలుపు స్వాతంత్ర్యసమరమున శాల్గొనికదా మిల్టనుకవీంద్రుడు "నాకమున దాసులై యుండుట కంటె నరకమున నేలికలై యుండుట మేలు" అని నాడు. తీవ్రానుభవసముద్భవవాక్కులే విశ్వకుహర మున ననంతకాలము ప్రతిధ్వనించును. గంభీరభావ గర్భితములైన యిట్టివాక్కులే కదా సాహిత్యసృష్టి

కింతేని పుష్టిని యుగములకు నెంతో తుష్టిని ఒసగును. ప్రత్యక్షచరిత్ర ముజ్జ్వల విజయవిభవమున వెలయుచుండ మహాకవులు ప్రభాతనభమునుండి వెడలు కనకమరీచుల మాడ్కి ప్రతిభాకాంతులను సాహితీజగతిపై వెద జల్లుదు తమదేశ దిశావలయమున తేజరిల్లెదరు. ఎలిజబెత్ కాలమున నాంగ్లవసుంధర పడసిన యున్నతి, షేక్స్పియ రాదులను సృష్టించినది. ఆంతరంగిక సౌందర్యమునకు ఆంగ్లవసుంధరనే తొలుత పేర్కొనవలె నని తెలుపును, తన చారిత్రిక నాటకము లందు షేక్స్పియరు యెట్టిదేశభక్తిని ప్రకటించినాడు కాడు? ఇట్టినాటకములు ఆంధ్రభూమిలోనే కాదు భారతభూమిలో మఱెందైనను లేవు. "నిస్తంద్ర ప్రతిభాసుధీమతి!...రాట్పురీహరణ లీలావార్య శౌర్యోదయా! అసత్కీర్తి మలినపరిపంథి నృపా!" అని తమ యేలికను ఆశ్వాసాంతములందు మనకవులు సంస్కృతమున గీర్తించిరి కాని ఆ ప్రతిభను పురస్కరించుకొని దేశాభివృద్ధిని పరిశీలించి, ఆంధ్రమహిమను ప్రత్యక్ష పాత్రసృష్టియందు దృష్టాంతీకరించి, దిక్కులను ప్రేక్షకు లాదరించుకొనగల దృశ్యకావ్యములను సృజించిరి కారు. వెనుకటి కథలనే కైకొని తొల్లింటి వ్యక్తులనే తమ చేతులందు నవ్యసృష్టి నందని పాత్రలనే తమగ్రంథములందు నిలిపిరి కాని చారిత్రకప్రసిద్ధి నందిన ఆంధ్రోన్నతిని మనసున దలపోసి ఆంగ్లకవి కీర్తి మచ్చుపడు వడువున, ఆంధ్రప్రభావము ప్రపంచసాహితిలో చిరాంకిత మగుతెఱగున స్వతంత్రరచనలను గావించిరి కారు. అనవరతము రాజన్యులమీదనే, దృష్టి స్థాపించిరి కాని పామర జీవితమున బ్రవేశించి, ఉత్కృష్ట పామరపాత్రలను సృజించిరి కారు. Pantheism ను మనసునకు బట్టించుకొనిన వర్డ్స్వర్త్ మహాకవి తాత్త్వికచింతయందు మునగీత నీది మరియువాడైనను, పల్లెవాసులను తన చుట్టుక్కన చేర్చుకొని, పల్లెజీవితమును చిత్రింపలేదా? బర్న్స్ పల్లెపాటలమున పిల్లంగ్రోవి నూదిన గొల్లవాడేమోయని యూహింపమా? సాహితి పామరులనుండి వేఱుకారాదని మనశైవకవులు గుర్తించుట నిక్కమే! జానుతెనుగునే వాడి వీరు తమరచనలను పామరమానసములకు సన్నిహితము లొనరించుట వాస్తవమే! పాల్కురికికవియును, గౌరనామాత్యుడును తెలుగులోని లేటదన మెట్టిరో, తెలుగునేలలోని మూలమూలలందు గూడ ప్రకటింపజాలుట యథార్థమే! కాని, వీరి యుద్దేశము శైవమతప్రచారమే కదా! పేదగొల్లయెడల నీశ్వరపుత్రుడు మానవాఘుడు చూపిన అవ్యాజవాత్సల్యమును గౌరన్న తనద్విపదలో తియ్యనిమడువుల గీర్తించినాడే కాని కష్టెదుటి జీవితమునుండి యెట్టి పాత్రను సృష్టింపజాలడయ్యెను.

సంస్కృతముతక్క తక్కిన భారతభాషలును, ప్రపంచమందలి బహుళవాఙ్మయములును సరససాహిత్యము నెఱుగని కాలమునగూడ నలరారినను, సహజ సౌందర్య సౌష్ఠవ మాధుర్యములతో నొప్పినను, కళ కాంక్షించు బహుగుణములను కవితల్లజుల కౌశలముకతన నలవఱచుకొనినను, పూర్వోల్లిఖితలోపముకతన తన తరువాత తలసూపిన ఆంగ్లసాహితితోగాని మొనమొన్న దలయెత్తిన వంగసాహితితోగాని సరిగా నిలువనేరక అంతర్జాతీయ సాహిత్య మహాపథలందు ఆంధ్రసాహితి తనవిజయభేరిని మ్రోగింపజాలకున్నది.

సాహిత్యాభివృద్ధిని పురికొలుపు ప్రధానాంశముల గొన్నింటి నుల్లేఖించియుంటిని. వివిధవాఙ్మయ పరిశీలనమును, ఆత్మపరీక్షయును, ఉత్కృష్ట దృష్టాంతానుకరణమును వానికి తోడుకావలెను. ఆంగ్లయుగ మావిర్భవించిన పిదప నీపరిశీలనమునకు వలసిన సదుపాయము లెన్నో పొడసూపినవి.

వీనిని వంగీయులు అత్యద్భుతముగ వినియోగించుకొనిరి. ప్రాచీప్రతీచీ సాహిత్యముల దృక్పథములను గ్రహింపగలిగిరి. సంప్రదాయమందే కైదీలై పడియుండక, జాత్యుద్ధరణమునకై అంతర్జాతీయతత్త్వసిద్ధియును విశ్వవిస్తృతమైన భావబాంధవ్యమును అవశ్యములని గుర్తించిన రామమోహనరాయలు ప్రపంచమందలి ప్రధానభాషలన్నిటిని బఠించి, గురుగంభీరమైన భావోద్యమమును లేవదీసి మతసాంఘికోన్నతులతో బాటు సాహిత్యోన్నతిని గాంక్షించి వంగవాఙ్మయమున దన సమన్వయ విధానమునకు నంకురార్పణ గావించినాడు. కావున వంగసాహిత్యోపాసకులు ఆంగ్లభాషావిశారదులై నవ్యభావపూరమును మనసార ద్రాగి, తోడ్తోడనే ప్రాచీనసాహితీభాగీరథిని గ్రోలిన జహ్నుమునులైరి.

వీరిహృదయమున నుభయభావపూరములు గంగా యమునలై కలసి, పదపడి అందుండి వంగసాహిత్య క్షేత్రమున ప్రవేశించి, ప్రపంచ విజ్ఞానయాత్రికుల నాకర్షించు వారణాసి నందు సృష్టించెను. ఈపుణ్య క్షేత్రమును పరిశీలించుటకును స్నిగ్ధసంయుక్తభావ పూరము లెట్టివో పరికించుట పాడికాదా ?

కళ క్రొత్తందనమును కాంక్షించును. కావున మహాకవు లందఱును (వీ రేకాలపువారైనను, ఏదేశమువారైనను) నవ్యసృష్టిమీదనే మనసులు నిలిపెదరు. ఇట్లని గతమును వీరు ధ్వంసముచేతురని యూహింప దలపడరాదు. తమస్పర్శచే వీరు సౌందర్యప్రదీప్తమైన పరివర్తనము గావింపసేర్తురు. ప్రాస్పెరో మంత్రశక్తిగల చిత్తము జేబూనె నని చదువుదుము. (Vide "The Tempest") దీనిస్పర్శ ఎట్టి యద్భుతదృశ్యములను సృష్టింపలేదు ? కవియై తానెఱిగిన రసవాదవిద్య (Alchemy)ను షేక్స్పియర్ రవి కాపాదించినాడు.[3] ఈతనిమాట్కి జేగిని సోకినను, అది నవ్యకాంతులతో తేజరిల్లెడిది.[4]

ఇతడు చేగొనిన ఇతివృత్తములు తొల్లింటివే! హోలిన్‌షెడ్ ప్లూటార్కు లొసగినవే! కాని యీతడినుపముక్కలు చేబూని నవరత్నశలాకలు గావించినాడు. రామాయణ భారతములనుండి తనకథలను గైకొని సహజప్రతిభాస్పర్శకతన కాళిదాసు అద్భుతమైన సాహిత్యసృష్టి గావించినాడు. వాల్మీకి యొసగిన వజ్రములతో తాను హారమును సృష్టించినట్లే యీతడు విశ్వసించినాడు.

సమయసమయములందు హృదంతరాళమున విజృంభించునుద్వేగము, సృష్టిసామర్థ్యముగల భావనము, ఆధ్యాత్మికభావస్పర్శ, స్మృతిపథమున వెల్లివిరియు ఆనందము కలిసిన సుముహూర్తమున సముజ్జ్వలసాహిత్య ముద్భవించును. సుందరదృశ్యమును వీక్షించినంతన నాదర్శకవి కలమును, కాకితమును గైకొని రచనమునకు గడంగడు. ఆకస్మికముగ నొకయపూర్వదృశ్యము కన్పట్టుట దోచినంతన ముగ్ధుడై యెంతోసేపు దానికి కనులప్పగించి దానిరూపము నల్లన నంతరంగ యవనికపై నీతడు సృష్టించుకొనును. దివ్యదృష్టికి వలసినబీజమును హృదయక్షేత్రమున నాటికొనిరేని యీతడు తరలు నని తలచినను దలంపవచ్చును. Holy Ghost స్పర్శ నందిన Mary పోలెనా కీత డని యూహించిన నూహింపవచ్చును. విభృతప్రశాంతమున శయించి నిమీలితనేత్రుడై, ఆత్మస్మృతిపథమున గవి ప్రకాశించును. ఘనతరసౌందర్యమున దొల్లింటిదృశ్యము నిజమానససరోవరమున ప్రతిఫలించుట నీత డాలోకించును; అవలోకించి అందు చిందులాడు ఆనందవీచికలను తోడన తన వాక్కులలోనికావాహ్వానించును.

కవివాక్కు లానందసౌందర్యవిజ్ఞానములకు నిధానములై సాహిత్యమందు చిరస్థానమంది సంఘజీవితమున ప్రవేశించును. శుక్తిలోని మౌక్తికమట్లు కవి-పదమున నొక్కొకసత్య ముండును. ఈవిభూతిని సాహితి సంఘమున కిచ్చితీరును గావున నశేషుల కైనందినప్రసంగములం దిది యొప్పును.

---

3. " Full many a glorious morning have I seen,
Flatter the mountain tops with sovereign eye,
Kissing with golden face the meadows green,
Gilding pale streams with heavenly alchemy." (Vide—Shakespeare's Sonnets.)

4. "ఈతనిమాటలే యీతనిపట్ల చెల్లునట. కనేకదృష్టాంతములు కలవు. ప్రస్తుతకథనమున నీవాక్కుచే పరిశీలింపుడు :

"An eye more bright than theirs......
Gilding the object whereupon it gazeth."

# దివానె హాఫిజ్*

అనువాదకుడు:

మొహమ్మద్ ఖాసింఖాన్

## ప్రథమ ఖండిక

*

అనుతర్పింపుము, మధుపాత్ర నిమ్మింపుము, నెచ్చెలీ! మొదట సులభమై
కనిపించిన ప్రేమపథము కనిపించెడి నిపుడదేమొ కడుదుర్గమమై. ౧

ప్రాతర్వాయువు లల్లన దోతేరగ చెలియకురుల తొరగు మృగమద
శ్రీతరుణపరిమళములపరీతాపరుధిరముగ్రక్కె హృదయములు సఖా! ౨

మధుసిక్తం బొనరింప జంకెదవు సుమ్మా నీ విటుల ప్రార్థనా
విధులన్ నల్వేదు చావనైన గురుదెవ్వేళే నభీష్టించువో
పథికుం డాత డగమ్యమార్గముల సర్వావస్థలంగాంచి నా
డధిపుం డా మహనీయునాజ్ఞయవధార్యంబేగదా మాకిలన్. ౩

ఈ యానందమయప్రపంచమున ప్రాణేశాపరీరంభసౌ
ఖ్యాయోగమ్మున తేలుచుంటి నని మీ రాలోచనల్ సేతురే
మో, యాలింపుడు ఘంటికారవము రండో! వేగమే జీవితా
ధ్యాయమ్మున్ ముగియించు డంచు మృతి యాహ్వానించు ప్రత్యహ్నమున్. ౪

భవము గ్రక్కెడు చీకటిబంధ మొకటి విలయదుఃఖసంభవభంగ భీతి యొకటి
భీకరాసన్నమృత్యువు బెడద యొకటి పారముంజేరి, యీ భవభారబాధ
లేని ముక్తజీవు లెఱుంగలే రిదంత. ౫

ఏను స్వేచ్ఛాపథవిహార మెన్నుకొంటి అదిప్రపంచమున కసహ్యమయ్యె; అపయ
శస్సు పాల్జేసినది నన్ను జడజగమ్ము: ఈప్రణయరహస్యము, నీప్రహేళిక శ్రుత
విశ్రుతమైపోయె, దాచగావశమెనాకు?

వలయునే నీకు సాన్నిధ్యభాగ్యగరిమ మరచియుండకు మాతని మహితనామ,
మా ప్రియతముని దర్శించునపుడు, వలయు స్వస్తిచెప్పంగ సర్వప్రపంచమునకు.

---

* హాఫిజ్ కవిచంద్రుని ఖండకావ్యసంపుటి. దివానె అనగా ఖండకావ్యసంపుటి. హాఫిజ్ ప్రఖ్యాతపార
శీక సూఫీకవిచంద్రుడు.

# గాంధర్వం

శ్రీ మల్లాది అవధాని

## ప్రస్తావన

నేటి భారతీయ వివాహసంస్థలో కర్మకాండ, మతపూజలు, తంతుబడద, 'నాతిచరామి' అని వరుడు చేయవలసిన ప్రమాణాలు, శతాధికవృద్ధుల సాక్ష్యం— ఈ చాదస్తమంతా ఉన్నమాట వాస్తవం. ఈ వివాహసమస్యకు సమాధానం వధూవరుల పరస్పరాంగీకారం పైని ఆధారపడిన రహస్సంగతమని (గాంధర్వం) కొందరు సంస్కారులు భావిస్తున్నారు. గాంధర్వ వివాహంవల్ల స్త్రీ యిప్పటికంటె అధమస్థితికి వస్తుంది. పురుషుని దౌర్జన్యానికి, సంఘదంష్ట్రలకు మరీ బలి అయిపోతుంది. వధూవరులు ఉత్తమోత్తములయితేనే గాంధర్వ వైవాహికజీవితం శాంతంగా నడుస్తుంది. వరుడు దుష్యంతుడువంటివాడైతే వధువుజీవితం విషాద మవక తప్పదు. నేటి సమాజంలో దుష్యంతులకు కొదవలేదు గాని దీనబాలికలను ఉద్ధరించి ఆదరించి వారి సంసారాలను దిద్దిపెట్టగల అప్సరస్త్రీలు లేరు. ఈ విషయం తెలియపరచడానికే యీ ఏకాంకికను రాశాను.

'శాకుంతలం' గాంధర్వవివాహం గురించిన చర్చకు సంబంధించిన నాటకం. గాంధర్వ వివాహం గురించి మహాకవి కాళిదాసు అభిప్రాయం యిది--

అతః పరీక్ష్య కర్తవ్యం విశేషా త్సంగతం రహః
అజ్ఞాతహృదయేష్వేవం వైరీ భవతి సౌహృదం.

పదిమంది వెదికి వెదికి వరుని మంచిచెడ్డలు తెలుసుకొని చేసిన వివాహాలే నీళ్లుకారిపోగా, ఒక బాలికకు వరుడి గుణపరిశీలన సాధ్యమవుతుందా? 'కోర్ట్‌షిప్'లో వరుడి దోషాలు గూడా గుణాలుగానే కనబడుత వనేది అతిశయోక్తి కాదు.

నీతినిర్వచనం మారిపోయి సమాజపరిస్థితులు తల్లక్రిందు లయిపోయే పక్షంలో తప్ప గాంధర్వవివాహం అనుసరణీయం కాదనేది యీ నాటకసందేశం—

[హస్తినా: ఉద్యానంలో మాలతీలతకు దగ్గరగా ఉన్న పాలరాతి తిన్నెపైన దుష్యంతుడు కూచున్నాడు. నేలపచ్చికలో కూచుని అతని మిత్రుడు మాధవ్యుడు నవ్వుతూ మాటాడుతున్నాడు. వాళ్లపక్కనే గున్నమామిడివున్నది.

ఇది సాయంసమయము. చంద్రరేఖ గూడా ఉదయించింది. పడమట బరువయిన మబ్బు తునక వకటి బయలుదేరింది.

పెంపుడు లేడి వకటి గంతులు వేసుకుంటూ దుష్యంతుడి దగ్గరకు వచ్చింది, మాధవ్యుడి నవ్వు మటుమాయమయిపోయింది. మౌనంగా ఆలోచిస్తున్నాడు.]

దుష్యంతుడు — ఏమిటి మాధవ్యా! అమాంతంగా ఆలోచనలో పడిపోయినట్టున్నావే!

మాధవ్యుడు — ఆలోచన కేముందిలే! ఈ లేడిపిల్లను చూస్తే కొంతకాలంకిందటి సంగతి వకటి జ్ఞాపకమొచ్చింది.

దుష్యంతుడు — [చిరునవ్వుతో] 'గతం నశోచామి. కృతం స్మరామి.'

మాధవ్యుడు — రాజాధిరాజులు గనక తమ రేమన్నా చెల్లుతుంది. నీఅంత సుఖంగా ఏవిషయమూ గూడా మేం మరిచిపోలేము చూడు!

దుష్యంతుడు — ఇంతకూ నీకు జ్ఞాపకంవచ్చి నిన్నింత కలవరపెట్టుతున్న మహావిషయమేమిటో కాస్త నాకుగూడా ఎరిగించకూడదూ? విని అయినా సంతోషిస్తాను!

మాధవ్యుడు — అట్టే ఘనమయినసంగతి కాదనుకో. అందులో తమవంటివారికి; అయినా అడుగుతున్నాను ఈ లేడిపిల్లను మనం ఎక్కడనుంచి యీపూరు తెచ్చాము?

దుష్యంతుడు — [చకితుడైనాడు.]

మాధవ్యుడు — మాటాడవేం?

దుష్యంతుడు — వేటలో పట్టుకున్నాం కాబోలు!

మాధవ్యుడు — [వెటకారంగా] "కాబోలు!" — నువ్వు వేటాడింద లేడినా మనిషినా?

దుష్యంతుడు — ఆఁఆఁ. జ్ఞాపకం వచ్చింది. మాలినీనదీతీరాన వున్న ఆశ్రమంనుంచి దీన్ని తెచ్చాము!

మాధవ్యుడు — దీన్ని నీ కెవరు బహుమతిగా యిచ్చారో వార్ని పూర్తిగా మరిచిన ట్టున్నావే!

దుష్యంతుడు — మరిచిపోలేదు మాధవ్యా! ఆ తాపసకన్యక ప్రతిరాత్రీ నాకు కలలో కనబడుతోంది. ఉదయమే చల్లని మంచులో తడిసిన గులాబిపువ్వంటి ఆపిల్ల మొహం సదా నాస్మృతిలో పరిమళిస్తుంది.

మాధవ్యుడు — మంచిది!

దుష్యంతుడు — [లేడిపిల్లను పక్కకు మళ్లించాడు.]

మాధవ్యుడు — ఎంతో వుత్సాహంతో వచ్చిన లేడిపిల్లను నిర్దయతో తోసిపుచ్చుతున్నా విది నీకు తగునా?

దుష్యంతుడు — వద్దు! మాధవ్యా! ఈ లేడిని చూస్తే నామనస్సంతా కలగిపోతూ వుంది. హాయిగా గడపవలసిన యీ చక్కటి సాయంత్రాన్ని ఏమేమో తలుచుకుని పాడుచేసుకోవడం నా కిష్టంలేదు.

[లతిక ఆ సేదాసి పూలమాలికలుగల బంగారుపళ్లెం పట్టుకువచ్చింది. నమస్కరించి దుష్యంతుడియెదుట నిలిచింది. దుష్యంతుడు మల్లెపువ్వుదండ వకటి తీసి తన మెళ్లో వేసుకున్నాడు. లతిక తిరిగి నమస్కరించి వెళ్లిపోయింది.]

దుష్యంతుడు — [తన మెడలోని మల్లెదండను చూపించుతూ చిరునవ్వుతో] ఇది దేవి ఈ రాత్రి పుష్పశయ్యకై పంపిన ఆహ్వానం. స్వీకరించాను.

మాధవ్యుడు — మల్లెదండ!

దుష్యంతుడు — ఏమిటి మాధవ్యా యిది. ఇవాళ నీకేం వైరాగ్యం లేదుగద! రోజూ ఎంతో వుత్సాహంగా వుండి వినోదసంభాషణలు జరిపేవాడివి, యిదేమి టీ రోజు యిల్లాగ విచారంగా మాటాడు తున్నావు.

మాధవ్యుడు — నాది బ్రాహ్మణహృదయం. దీనికి మానవత్వం వుంది. కఠినత్వం ఏ కోశానా లేదు!

దుష్యంతుడు — అవును నీది మిక్కిలి సున్నిత మయిన హృదయం. నేను కాదన్నానా?

మాధవ్యుడు — ఇప్పుడు చూడవలసింది నీ హృదయం గాని నాది కాదు.

దుష్యంతుడు — ఎందుకు?

మాధవ్యుడు — ఆ మల్లెదండను మెళ్లో వేసుకోవడం నీకు కష్టంగా లేదా?

దుష్యంతుడు — నీధోరణి నా కగమ్యంగా వుంది.

మాధవ్యుడు — మాలినీ నదీతీరాన ఆశ్రమంలో శకుంతల అనే తాపసకన్యను నువ్వు గాంధర్వంగా వివాహమాడిన సంగతి మరిచిపోయినావా?

దుష్యంతుడు — నేను వివాహ మాడినట్టు నీ కెవరు చెప్పారు?

మాధవ్యుడు — దుష్యంతుడు!

దుష్యంతుడు — నేనా?

మాధవ్యుడు — ఆ రాత్రే నదీతీరాన పటకుటీరంలో చల్లటి నీటిగాలికి మైమరచి గాఢనిద్రలో మునిగిపోయిన నన్ను నువ్వు నిద్రనుంచి లేపావు. లేచాను. ఆకాశంలో చుక్కలు ధగధగ మెరుస్తున్నాయ్. మాలిని మర్మరధ్వనులతో ప్రవహిస్తూ ఉంది. నీముఖం ఆనందంతో వికసించి వుంది. అప్పుడు నువ్వేమన్నావు 'మాధవ్య! నాగళాన యీ పూలదండ చూడు.' నేను అడిగాను 'ఏమి టిది?' అని. నువ్వు 'ఇది సుమమాల. నాజీవన సంగిని' అన్నావు. నాకు బోధపడ లేదు. 'శకుంతలను యీ సాయంత్రం గాంధర్వవివాహం చేసుకున్నా'నన్నావు. అనలేదూ?

దుష్యంతుడు — అన్నాను కాబోలు!

మాధవ్యుడు — మరుపా?

దుష్యంతుడు — హాస్యానికి అని వుంటా నేమో!

మాధవ్యుడు — హాస్యం! ఆవిడను పట్టమహిషిని చేస్తానని వాగ్దానంచేశా నని నాతో నువ్వు చెప్పలేదా?

దుష్యంతుడు — అసంభవం! నా కొక పట్టమహిషి వుంది!

మాధవ్యుడు — ఏది అసంభవం ?

దుష్యంతుడు — నామాట విను. అంతా మరిచిపో. అదొక తీయనికల.

ప్రతీహారి— [ వచ్చి నమస్కరించి ] తాపస స్త్రీ లిద్దరు వచ్చివున్నారు.

దుష్యంతుడు — స్త్రీలా ?

ప్రతీహారి — చిత్తం!

దుష్యంతుడు — సరే, ప్రవేశపెట్టు.

[ప్రతీహారి వెళ్లిపోయింది. వృద్ధతాపసి గౌతమి ముందు వస్తున్నది. వెనక అవగుంఠనవతి శకుంతల మూడు నెలల పసిబిడ్డను ఎత్తుకుని వచ్చింది.]

దుష్యంతుడు — [గౌతమితో] దుష్యంతుడు నమస్కరిస్తున్నాడు.

గౌతమి — విజయస్వ, రాజన్ !

దుష్యంతుడు — తమ రాకకు కారణం తెలుసుకుందుకు కుతూహలంగా వుంది.

గౌతమి—[శకుంతల చేతులలోనుంచి బిడ్డని తీసుకొని నవ్వుతూ దుష్యంతుని దగ్గరకు వెళ్లి దుష్యంతుని కిస్తూ ] ఇందుకని వచ్చాను రాజా! నీ పూర్ణచంద్రుణ్ణి నీకు బహుమతీ చెయ్యడానికనే వచ్చాను. మాభారం యింతతో తీరింది !

దుష్యంతుడు — [బిడ్డను ఎత్తుకొని ముఖం వంక తేరిపార జూచాడు.]

మాధవ్యుడు — చూడు! బాబాయ్ ఎల్లాగ నవ్వుతున్నాడో ?

గౌతమి — [ఆనందంతో] మహర్షులవారు భరతుడని బిడ్డనికి నామకరణం చేశారు. జాతకచక్రం వేశారు. రాజా! నువ్వు మహాదృష్టవంతుడవు! భరతుడు యీ యావ త్ప్రపంచాన్నీ ఏకచ్ఛత్రాధిపత్యంగా పాలిస్తాడు. మహర్షులవారు జాతకంద్వారా భవిష్యత్తును చెప్పారు!

దుష్యంతుడు— మీ మాటలు నాకు బోధపడలేదు !

శకుంతల —[అవగుంఠనంలోనుంచి దుష్యంతుని చూసింది.]

దుష్యంతుడు — ఎవరీ అమ్మాయి ?

గౌతమి — [చిరునవ్వుతో శకుంతలను చూపుతూ] ఈ అమ్మాయికుమారుడు!

దుష్యంతుడు — పరస్త్రీవంక నే నెల్లాగ చూసేది ? ఎవరీమె ?

గౌతమి — ఈమె పరస్త్రీవా ? అపహాస్యం కూడదు నాయనా!

దుష్యంతుడు — ఎవరీమె ?

గౌతమి — నువ్వెరగవు ? నీభార్య !

దుష్యంతుడు — [నవ్వి] వింతగా వుంది.

గౌతమి — ఈమె నీభార్య. ఇతను నీ కుమారుడు మూడు నెలలవాడు.

దుష్యంతుడు —[ చెవులు మూసుకున్నాడు.]

గౌతమి — [ శకుంతల అవగుంఠనమును తీసింది.]

శకుంతల — నన్ను మరిచిపోయినారా?

దుష్యంతుడు — నేను మి మ్మెన్నడూ చూడనేలేదే !

గౌతమి — రాజా ! ఏమిటి నీ మాటలు ?

దుష్యంతుడు — దుష్యంతుడు జారుడు కాడు !

గౌతమి — [కోపంతో] ఈమె నీభార్య కాదా ? నువ్వు సంవత్సరంక్రిందట కణ్వాశ్రమానికి వచ్చి రహస్యంగా శకుంతలను గాంధర్వవివాహం కాలేదా ?

దుష్యంతుడు — కణ్వాశ్రమానికి వచ్చాను గాని యీపిల్లను పెళ్లి చేసుకోలేదు.

శకుంతల — [చేతి నున్న ఉంగరం తీసి గౌతమికి యిచ్చింది.]

గౌతమి — [ఉంగరాన్ని దుష్యంతుడి కిచ్చి] ఈ వుంగర మెవరిది ?

దుష్యంతుడు — [తన వ్రేలికి తగిలించుకొని] ఇది నాదే. ఆశ్రమంలో వ్రేలినుంచి జారిపోయింది. ఎంత వెదకించినా కనబడ లేదు. నావుంగరాన్ని తిరిగి నా కిచ్చిన మీకు నాధన్యవాదాలు !

గౌతమి — [నిశ్చేష్టురాలై] మీరు రాజులు, మేము తాపసులం.

శకుంతల — ఆ ఉంగరాన్ని ఒకసాయంత్రం మాలినీతీరాన జాజిపొదలో మీరు నా వ్రేలికి తొడిగారు కాదా ? మరిచేపోయినారా ?

దుష్యంతుడు—[శకుంతలతో] మీమాటలు నాకు మిక్కిలి బాధను కలిగిస్తున్నాయ్.

గౌతమి — నే నేం చేసేది ? ఇప్పుడు నేనేం చేసేది ? శకుంతలను అత్తవారింట మహర్షులు దిగబెట్టి రమ్మన్నారు. నా పని పూర్తి అయింది. నేను వెళ్లుతున్నాను.

దుష్యంతుడు — [శిశువును గౌతమికి యిచ్చివేశాడు.]

గౌతమి — రాజా! నేను వెళ్లుతున్నాను. నీభార్యను నీబిడ్డను నీకు వప్పగించాను. నీభార్యను ఏలుకో; లేక గొంతు పిసికి చంపుకో ! నీవస్తువును నీ కర్పించడమయింది. మావిధి నేరవేరింది ( శకుంతలతో] తల్లీ! నేను పోతున్నాను. ఇదుగో నీవరహాలమూట. [శిశువును శకుంతలకు యిచ్చింది ]

దుష్యంతుడు — ఈమె నాభార్య కాదు. పరస్త్రీముఖమయినా చూడడానికి నా అంతరాత్మ అంగీకరించదు.

గౌతమి — నాచెవులు వినబడడం లేదు. నా కళ్లు కనబడడం లేదు. అంధురాలివలె తిన్నగా నడిచిపోతాను. నాతల గిర్రున తిరిగిపోతూ వుంది.

దుష్యంతుడు — నమస్కారం. ఈమెను గూడా తీసుకుని వెళ్లండి.

గౌతమి — నమస్కార మంటున్నావా ? నిన్ను నే నేమనగలను ? నువ్వు చేస్తున్న ఘోరపాతకానికి నిన్ను, మాశకుంతలభర్త వయిన నిన్ను ఏమని శపించగలను ? బిడ్డా! సుఖపడు ! బిడ్డా! సుఖపడు. [గద్గదస్వరంతో] ఇంతకంటె నేను కోరగలిగింది ఏమిన్నీ లేదు. [వెళ్లిపోయింది.]

శకుంతల — [బిడ్డముఖంవంక క్షణం చూసి భోరుమని ఏడుస్తున్నది.]

దుష్యంతుడు — ఎంత యేడ్చినా ప్రయోజనం లేదు. మీరు గూడా వెళ్లవలసిందే.

శకుంతల — ఎక్కడికి ?

దుష్యంతుడు — పుట్టింటికి.

శకుంతల—నా కెవ రున్నారు ? [గట్టిగా యేడుస్తూ ] నా కెవ రున్నారు? నే నెక్కడికి పొయ్యేది ?

శిశువు — [కాంగ్రుమని యేడుస్తుంది.]

శకుంతల — నాయనా! ఏడుస్తే ని న్నోదార్చే దెవరు ? దిక్కుమాలిన పక్షివి

నిన్ను చూసే దెవరు ? [బిడ్డను దుష్యంతుడి పాదాలపైని పడేసి] ఇంక నాకు సెలవు !

దుష్యంతుడు — బిడ్డనుగూడా తీసుకుపో !

మాధవ్యుడు — ఎక్కడికి తల్లీ! నువ్వు వెళ్లేది ?

శకుంతల — యమునాగర్భంలోకి ! [వెళ్లిపోయింది.]

మాధవ్యుడు — [ దుష్యంతుడితో కంగారుగా] "ఊరుకుంటావేం? ఆమెను పిలువు! పిలిపించు ! మాటాడవు? ఆ మహాయిల్లాలిని నాయింట్లో పెట్టుకొని నేను పూజిస్తాను. అమ్మా! శకుంతలా ! శకుంతలా! [ముందుకు నడుస్తున్నాడు.]

దుష్యంతుడు — [ చేయి పట్టుకొని నిలిపి ] ఏమిటి మాధవ్యా నీమూర్ఖత్వం !

మాధవ్యుడు — ఇంకా నేను జీవించే వున్నాను. [దీనంగా] భగవంతుడా ! మృగాల రాజ్యంలో మనిషిని న న్నెందుకు పారేశావు ?

దుష్యంతుడు — [శిశువును ఎత్తుకొని] నవ్వుతున్నాడు...బోసినోరు తెరిచాడు ... [ఆలోచించి] ఈబిడ్డ నాకుమారు డని ప్రజలను నమ్మించడ మెల్లాగ? అపకీర్తి... వంశానికి...నాకు...కళంకం... [ బిడ్డను నేలను విడిచి] మాధవ్యా! పద !

మాధవ్యుడు — ఎక్కడికి నరకానికా ?

దుష్యంతుడు — కాదు నగరికి !

మాధవ్యుడు — ఈశిశువో ?

దుష్యంతుడు — తోటమాలి పెంచుకుంటాడులే, మన కెందుకు ?

మాధవ్యుడు — [చటాల్న శిశువును ఎత్తుకొని ఉగ్రుడై] పాతకీ! ద్రోహీ! నువ్వా రాజువు. నువ్వా న్యాయాధిపతివి. నువ్వా లోకపరిపాలకుడివి. నీదౌర్జన్యం, నీ అన్యాయం, నీక్రౌర్యం లోకానికి వెల్లడిస్తాను. వెయ్యికంఠాలతో నువ్వు హత్యచేసిన శకుంతల విషాదగాథను లోకంముందు పాడతాను ఈశిశువు నీసంతాన మని ప్రజలయెదుట ఉద్ఘోషిస్తాను. ఈసింహాసనం నీది కాదు. నీబోటి నీచుడు సింహాసనంపైని కూచుండుకు తగడు ! ప్రజలను రెచ్చగొట్టి యీశిశువునే రాజుగా చేస్తాను.

దుష్యంతుడు — ప్రతీహారీ !

ప్రతీహారి — [వచ్చి] ప్రభూ !

దుష్యంతుడు — భటులను పిలుచుకురా.

ప్రతీహారి — [వెళ్లిపోయింది.]

మాధవ్యుడు — పాపీ ! నువ్వు ప్రజాపరిపాలకుడివా ? న్యాయకర్తవా ? [భటులు వచ్చారు.]

దుష్యంతుడు — మాధవ్యుడికి వెర్రెత్తింది. ఇతణ్ణి ఉన్మత్తవైద్యశాలలో, కట్టి పడయ్యండి.

మాధవ్యుడు — [ అరుస్తున్నాడు.] ఓప్రజలారా! నాకు వెర్రి లేదు. ఈనరభక్షకుడు, ఈపిశాచి ఒక అమాయకురాలయిన—

దుష్యంతుడు — అతడినోరు ముయ్యండి.

భటులు—[మాధవ్యుడినోరు మూసి చేతులు కలిపి కట్టి తీసుకుపోతున్నారు. మాధవ్యుడు మాటలాడడానికై గింజుకుంటున్నాడు.]

దుష్యంతుడు — ఈశిశువును అనాథశిశుశరణ్యాలయంలో చేర్పించండి!

# "తెలుగు - ప్రాకృతముల కలయిక"

శ్రీ కొత్త సత్యనారాయణచౌదరి

ఇటీవల భాషాశాస్త్రజ్ఞులు కొందఱు భాషలలోని శబ్దసాదృశ్యము, వాక్యప్రయోగధోరణి, శబ్దశాస్త్రప్రసక్తి లోనగు కొన్ని ప్రమాణములను గైకొని భాషలకు బరస్పర జన్యజనకభావమును సోదరభావమును వెలువఱిచిరి. ఆ నిర్ణయము నే హస్తావలంబముగా గైకొని ద్రావిడభాషలు సంస్కృతాదిభాషలకన్న వే ఱనియు; అవి స్వతంత్రధోరణికలవనియు బిషప్కాల్డువెల్ ప్రభృతులు సిద్ధాంతీకరించిరి.

ద్రావిడ భాషాంతర్గతమగు తెలుగును సవిమర్శకముగ బరిశీలించినచో పూర్వోక్త సిద్ధాంతమునకు అచ్చటచ్చట అభిచారము కన్పట్టుచున్నది.

తెలుగుశబ్దములు చాలవఱకు ప్రాకృతముల సాదృశ్యమును గలిగియున్నవి. అటనట ఉభయభాషలలో శబ్దశాస్త్రధోరణి సమముగ జూపట్టుచున్నది. అట్టి సారూప్యముగల శబ్దజాలమును గొంతవఱకు జూపుటయు, అద్దాన దెనుగునకు ప్రాకృతాదిభాషలకు గల సంబంధ మూహింప జేయుటయు నీవ్రాతకు ముఖ్యోద్దేశములు.

౧. సంస్కృతములోని 'త్వ' ప్రత్యయమునకు, ప్రాకృతమున 'త్తణ' ప్రత్యయము విధింపబడ్డది. దానిఛాయయే తెలుగున జూపట్టును:

| సం | ప్రా | తె |
|---|---|---|
| ప్రీణత్వమ్ | పీణత్తణం | సొగసుదనము |

౨. సంస్కృతమందలి 'దోలా - దండ - దశన' శబ్దముల ఆద్యక్షరములకు, ప్రాకృతమున 'డకారము' విధింపబడినది:

'డోలా - డండో - డసణో'

తెలుగున, 'దక్కు'లోనగువాని దాకు డకారంబు విభాషనగు' (బాల. ప్రకీర్ణ. ౧౪ సూ.) అనుసూత్రము పుట్టినది. 'దక్కు - డక్కు; దగ్గఱ - డగ్గఱ; దాఁగు - డాఁగు' ఇత్యాది.

3. ప్రాకృతమున, అవధారణార్థమున 'విఅ, వేఅ' అనునవి నిపతింపబడ్డవి.

'ఏవం విఅ, ఏవం వేఅ'-

తెలుగున 'అంత' శబ్దవిషయమున ఈ ఛాయయే పొడగట్టుచున్నది:

'అంతియ - అంతే'

౪. ప్రాకృతమున, 'క్త్వ' ప్రత్యయమునకు 'ఇ అః' అను ఆదేశము వచ్చును.

| సం | ప్రా |
|---|---|
| భణిత్వా | భణియ |
| భూత్వా | భవియ |

తెలుగున, ఈయర్థమందే 'సమానాశ్రయంబులం బూర్వకాలంబునం దివర్ణకం బగు'

(బాల. క్రియా. ౩౮) అని సూత్రించి 'ఇ' ప్రత్యయమును విధించిరి.

వందు + ఇ - వండి - ఇత్యాదికము.

౫. ప్రాకృతమున, శబ్దముల అంత్యహల్లులు లోపించును. కాగా, అవి అజంతములుగ మాఱిపోవును.

| సం. | ప్రా. |
|---|---|
| యశః | జసో |
| కర్మ | కమ్మో |
| యావత్ | జావ |
| తావత్ | తావ |

ఇత్యాది.

తెనుగునను, 'వాక్' అనునది 'వాక్కు' అని మాఱుట నైజముగదా!

౬. ప్రాకృతమున 'దశాదిషు హః' అని శకారమునకు హకారము విధింపబడ్డది.

'దశ — దహ'

తెలుగున 'శేషాచలము'నకు 'శేహాచలము'ని అచ్చటచ్చట ఉచ్చారణలో గలదు.

౭. సంస్కృత ప్రాకృతాంధ్రములలో పరస్పర సాదృశ్యము కలిగియుండు శబ్దములను స్థాలీపులాకముగ గొన్నింటిని మాత్రము చూతము:

| సం | ప్రా | తె |
|---|---|---|
| గద్గదః | గగ్గరో | గగ్గరపాటు |
| దాడిమః | దాలిమం | దానిమ్మ |

(లడయోరభేదము : దాడి - దాలి.)

వాడుకలో లకార నకారములకు అభేదము కలదు: 'లాంతరు - నాంతరు; నోటు-లోటు'; లాంగలము - నాగలి (ఇది శుద్ధమే.) ఇత్యాదికము.

| | | |
|---|---|---|
| యష్టి | లట్ఠీ | లాట్ఠీ |
| కుబ్జః | ఖుజ్జో | మొఱ్ఱి (గుజ్జు) |
| శ్మశ్రుః | మస్సు | మీసము |
| శ్మశానము | మసాణం | మసనము |
| మధ్యాహ్నం | మజ్ఝణ్ణో | మజ్ఝానము (వాడుక) |
| స్తంభః | తంబః | తంబము (వాడుక) |
| కర్తరీ | కత్తరీ | కత్తెర |
| గర్తః | గడ్డో | గడ్డలు (గుంట లని కొన్ని ప్రాంతముల వాడుక) |
| సుఖః | సుక్ఖం | సుకము |
| ముఖః | ముహం | మొహం (వాడుక) |
| భక్తమ్ | భత్తం | బత్తెము |
| ఉత్పలమ్ | ఉప్పలం | ఉప్పల (ఇది కొందరి ఇంటిపేరుగా ఉన్నది) |
| పుష్పమ్ | పుప్ఫం | పుష్పము |
| విజ్ఞానమ్ | విణ్ణాణం | విన్నాణము |
| రుక్మిణీ | రుప్పిణీ | రుప్పిణమ్మ (వాడుక) |
| అజ్ఞప్తిః | అణత్తి | ఆనతి |
| సంధ్యా | సంఝ | సంజ |
| రాత్రిః | రత్తి-రాఈ | రేయి |
| కృష్ణః | కసణో (వర్ణార్థమున) | కసెటు |
| శ్లాఘా | సలాహా | సలహా (అర్థములో కొంతమార్పు కలదు) |
| కుమ్భకారః | కుమ్భారో | కుమ్మరి |

| | | |
|---|---|---|
| భాజనమ్ | భాణం | బాన |
| పారావతః | పారాఓ | పావురాయి |
| దిశా | దిసా | దెస |
| వక్రః | వంకం | వంకె (వంకర) |
| శంఖక | సఙ్కా | సంకువు |
| వాక్ | వాఆ | (నోరు) వాయి |
| మలినమ్ | మఇలం | మయిల |
| దంష్ట్రా | దాఢా | దాడ |
| వచనమ్ | వఅణం | వైనము (అర్థమున కొంత మార్పు.) |
| స్థూలమ్ | థోరం | తోరము |
| తృతీయ | తఇఅం | తడియ |
| తుండః | తోణ్డం | తొండము |
| దృష్టిః | దిట్ఠీ | దిట్టి (తగిలినదిని వాడుక) |
| పత్తనమ్ | పట్టణం | పట్టనము |

ఇట్టివ యింకను పెక్కింటిని జూపవచ్చును. తఱచి సమాలోచనము సేయువారికెన్నేని దొఱుకగలవు. ఇవి యన్నియు ప్రాకృతభవము లనియు, ప్రాకృతసమము లనియు ననవచ్చు నందురేమో! కానిండు. సంస్కృత ప్రాకృతములకు మన మనుకొను తెలుగుబాస ఎంతవఱకు సంవదించి యున్నదో యూహింపవచ్చును.

ఇట్టి శబ్దములు లోనగువాని సంవాదము ఏయే భాషలలో జూపట్టునో ఆయా భాషల నన్నింటిని ఒకేకుటుంబములో కొంతవఱకు జేర్పవచ్చునేమో! అవైఖరిలో, మన తెలుగు కవులు తెలుగువైయాకరణులు - చిరకాలము నుండియు 'సంస్కృతంబు తల్లి సర్వభాషలకును' అనుపలుకు భాషితమును సమన్వయిపఱచుటకును వీలుండునుగదా!

---



# గి రి మ ల్లి క

శ్రీ ద్వివేదుల సూర్యనారాయణ

బహుదురితాకదూషిత మపార విచారతరాధిపీడితం
బహులు నిశల్ మనంబుల కనూన విషాదము గూర్చుచుండు దు
స్సహమగునట్టి పట్టణపు జన్మము జీవనమున్ భరించుమా
కహహా ! యెటు దోచు, నిన్ను గని సంతసె యీ గిరిచెంత మల్లికా!

విజనప్రదేశంబు పీతసౌందర్యంబు కంటకావృతము సంకటయుతంబు
కఠినపాషాణ దుర్ఘటభూమి నాగరజనసంఘరహితంబు శైలభూమి।
కడుక్రూరజంతుసంఘాతభీకరమును నను నిమేషాతిభయప్రదంబు
ప్రేమరహిత వనభూమి కఠోరప్రదేశం బటంచును, ధీవిశేష
మొప్ప మే మెల్లఁ దలపోయుచుండునట్టి।
శైలకందరభూముల, శాంతరసము
వెల్లివిరిసెడి చోటుల వెలసియున్న।
నిన్నుఁ గని సంత నామది నిండుసుమ్ము.

ఈవిజనావనీస్థలిని, నీ శుక శారికపోత ముఖ్య ప
క్ష్యావళి మంజు నిస్వన సుఖాతిశయాతిమనోహరస్థలిన్
పావనమైన నీదు కరపల్లవ పూర్ణ సుమాళిచేత నా
పావన మూర్తి కర్ఘ్యము సమర్పణ సేతువుగాదె మల్లికా!

పేదలగోడు లేక, బహుభిన్న గుణాస్పద సంఘవక్ర మ
ర్యాదల బాధ లేక, మరియాకలిదప్పు లటన్న చింత యిం
తేఁదరి జేరనీయక వనీస్థలి నుండిన నీదు జన్మ మ
త్యాదరణీయ మైనది గదా! జనసంఘముకంటె; మల్లికా!

అసమాన సౌందర్య లసమానమైన యీ శైలమే జన్మదేశంబుగాఁగ
నవమధురసోన్మత్తచిత్తంబులై చెలగు తుమ్మెదలె నెచ్చెలులుగాఁగ
బహుళసౌరభ పుష్ప పరిమళవహుడైన పవనుండె మీ రాయబారిగాఁగ
పరిసరగిరిసరోవర దేశములె మీ విహారముల్ సలుపు నుద్యానములుగ
ననునిమేషంబు విశ్రాంతి యైన లేక - నీ మనోహారు భవహారు నీలవర్ణు
స్వాంతమునఁ దలపోయుచు హర్ష జలధి దేలియాడెద వెంత యదృష్ట మమ్మ.

# అయోమార్గం అభినందనం

శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు

రైలుయొక్క మార్గం అయోమార్గం అయినా, దానియొక్క వ్యాపారంలో కొంత స్తబ్ధత్వం, కొంత హడావిడిగుణం, కొంత క్రపిడితనం ఉన్నా, అది అస్పష్టపదార్థోపితం అయిన గానాభినయంలాగ, శుద్ధఅయోమయం కాదు. దానిసంగతి ఏకొంతో అందరికీ తెలుసు. ఆవిరి, విద్యుత్తు, అయస్కాంతం వగైరాల శక్తులవల్ల దానికి గమనం సిద్ధిస్తుందనీ; దాన్లో భూమిని పట్టుకుపాకేరకం - భూగర్భం చొచ్చుకుపోయేటట్టు నిర్మించబడ్డ గొట్టాలలో చరించేరకం - భూమికి కొంత ఎత్తున స్తంభాలమీద వెళ్లేరకం - ఒకేపట్టామీద పోగలరకం - పట్టాలున్నా వాటిని తాకకుండా నడవగలరకం - వగైరా ఉన్నాయనీ; దానిశాఖలు కొన్ని ప్రభుత్వాల కిందా, కొన్ని రాష్ట్రాల అధీనంలోనూ - కొన్ని విడిసంస్థలైన కంపెనీల చేతుల్లోనూ - ఉన్నాయనీ; ఎరుగున్న విషయాలే. గమనానికి పట్టాలుండడం ప్రతిబంధకం అని కొందరు భావిస్తారు. స్థిరమార్గ నిర్ణీతం అయి ఉండడం అనేది వేగాంతరసిద్ధికి దోహదకరం అని కొందరు నమ్ముతారు. మొట్టమొదట్లో రైలుపట్టాలు భూమండలంమీద పడి ఇప్పటికి నూరేళ్లూ నిండి పుష్కరం దాటింది. ఆ భాగ్యం పొందిన పుణ్యస్థలం సీమదేశమే. ఆస్థలంలో రైల్వే శతాబ్దోత్సవం జయప్రదంగా జరపాలని (వార్తాపత్రికారచనలో జయప్రదంకాని సంభవమే ఉండదు!) ప్రయత్నాలు చేశారని చెప్పుగుంటారు. ఇండియాలో రైల్వేసహస్రమాసోత్సవం పెట్టించాలని చాలామంది తంటాలు పడ్డట్టు తెలుస్తుంది. దరీ అంచూ తెలియని మహాకాలంలో సంస్థలయొక్క పర్వోత్సవాలు జరపడంలో తిథివారనక్షత్రాలతో సహా అసలుదినం గమనించక్కర్లేదనే విశాలభావంతో కొందరు, వీలునిబట్టి వాటిని పెట్టించడాలు ఎరుగుదుం. మంచి యితర సందర్భం సంఘటించినపుడు దాన్ని దాటపెట్టుగోడంలో ఉండే బాధనిబట్టీ, గొప్పవ్యక్తి తనంతట తనే వచ్చినప్పుడు ఖర్చులేకుండా అతణ్ణి అధ్యక్షుణ్ణి చేసుగోడంలో ఉండే సదుపాయాన్నిబట్టీ, ఒకొక్కవ్యక్తి తను కార్యకర్తగా ఉండగానే వీలైనంత గొప్పతనంగల సమావేశం జరగాలిగాని కడంవాళ్ల హయాంలో కాకూడదనే పట్టుదలలనిబట్టీ, సంస్థల ఉత్సవదినాలు ముందుకీ వెనక్కీ జరుగుతూంటాయి. రైల్వే విషయంలో మరీ వీల్లున్నాయి. పైచెప్పిన రెండు ఉత్సవాలలోనూ ఏ ఒకటీకూడా లోగడ జరిగి ఉండకపోయినప్పటికీ-వాటిల్లో ఏదో ఓటి, ఎదో దేశంలో ఇకముందు ఎప్పుడో అప్పుడు ఎవరో కొందరు జరిగించినా బాధలేదంటున్నారు. ఎందుకంటే, ముందు ఒకగొప్ప ఉత్సవం కానిచ్చేసి, తదుపరి వెనక్కి తిరిగి లెఖ్ఖచూసినా, ఆదినం రైల్వే సంస్థకి చెందిన ఒకగొప్పవిషయం ఒకగొప్ప దేశంలో జరిగిన పర్వదినం అయిఉండే తీరుతుంది. ఇది

గాక, అదోమార్గం యావద్భూతలానికీ చెందినదే గనక, భూప్రజలంతా కలసి దాని తాలూకు పర్వోత్సవం చెయ్యడం సమంజసం గాని, ప్రత్యేకస్వయంపాకాలవల్ల డబ్బు మన్నవడం గౌరవం సున్నవడంమట్టుకే అని ఆర్యులు చెబుతున్నారు. ఆ ఉత్సవంయొక్క సంపూర్ణబాధ్యత వహించడానికి ఒకపెద్ద సంఘం ఏర్పర్చాలని ఇదవుతున్నారు. అది 'అఖిల భూగోళఖండఖండాంతర స్థాపిత వివిధాయోమార్గసంబంధిజన, వ్యక్తి, సంఘు, సంస్థోపశాఖాచరిత మహాకృత్యాభినందనీ సమాజం' అనేలాంటిపేరుతో సక్రమంగా నిర్మించాలని పలువురు ఊహిస్తున్నారు. ఏతత్ప్రయత్నంలో, ప్రత్యేకప్రాంతాలలో తాత్కాలిక సంఘాలు లేచి, యథాశక్తి కార్యదర్శుల్ని ఎన్నుకుని, వాటికి బాధ్యతాశూన్యమైన సకలహక్కులూ ఇచ్చి, కృషిచేయించడం శ్లాఘనీయం అని కూడా చాలామంది తాత్పర్యం.

ఆ మహాభూతల రైల్వే పర్వోత్సవం నాటి కార్యక్రమంయొక్క తభిశీల్లు ఆహ్వాన సంఘంవారు తేల్చాలి. అప్పుడు జరగబోయే బహిరంగసభకి అధ్యక్షత వహించడానికి భూజను డెవడూ పనికిరా డనిన్నీ, అఖిల అంగారకగ్రహ రైల్వేసంఘాధ్యక్షుణ్ణి పిలుస్తారనిన్నీ, అతని ప్రయాణపుఖర్చు నిస్తంత్రిలో పంపుతా రనిన్నీ, అతగానికి ఏవాహనం కుదరక శరీరతః రావడానికి వీలు లంభించని పక్షంలో అతడు రేడియోలో అధ్యక్షత వహిస్తాడనిన్నీ, ఒకప్రాంతపు కార్యకర్త అంటున్నాడు. దైవాద్వా అంగారకుడులో కూడా (అసలు అది యుద్ధగ్రహంగనక!) రోమురాడీశ్వరుడులాంటివాడుగాని, బెర్లిన్ జులుందారువంటివాడుగాని నియంత ఒకడు వున్నట్టయినా, అతణ్ణే అధ్యక్షపదవికి ఆహ్వానిస్తే తీరిపోతుందని సలహా యిస్తున్నారు. కా ని అ లా ం టి వా ణ్ణే యీ భూమిమీద అడుగెట్టనిస్తే, అతడు తన్నో, తిట్టో, బెదిరించో లాగేసి యీ భూమి యావత్తూ వెనక తనదే అనడంగాని లేక తనవా ళ్లందరికీ యిక్కడ ఉద్యోగాలకి సిఫార్సుచేయడంగాని మొదలు పెడతాడేమో, అని కొందరు బాధపడుతున్నారు. అంగారకగ్రహంలోంచి కాకుండా మరో గ్రహం దేల్లోంచేనా అధ్యక్షుని పిలిస్తే ౧౮౯౧ లో "గజ్మ్" అనే ఆమెచేత వాగ్దత్తం చెయ్యబడి నేటివరకూ ఎవరిచేతా పొందబడకుండా నిల్చిపోయి ఉన్న వెయ్యి పౌనుల బహుమతికూడా, దఖలుపడుతుంది కదా అని కొందరు అంటున్నారు. ఏమయినా మహాసభాధ్యక్షుడు — ఆహ్వాన సంఘాధ్యక్షుడు — అన్నట్టు, జరిగేస్థలం— వగైరాలు ముందుముందు స్థిరపడవలసి ఉన్నా, ప్రస్తుతం తెలుగుదేశపు వివిధకార్యకర్తలకి కాబోయే సభనిమిత్తం జనంచేత యథావిధిగా పంపబడ్డ చిత్తు అభినందన తీర్మానాలు కొన్ని తెలిసిరావడంవల్ల, అవి ఏరీతిగా ఉండగలవో చూడడానికి వీలు దొరికింది. ఇవి ఈక్రింది విధంగా ఉన్నాయి:

నరాలవల శరీరంలో వ్యాపించిఉన్నట్టు, ఇప్పటికే ప్రతీదేశంలోనూ రైలుపట్టాలు వ్యాపించి ఉన్నా, ఇప్పటికీ "మెయిలు వెళ్లిపోయింది గావును, నేను చూడా లనుకున్న ప్లాటుఫారంగార్ని చూణ్ణేలేదు!", "నల్లటి మెడ్లకి గంతలుకట్టి రైళ్లు లాగిస్తారు", "ఒకాక్క బూడ్సుబండికి రొండేసి తలకాయి

లుంటాయి"! "మావూరికి పిక్కంటిమ్మంటే ఎక్కడికో చెప్పమంటా డేటి? నావూ సీడి కెందు కన్నాను!", "ఏవూరికి టిక్కట్టిమన్నా, ఒకేదగ్గిర దాన్ని నొక్కి టిక్కుమనిపిస్తాడే!" అని అంటూండే జనంగురించి ఈ సభవారు చాలా దుఃఖిస్తూ వీళ్లు ఒకప్రత్యేకతీర్మాన గౌరవం పొందడానికి అనర్హులని నిర్ధరించి, జాలిపడుతున్నారు.—

ఏదో దేశానికి చెంది, కోటీశ్వరులై, ప్రభుత్వబలంయొక్క ఆసరా చూసుకుని స్వాధీన దేశాల్లో ఉండే గృహారామక్షేత్రాదులు బలాత్కారంగా కొని, వాటిని శూన్యస్థలాలుగా చేసి, ఇనపపట్టాల సంకెళ్లతో ఆ స్థలాన్ని కట్టేసి తద్వారా రసయోగం తెలియకుండానే తమ ఇనుముని బంగారంగా మార్చుకో గలిగిన రైల్వేసంఘాల్ని ఈ సభవారు కొనియాడుతున్నారు.—

ఒక్కొక్క వ్యక్తిచేతులో రూపాయిపడిందంటే బొగ్గులా మారిపోడం మామూలు గనక, జనబాహుళ్యం విడివ్యక్తులలో నమ్మకం ఉంచరని గ్రహించి, సంఘాన్ని నమ్మించడానికి సంఘమే ఉండాలని తెలుసుకుని సంఘాలుగా ఏర్పడి, బొగ్గుని రూపాయిలుగా మార్చుకోగలిగిన రైల్వేబుద్ధివంతుల్ని ఈ సభవారు మెచ్చుకుంటున్నారు.—

పెట్టుబడులకీ ధరలకీ సంబంధం ఏముటో జనానికి తెలియరాకుండా అట్టేపెట్టి, రుచి కలిగేవరకూ ధరలు తక్కువగా ఉంచి, అలవాటు స్థిరపడడంతోటే ధరలు క్రమక్రమంగా హెచ్చిస్తూ, పోటీకోసం సబబులేని తగ్గింపులు చేస్తూ, లాభాలు పుచ్చుకునే వాళ్లు ఎక్కడుంటారో కనబడకుండా వ్యాపారం చేయిస్తూ ఉన్న రైల్వేప్రజ్ఞావంతుల్ని ఈసభవారు పొగుడుతున్నారు.—

అయోమార్గాలు మామూలూగా జనోపయోగం నిమిత్తం అని పైకి కనపడ్డా యుద్ధంలాంటి అవసరం వచ్చినప్పుడు స్వలాభం కోసమే అని ఎరిగుండి వ్యవహరించే రైల్వే పెద్దలికి ఈసభవారు నమస్కరిస్తున్నారు.

వర్ణాశ్రమధర్మాలవంటి తారతమ్యాలు మనుష్యుల్లో కూడునా, రక్తాల్లో తేడాలుంటాయి గనకనా, అంతా ఒకటే అనేటంత సర్వసమత్వం తెలిసిన జాతికి చెందినప్పటికీ, అయోమార్గంలో మొదటిక్లాసు, రెండోక్లాసు, మూడోక్లాసు అంటూ తరతమభావం పెట్టిన రైల్వేసంఘాలవారి వివేచనాశక్తికి ఈ సభవారు ముక్కుమీద వేలేసుకుంటున్నారు.—

పెద్దబస్తీలలో, ముందు ఊరవతల ఒక స్టేషనూ తరవాత నాలిక కరుచుకుని ఊళ్లో ఒక స్టేషనూ వేసి, ఊళ్లోదానివల్ల వచ్చే డబ్బు పట్టిగల్లి ఊరవతలదాన్ని పెంచి, ఊళ్లోదాన్ని వీలైనంత ఇరుకుగానూ ఏహ్యంగానూ ఉంచినందుకు, ఈసభవారు రైల్వే అధికారుల్ని ఏమనాలో తెలియకుండా ఉన్నారు.—

నాలుగేసి వందలమంది ఒక్కొక్క రైలుకి ఎక్కే స్టేషన్లలో జనం విశ్రాంతి తీసుకోడానికి నాలుగైదు బెంచీలు సప్లయిచేసి యథాశక్తి ఏర్పాట్లు చేసిన రైల్వే అధికారుల్ని ఈ సభవారు శ్లాఘిస్తున్నారు.—

ప్రతీ ప్రయాణీకులబండీ బయలుదేరడానికి రెండుగంటల పూర్వమే టిక్కట్లకిటికీ తెరిచి ఉంచుతున్నాం అనేరాతతో కిటికీ

కంఠె పెద్దబల్ల కట్టి అక్కడ పేర్కొనబడ్డ గంట ఒకటికి నిమిషాలు రెండుమాత్రమే అనే షరా రాయడం మరిచిపోయిన రైల్వే అధికారుల్ని ఈసభవారు వహావ్వా అంటున్నారు. —

రైల్వే ఉద్యోగాలకి జీతాలు తక్కున అయినప్పటికీ కొన్ని వందలు చేతిసొమ్ము అయినా సరే రవంత ఉద్యోగం రైల్వేలో దొరికితే చాలు అనేటంత ఆదాయం ప్రతీ రైల్వే ఉద్యోగస్తుడికీ ఉంటుంది అనేభావం-భ్రమ !— జనంలో కలిగించిన రైల్వే యజమాన్లకి ఈసభవారు హారతి యిస్తున్నారు.—

క్రింది రైల్వే అల్పోద్యోగి లగాయతు పైమెట్టు ఉద్యోగివరకూ అధికార్లిచ్చేజీతం తారీఖుప్రకారం పుచ్చుగుంటూ, అందుకు అదనంగా, జనం – తమపన్లు అర్జెంటుగా లాభకరంగా నెరవేరినందుకు — సంతోషించి యిచ్చే ధన కనక వస్తు వాహనాలు తప్ప, తక్కిన మరి ఏయితరమైన లంచాలూ కానుకలూ స్వీకరించకుండా కట్టుదిట్టాలు చేసిన రైల్వేకారకుల్ని, ఈ సభవారు ఘనతపరుస్తున్నారు —

రైల్వే పాలకులు తమ పరిపాలనలో, ధనాధికార పైత్యవిశేషాలుగాని, వాగ్ధాటిగాని, కూరగాయలు – వస్తువులు – ముడిసరుకు వగైరాల్లో వర్తకంగాని గలవాళ్లని, — ఎందుకేనా ఎప్పటికేనా మంచిదని చెప్పి — కాస్త చల్లని చూపు చూసి, తక్కినవాళ్ళమీద రూల్సుప్రకారం కారాలూ మిరియాలూ నూరడంలో కనపరిచే నిష్పక్షపాతబుద్ధికి ఈసభవారు ఆశ్చర్యపడకుండా కూచున్నారు.—

తమ రైలుటైముకి ఒకజాము ముందు వెళ్లి, దాన్నిగురించి తపిస్తూ, ఇంకా అది ఎంతసేపటికి వస్తుం దని — తమకు ఫలానా అప్పుడూ అని తెలిసుండీకూడా – కనుక్కుంటూ, కనుక్కోడంలో చివాట్లు తింటూ ప్రయాణాలు చేసేవాళ్లకీ, రిస్టువాచీ చూసుగుంటూ అంచీలమీద స్టేషన్లో పడి కటాకటీగా రైలుచాటపెట్టుగునేవాళ్లకీ, ఈ సభవారు దణ్ణాలు పెట్టి, చెరిసగం చొప్పున పైరెండు తరహాలవారూ ఆ దణ్ణాలు పంచుకోవలసిందిగా కోరుతున్నారు.—

కుష్ఠులు, బధిరులు, పంగులు, అంధులు, భిక్షులు,- లాంటివాళ్ల అవస్థ దుర్భరంగనక, వాళ్లు రైల్లో ముష్టెత్తుగోడానికి వాళ్లని ఊరికే రైలెక్కనిచ్చి, తద్వారా యథాశక్తి దానం చేసుగుంటూ పుణ్యం ఆర్జించుకోడానికి ప్రయాణీకులకి తరుణాంఇచ్చి, మరొకళ్ల ఖర్చుమీద రైల్వేమేస్టర్లు కనపరుస్తూండే దాతృత్వానికి ఈసభవారు వారిని చాలా కీర్తిస్తున్నారు..—

టిక్కెట్లు కొనుక్కునేటప్పుడు: ఓపక్కనించి వెడితే ఆలస్యం అవుతుందేమో, తమరికి టిక్కెట్టు అందక తమరు మిగిలిపోవలిసివస్తుందేమో, పెందరాళే కొనుక్కున్నవాడు ముందెళ్లిపోతాడేమో అనేబాధ చొప్పున అదివరకే అక్కడ నిలబడిఉన్నవాళ్లని తొక్కుగుని, వాళ్లమీద తమచుట్ట ఉమ్మి అభిషేకించి, తమ 'టముకు'పెట్టి మొసతో వాళ్లని గుచ్చి, టిక్కెట్లకిటికీమీదకి ఎగబడే ప్రయాణీకులు బతుకు తెరువు తెలిసినవాళ్లు గనక, వారి అవ్యక్త ఔన్నత్యానికి ఈసభవారు, వారిని నెత్తిమీద పెట్టుగోవాలని చూస్తున్నారు.—

తమయిష్టం వచ్చినచోట తమరు నిలబడి తమ ఎదురుగుండా ఏపెట్టె కనపడితే అందులోకే ఎక్కి, అందులో ఎంతమంది ఉన్నాసరే వాళ్లని 'తప్పదు గనక సర్దుకోవాలి' అంటూ, 'ఎంతసేపు - క్షణం' అంటూ వాళ్లకి వేదాంతం బోధించుతూ బాధించుతూ ఉండే జ్ఞానులకి ఈ సభవారు వందనాలు అర్పిస్తున్నారు.—

“టిక్కెట్టు” అంటే రైల్వేకంపెనీవారు అది కొనుక్కున్నవాడి శరీరాన్ని - దైవకృప ఉంటే - దానిమీద రాసిఉన్న ఊరికి తీసికెళ్లి వదిలిపెడతాంఅని టిక్కెట్టు కొనుక్కున్నవాడితో పడ్డ పూచీమాటలుగల అట్టముక్క అనేసంగతి గమనించక, టిక్కెట్టు అనేది తాము తమపక్క కూచున్నవాడిమీద చలాయించడానికి వీలైన అధికారానికి చిహ్నమని భ్రమించి వింతరకపు జంతువులుగా తయారయే ఘనుల్ని చూసి ఈసభవారు హడిలిపోతున్నారు.—

ఖాళీగా ఉన్నపెట్టె వెతికి తనూ తన సామానూ అందులో పడడంతోటే ఫెడీమని తలుపు వేసి, వెనకాల ఎక్కబోయేవాడి వేళ్లు పచ్చడైనాసరే చూడక, 'ఖాళీ లేదు. పక్క పెట్టెలోకి వెళ్లండి' అనే మాదిరి అమూల్యమైన సలహాలు ఇచ్చే మహానుభావుల్ని తగినంత మెచ్చలేక ఈ సభవారు తారెత్తిపోతున్నారు. —

డబ్బోసి టిక్కెట్టు కొనుక్కున్న జనం, ఒక్కొక్క పెట్టెలో, నియమితసంఖ్య దాటించి,—ఎవర్ని ఏమనడగాలో నోరులేక అడగగలిగినా పనితొందరవల్ల తీరికలేక — పడుగూ పేకాలాగ నిలబడి ఉన్నా, అందులోకే, లోగడ ఆర్జించిన సొమ్ము వడ్డీకేసుగుని కుష్ఠో గుడ్డితనమో కలిగిఉండడంవల్ల రాజకీయమో వేదాంతమో పాడుకుంటూ, పెట్టెల్లోకి జొరబడి, నలుగురి ఎదుటా దమ్మిడీయో ఠోలియో దానంచేసి కొంతవరకు దానకర్త అని పేరు పొందా లనుకునే ఉదారుల్ని హృదయం కరిగించే మాటలు చెబుతూ, ఈ లోపుగా తమరి శరీరానికిగల వ్యాధీ, కుళ్లూ, ధూళీ. మురికీ ఈ మూలనుంచి ఆ మూలకి కూచునేజనానికిరుద్ది, వ్యవహరించేముష్టివాళ్లనిన్నీ, కంపెనీలవెల్లడినిమిత్తంచౌకగాసాంపిల్ మందులు అమ్మడానికి ఉపన్యసించే ఏజెంట్లనిన్నీ, ఏమూలనుంచో వచ్చి మేజిక్‌లు చేసే వాళ్లనిన్నీ, మంచిగొంతుకతో పాడి రకంవారీ పాటలపుస్తకం అమ్మేవాళ్లనిన్నీ, వస్తువులు అమ్మేవాళ్లనిన్నీ, రూపాయిఖరీదు చెప్పి చివరికి అయిదుకాన్లకి బేరంచెయ్యడానికి వీలైన పుస్తకాలు వంటిమీద ధరించి, వాట్ల రకాలూ, వాట్ల ఉపయోగాలూ గురించి ముచ్చటించే వారినిన్నీ, శృంగారపు బొమ్మల పుస్తకాలు తెచ్చి షోకుగా వేషం ధరించిన వారితో వ్యవహరించే వారినిన్నీ “జేబిదొంగలు” కత్తిరింపులు తిన్నవారినిన్నీ, సూటుకేసులు మారుగిల్లు అయినవారినిన్నీ, ఈసభవారు చాలాస్తోత్రం చేస్తున్నారు. —

రైలుపడి ఇంతకాలం అయినా రైల్లో పాకీదొడ్డి ఎప్పుడు ఎట్లా ఉపయోగించాలో తెలుసుకోలేని పెద్దల్ని గురించి ఈసభవారు నాభిదగ్గిర్నించి డోక్కుంటున్నారు. —

రైల్లో ఎక్కగానే జనసమూహం ఏర్పడ్డా, (అధ్యక్షుడంటూ దిగి ఎక్కేచోటు గనక వీలులేక) జనానికి అదుపాజ్ఞ లుండవలసిన అవసరం లేదుగనకనున్నా, టిక్కెట్టు కొనుక్కోకుండంతోటే కొందరు తాము హృద

యశూన్యులై తమపక్క తమరికి మల్లేనే ఇష్టాయిష్టాలుగల సజీవవ్యక్తులు కూచోడం తమరు మరిచిపోవచ్చని అనుకోడంచేతనున్నా "పొగబండి" అనేమాట రైలుకి ఎక్కడ సార్థకం కాకుండా పోతుందో అని పక్కబెదురు కలిగి ఉండడంచేతనున్నా, ఏదో చెయ్యకుండా ఊరికే కూచోడం కష్టం గనకనున్నా, రైల్లో చుట్టలు కాలుస్తూ, గాలి వాటం చూడకుండా కూడా ఉమ్మి లేసి - అవిన్నీ నిప్పునెరుసులున్నూ ఇతరులమీద పడుతూండడం చూసికూడా రాయల్లా ఊరుకునే ధీరులకి, ఈసభవారు కైవారం చేస్తున్నారు. —

మగసాయంలేకుండా, ఆడవాళ్ల పెట్టెలో కూచోకుండా ప్రయాణంచేసే స్త్రీలున్న పెట్టి చూసుకుని ఎక్కే నాజూకువేషధారుల్ని వారి పుత్రికావాత్సల్యానికిన్నీ, సుందరమైన విగ్రహాలుగల స్త్రీలున్న బండీమాత్రమే ఎక్కేలౌక్యుల్ని వారిమాతృభక్తికిన్నీ ఈ సభవారు ప్రస్తుతిస్తున్నారు. —

డబ్బుండీ, రైలుతొందరలో కాఫీహోటల్లో అడుదుంబడుదుం అంటూ పావలాసరుకు నిలువుకాళ్లమీద పరామర్శించి, గబాగబా రైల్లో పడి, వేషంలోనూ జుట్టులోనూ నాగరికత వెలుగక్కుతూ, చదవడం తెలిసినా నూతనవార్తాప్రియత్వం ఉన్నా, చూసి చూసి అర్థణా పెట్టి స్వంతానికి పత్రిక కొనుక్కోక పక్కవాణ్ణి "మీరు పేపరు చదివారా?", "మీపేపరు ఓసారి ఇస్తారా?", "మీపత్రికలో ఒకషీటు విడగొట్టి ఇల్లా ఇస్తురూ" అని ఎరగనివాడిదగ్గిరకూడా యాచించో, పక్కవాడు తనపేపరు తను చూసుకుంటూంటే అతడిమీద శ్వాస లాగుల్తా దగ్గిర కొచ్చి తనూ చదువుకుంటూనో, లేక ఎరగనివాడు తను కొనుక్కున్న పత్రిక అక్కడ పెట్టి ఏ స్నేహితుడితోటో కబుర్లు చెప్పుకోడంలో ఉండగా వాణ్ణి అడక్కుండా తీసేసుకునో, ఇట్లా చెయ్యడంలో తనయొక్క గడుసుదనానికి లోపల తనే ఆనందించుకుంటూ, పులిస్తరాకులమీద జంతువులు ఎగబడ్డట్టు, పరాయివాడి పత్రికమీద విరుచుకుపడి, తను దిగేవరకు ఆ ఎంగిలిపత్రిక ఇదిగో అని యజమానుడికేనా యివ్వకుండా, చదువుతూండే ధనికులయొక్క ధనత్వం, ధన్యత్వం, సరసత్వం గురించి ఈసభవారు బెంగెట్టుకుపోబు హోరున, ఆనందిస్తున్నారు. —

గంటలకి గంటలు ప్రయాణం ఉన్నా, ఏమీ చెయ్యకుండా కిటికీకి దగ్గిర స్థలం సంపాదించుకుని, తమతాలూకుమూట పైన పెట్టుకుని, బయటికి చూస్తూ కిమ్మనకుండా గడిపే ఆలోచనపరుల్ని ఈసభవారు హెచ్చరిస్తున్నారు. —

సూటుకేసులు, పరుపులు, పీటలు వగైరాలు కిటికీల్లోంచి లోపలికి గిరవాటేసి రైలు ఇక వదలబోతోందీ అన్నప్పుడు ఎక్కి, అదివరకే కర్మవశంచేత లోపల కూచున్న వీలైనంతమందికి ముడుసులు విరగ్గొట్టేవాళ్ల అహింసాభావానికిన్నీ, వేగానికిన్నీ ఈసభ వారు వారిని మర్యాదచేస్తున్నారు. —

సిద్దర, జబ్బు, నోరు, జబర్దస్తీ, బిచాణా వగైరాలు ఉపయోగించి నియమితస్థలంకంటె వీలైనంత ఎక్కువస్థలం తమరు ఆక్రమించుకుని, అదే తమ ఆధిక్యత అని గర్వించే మహాత్తరుల్ని ఈసభవారు ఆరాధిస్తున్నారు. —

పరాయివాడిచేత కిరాయిపెట్టించిగాని, బల్ల కింద దూరిగాని, పాకీదొడ్లో నక్కిగాని, సమయానికి అవతలవేపున దిగిగాని, ఇతరత్రా దగాచేసిగాని, సన్యాసులైగాని, కావలసినవారైగాని, సేవకులైగాని, నెత్తిమీద వారైగాని, తత్సంబంధం కలవారైగాని, ఎల్లాగో అల్లాగ టిక్కెట్టు స్వంతంగా కొనకుండా ఉచితప్రయాణంచేసే అదృష్టవంతుల్ని ఈసభవారు బ్రహ్మరథం పడుతున్నారు. —

అతిజవంతో రైలు పోతూన్నప్పుడు అందులో కూచుని బయటికి చూస్తే దగ్గిరవని మనం అనుకునే వస్తువులు మన్ని విడిచిపెట్టి దూరంకావడమున్నూ, దూరానివే మన కూడా రావడమున్నూ ప్రతినిత్యమూ గమనిస్తూండీకూడా, ఆశ్చర్యంపడే మహామహుల్ని ఈసభవారు ఊరేగించి గౌరవిస్తున్నారు. —

తను ఎంతో వేగంతో పోతున్నా ననుకుంటూ, రాత్రప్పుడు, నక్షత్రాలకేసి చూస్తే తనూ, తనవాహనం, తనలోకం - వీటి ఉనికీ భూకుడూ మా కేం తెలుసును అన్నట్టు ఆ నక్షత్రాలు నిర్నిమిత్తంగా ప్రకాశిస్తూ ఉండడం గమనించి మానవుణ్ణి అల్పుడుగా కట్టేవార్ని ఈ సభవారు నిరసిస్తున్నారు.

శాంతంగా ఆలోచిస్తే రైలుప్రయాణం అనేది చిన్నప్రమాణంలో జీవితప్రయాణం లాంటిదే అనిన్నీ, మానవస్వభావాలు బయటపెట్టడానికీ మానవుల్ని తయారు చెయ్యడానికీ, అది చాలుననిన్నీ అనేవారి భావం శుద్ధపేలవం అయినప్పటికీ వారు అట్లాంటివి ప్రకటింప సాహసించినందుకు ఈసభవారు వారిమీద కొంచెం కోపం దాల్చడానికి ముహూర్తం వెదుకుతున్నారు. —



# మాధురులు

'వాధూల్'

ఊరకే మాధురులు
ఊరిపోతున్నాయి!
ఆవైపు, ఈవైపు
అని కాదు; అందమే
అలముకొని వెలిగేటి
అన్నివైపులకూడ
అంధకారప్రభలు
ముందువైపులకూడ
ఏవైపు చూసినా,
ఎందు కీమాధురులు!

వలపుటామనిలోన
తల లెత్తు పూలతే
నెల క్రోలి సోలు ఆ
మెలదేటిపాటలో,
అల వల్లకాట, ద
య్యాలచెరలాటలో
ఊరిపోతున్నాయి!
ఊరకే, మాధురులు!

ఒక్కసారిగ నురగ
కక్కుతూ - పొంగేసి -
ఉరుముతూ విరిగేటి
కెరటమ్ము కేకలో
ఆవెన్కనే మరో
అలరాక తెలుపుతూ
ఏవైపు చూసినా
ఎందుకో, మాధురులు!

వాడిపోయినపూల
వాసనలు కాబోవు!
క్రొత్తవాసంతికల
కొమరు లసలే కావు!
మనమనస్సులె కాల
ముందు కల్పించితే
ఊరకే, మాధురులు
ఊరిపడుతున్నాయ?

హాయి, భోగం, మనకి
ఏవైపో దాగికొని,
'తీయరోజులె కలుగు
తాయి ముం దెప్పుడూ'
అని, కమ్మవాసనల
విరజిమ్ముతున్నాయ?

ఏవైపు చూసినా,
ఏమి టీ మాధురులు!

ఆశలై, అందాల
రాసులై, కలిగేటి
సౌఖ్యాల ఊసులై
చిరునవ్వు మోసులై
పెరుగులో, విరుగులో,
తరుగులో, పరుగులో,
ఊరకే, మాధురులు
ఊరిపోతున్నాయి!!



# కళలు - జీవితములో వానిస్థానము

శ్రీ జగన్నాథ్

ఈనాటి యువకులు — ఈనాటి ప్రజ, రేపటి ప్రపంచానికి నేతలు. ఇప్పటి అభిప్రాయాలు రేపటి నడతకి పునాది. ఇప్పటి ఆదర్శాలు రేపటి ఆశయాలు. ఇప్పుడుచేసిన కృషి రేపటి ఫలము.

అయినప్పటికీ, ఈనాటి యువకుల తత్వము నిస్సారంగా వీరి అభిప్రాయాలు సందేహ సమూహాలుగా, వీరి ఆదర్శాలు తెలియనివిగా, వీరి కృషి పూర్ణానుస్వారంగా, ఉన్నాయంటే, అది ఎంత అసంతృప్తికరమైనదైనా నిజమైనమాట. దీనికి అనేక కారణాలు చూపించవచ్చు. విద్యావిధానములో లోపాలవద్దనుంచి, వేదాంత తత్వములోని "సర్వం మిథ్య" అని సరిపెట్టుకోవటంవరకూ బౌద్ధ, తురుష్క, క్రైస్తవ మత సంఘాతములవల్ల మొదటిరోజుల్లో ఉండిన గొప్ప స్థితి పోయిందనవచ్చు. ఏమైనా, ఈరోజున వేలమందిని లెక్కపెట్టితే వేయిమందిలో ఒకవ్యక్తికికూడా జీవితంలో ముఖ్యమైన ప్రశ్నలకి సమాధానం తెలుసుకుందామనే ఉత్సాహంకూడా ఉన్నట్టు కనిపించదు.

సర్వసాధారణంగా ప్రతివ్యక్తీ, రెండు పూటలా భోజనం, ఇంకో రెండుసార్లు (వీలైతే ఎన్నిసార్లైనా సరే) కాఫీ, ఒకఇల్లూ, కాస్త మితంగా పిల్లలూ, ఇవీ కోరేవి ;—అంతేగాని ఎందుకు ఈజీవనము ఇలా తిని తిరుగుతూ గడపాలో ఆలోచించటంలేదు. ఇలా బ్రతికినన్నాళ్లూ బ్రతికి చచ్చిపోతే తరువాత మనలో ఏమైనా మిగులుతుందా? మిగిలింది ఏమౌతుంది? ఇలా ఇంతమంది పుట్టి ఇంతమంది పోతున్నారే, చివరికి ఈప్రపంచం, ఈసూర్యుడు, చంద్రుడు, ఇవన్నీ ఏమయిపోతాయో? అసలు, మనం — (మనుష్యులం) రాకముందు ఈభూమిమీద ఎలా ఉండేది?—"ఏవో జంతువులు కాబోలు"—"అవెక్కడనుంచి వచ్చాయి?"—"అంతకుముందు"?—అసలు బ్రతకటం, చచ్చిపోవటం ఏమిటి? ఎందుకు? ఓరోజునుంచి ఓరోజుకి మనుష్యజాతి అభివృద్ధి పొందుతోందా? అడుగంటుతోందా?— ఇలా ఎన్ని, కోట్లకొలది ప్రశ్నలు ఏ ఒక్కక్షణమాత్రం ఆలోచించినా బయల్దేరుతాయి.

వీటిల్లో కొన్ని ప్రశ్నలకి — అర్థంచేసుకుంటే అన్ని ప్రశ్నలకీ అంటారు తెలిసికొన్నవారు — మనవేదాల్లో గూఢంగా జవాబులున్నాయట. వేదాల్లో ఉన్నా లేకపోయినా, శాస్త్ర పరిశోధనలవల్ల కొన్ని సంగతులు తెలిసికొంటున్నారు ఇప్పటివారు. అసలు ౫,౦౦,౦౦౦ ల ఏళ్లక్రిందట భూమి చాలామట్టుకు మంచుతో కప్పబడి ఉండేదనీ, మొదట్లో ప్రాణమున్న వస్తువులు నీళ్లల్లో బయల్దేరాయనీ, నాచుమాదిరిగా — అందులోంచి కొంతకాలానికి చేపలూ, దాని తరువాత భూమిమీదా నీళ్లల్లోనూ తిరుగగల జంతువులూ, ఆపైన భూచరాలు, అందులో అనేకమయిన తెగలూ, కొంతకాలానికి కోతులూ, పిమ్మట మనుష్యులూ ; — ఇంతవరకూ పరిశోధకులు కనిపెట్టినవి. ఈవిజ్ఞానాన్నే మనపూర్వులు మత్స్య కూర్మాది అవతారాలుగా భాగించి మనకి విడిచి పెట్టారని కొంతమంది అభిప్రాయము.

అయితేమాత్రం ఏం ఉపయోగము?— ఈ రోజున ప్రజాసామాన్యాని కవి అర్థంకావు. పూర్వులు ఆమాత్రపు శాస్త్రజ్ఞానమేగాక, కావలసినంత తత్వజ్ఞానముకూడా ఇమిడ్చి, ఈజీవరాసులయొక్క ఉద్భవక్రమమునేకాక, అవన్నీ విష్ణుమూర్తియొక్క అవతారాలనటంలో, సకల చరాచర సృష్టిలోనూ దైవఅంశ ఉన్నదనీ, అది అభేదమైనదనీకూడా సూచించి ఉంచవచ్చును. కాని అది అర్థముచేసుకోవడానికి మన ఈరోజున వెల్సుగారి (H. G. Wells) ప్రపంచ చరిత్ర (Outlines of World History) నీ, మాక్స్ ముల్లర్ (Max Muller)గారి ఋగ్వేదపు తర్జుమానీ చదువుకోవలసివస్తోంది.

ఇక ఈ ౫,౦౦,౦౦౦ ల ఏళ్ల క్రిందటి సమాచారముగాక, ఈరోజున మన నిత్యజీవితంలో ఆదర్శ మేమిటి? ఈమతసంఘర్షణలలో, ఈ రాజ్యకాంక్షలలో, ఈ యుద్ధ బీభత్సంలో, ఈ విమానాలతో, ఈ విమానాయుధరక్షణటోపీలతో, ఈ జపాను సరుకులతో నిండిపోయిన బజార్లతో ఏమయిపోతున్నాయి దేశాలు? ఈలోకంలో వ్యక్తియొక్క కర్తవ్య మేమిటి? కర్తవ్యరహితంగా సూర్యకిరణములో తేలిపోయే ధూళికణాలాగు, 'నయాగరా' లో చిరుచేపలాగ కొట్టుకొని పోవలసినదేనా? లేక ఇలా కాదు, ఈ జలపాతము ఆపాలి; దానికి ఈ ప్రయత్నము చేయాలి, అని పూనుకోవాలా?— పూనుకుంటే సాధ్య మవుతుందా?— ఒకవేళ ఆపగలిగితే, ఇంతవడిగా, ఇంత విరివిగా ప్రవహించే ఈజల ప్రవాహాన్ని— ఈమానవ కృషిని ఏమిచేయటము?— రేపటి ప్రపంచం ఎలా ఉండాలి— రష్యాలాగ సామ్యవాదమా, మనదేశంలోని పూర్వపద్ధతిమళ్లీ సర్వసంగపరిత్యాగమా?

ఇవి ఇప్పటికాలమానంలో కొందరిలో కలిగే సందేహాలు. వీటికి అనేక జవాబు లుండవచ్చు: ఏవ్యక్తికి ఆ వ్యక్తికి అతి అనుకూలంగా వర్తించవచ్చు, ఆలోచనలోనూ ఆచరణలోనూ కూడాను. కాని ప్రతివ్యక్తి కూడా అలాటి ఆలోచన మొదలు పెట్టి తరువాత ఎలాతోస్తే అలా ఆచరించినట్టయితే— భగవద్గీత ననుసరించి ప్రయత్నము ఫలము భగవదర్పణ చేసినా; సంపూర్ణ అహంభావముతో అన్ని దేశాలు ఏకంచేసి, సర్వ భ్రాతృత్వము స్థాపిస్తానని నడుం బిగించి ముందుకు దూకినా— మొదట్లో ఈ ఆలోచనలూ, ఈ సంశయ నివారణలూ వ్యక్తికి చాలా ఉపయోగిస్తయి— సంఘానికి దేశానికి ప్రపంచానికికూడా ఈలాటివ్యక్తు లుపయోగపడతారు.

ఈ ఆలోచనలవల్ల స్ఫురించే వివిధమార్గాల్లోను కళారాధన ఒకటి.

కళారాధన అనటంలో— కళ అంటే కేవలమూ ఏదో ఒక ప్రత్యేకపు కళాస్వరూప మనుకోవడంగాని, ఆరాధన అంటే అభ్యసించడమే అని అనుకోవటంగాని పొరబాటు. కళ—అన్ని రూపాల్లోనూ—వివిధముగా జీవితములోకి వచ్చినాసరే, అభ్యసించటం వల్లగాని, అనుభవించటంవల్లగాని — జీవితసమస్యలని పూరించటానికి సమర్థమైనది.

'కళ' అనే సందిగ్ధపదాన్ని జాగ్రత్తగా విమర్శిస్తే అది అనేకస్వరూపాలుగా అగుపడుతుంది. కాలవశాత్తూ కళ అనేసరికి చిత్రలేఖనమనే సంకుచితభావనే చాలామందికి తట్టుతుంది. కాని అసలు ఈ చిత్రలేఖనము, శిల్పము, భవన నిర్మాణము అన్న వాటితో స్థావరకళలక్రింద చేర్చబడి, జీవకళ లయిన సంగీతము కవిత్వము నాటకము అన్న స్వరూపాలతో పాటు లలితకళ లని పూర్వుల విభజన.

కాని కళయొక్క అర్థమూ, లక్షణమూ అవగాహన చేసుకుంటే ఇన్ని శాఖోపశాఖలుగా ఉన్న లలితకళలలోనూ కావలసినన్ని లక్షణాలలో పోలిక కనిపిస్తుంది — కళ అని అనిపించుకోదగిన ప్రతి స్వరూపముయొక్క ప్రారంభములోనూ, ప్రగతిలోనూ ప్రభావంలోనూకూడాను.

జీవకళ ఉట్టిపడే చెక్కడములోనయినా, కళ్లు మిరుమిట్లు గొల్పేటంత సహజవర్ణాలు వెదజల్లే సూర్యాస్తమయముయొక్క చిత్రలేఖన మయినా, మూర్ఛావస్థలో ముంచివేసే సంగీతమయినా, ఆనంద విషాదాతిశయ్య అనాయాసంగా విసిరివేయగల నాటకమయినా,—ప్రారంభంలో కళ కర్తయొక్క ఆవేశబలము మీదా, నిర్వహణలోని చతురతమీదా ఆధారపడి ఉంటుంది; ఎందుచేత నంటే ప్రతి కళాస్వరూపము కూడా, మానవహృదయంలో పొంగి పొర్లే ఆవేశము, ఉద్రేకమువల్లనే ఏర్పడుతుంది.

అసలు కళలయొక్క అంకురము పరిశీలించి చూస్తే ప్రతివిధమయిన కళాకూడా వ్యక్తియొక్క ఉద్రేక ఉద్వేగములవల్ల ఏర్పడినట్లు నిరూపించవచ్చు. చిత్రలేఖనముయొక్క ప్రారంభము, ౩౫,౦౦౦ ఏళ్ల క్రిందటి బొమ్మల్లో ఉంది. అలాగే గృహాలంకరణమూ, శిల్పమూ, సంగీతమూ, నాట్యమూ అన్నీని.

పచ్చిమాంసం తిని, నగ్నముగా తిరుగాడుతూండే ప్రప్రథమ మానవజాతిలోని వ్యక్తి, అడవిలో తన

తలుచుకొన్న జంతువు ప్రాణభీతి కొద్దీ పరిగెడు తూన్నప్పటి వేగమూ, బలమూ, అంగసౌష్ఠవమూ తన మనస్సులో నాటుకుపోగా, వాటిని తీరికగా ఉన్నప్పుడు తనదగ్గిర ఉన్న ఱాతిముక్కతో మరో ఱాతిమీద గీస్తాడు. తనవేట సంతుష్టిగా ఉన్నప్పుడు, తను యుద్ధంలో జయించినప్పుడు తనకు గలిగిన సంతోషముతో, ఆ మాంసము కాల్చుకుంటూనో, ఆశ్రగువుల శరీరాలచుట్టూ చప్పట్లు కొట్టుకుంటూనో, డొల్ల చేసిన మానులమీద వాయిస్తూ నాట్యం చేస్తాడు — ఆయుధాలు ఎగరవేస్తూ.

ఈ విధంగా హృద్వేగంవల్ల ఏర్పడ్డ కళలు వేల కొలది సంవత్సరాలుగా అలవాటు చేసికొన్న విధుగతి వల్ల లలిత కళలయి, ఈవాటికి అభ్యాసముమీద చాలా వరకూ నేర్చుకోతగిన వయినప్పటికీ, ఈ ఆవేశము యొక్క ప్రాముఖ్యత ఏ మాత్రమూ తగ్గలేదు. అంచేత అన్ని శాఖోపశాఖలూ ప్రారంభంలో ఈ ఉద్రేకం మీద ఆధారపడి ఉంటాయి. ఇంతేగాక ఆరంభ దశలో అన్ని కళలూకూడా మానసిక సంతృప్తి కోసము, దేహసౌఖ్యాలు అన్నీ అనుభవించిన తరువాత నయినా, ఏమీ అనుభవించ లేకపోయినా, మానవుడు చేసినకృషియొక్క ఫలాలు. తనలో ఉన్న సృష్టి శక్తి వినియోగించటంలో ఏర్పడినరూపాలు కళలు.

ఇక కళయొక్క ప్రకృతిలో,— ఒక కందపద్యమైనా, భైరవిరాగమయినా, లక్ష్మీ విగ్రహమయినా, రాములవారి పటమయినా, ఆసుపులో ఆలాపనలో చెక్కటములో చిత్రించటంలో ఒక కవికీ మరోకవికీ, ఒక గాయకునికీ మరోగాయకునికీ, ఒకశిల్పికీ మరోశిల్పికీ, ఒక చిత్రకారుడికీ మరోచిత్రకారుడికీ తేడా ఉండి తీరుంది— ప్రయత్నించిన స్వరూపాలు చాలావరకు శాస్త్రబంధితము లైనప్పటికీ. ఇట్లు ప్రత్యేక వ్యక్తిత్వ విశిష్ట మవటము కళయొక్క సర్వశాఖలకూ సహజము.

ప్రకృతిలో వ్యక్తిత్వమెలాగో ప్రభావములో ప్రాకృతత్వమూ అలాగే అన్ని కళాస్వరూపాలకీని.

ఏకళ చూచినా సరే, ఉత్తమావస్థలో — కళాస్వరూపాన్ని సృష్టించిన వ్యక్తికీ, అనుభవించే వ్యక్తికీ తేడా నశించిపోతుంది— ఆస్వరూపాన్ని గురించిన చింతనవల్ల, ఆస్వరూపము కల్గించే ఆనందమువల్ల, ఆవేశమువల్ల; అంటే కళారాధనలో సంకుచితమయిన జాతీయతకీ, అహంభావానికీ చోటు లేదు. కథాకళి అమెరికాలోనూ, షేక్స్పియరు నాటకాలు మన దేశంలోనూ, ఆనందబాష్పాలతో అనుభవించటానికి ఇదే కారణము. అంచేత కళ అహంభావత్వాన్ని మరపించి ఆనందాన్ని అనుభవింపజేయటంలో అద్వితీయమయిన దన్నమాట — ఒక్క ప్రేమతత్వానికి తప్ప.

కాని కళ వ్యక్తిత్వాన్ని ఒకవిధంగా కాపాడుతూ, మరోకవిధంగా మరపించేస్తుంది; అంటే వేదాంతపరంగా మాట్లాడితే, బహిః ప్రపంచము యొక్క బహువిధ వికల్పాల్లోనే అంతర్గత బ్రహ్మమును అవగాహన చేయగలదన్నమాట సంక్షిప్తమూ, అశాశ్వతమూ (Finite and perishable) అయిన రూపము ద్వారా శాశ్వతమూ, అనంతమూ అయినదాన్ని గోచరింప చేయగలదు.

వేదాంతతత్వము, విజ్ఞానము, శాస్త్రపరిశోధన, ప్రేమమార్గము, భక్తియోగము మొదలయిన వివిధమార్గాలుకూడా చిట్టచివరకి చూపెట్టేసారాంశ మిదే— శాశ్వతమూ అనంతమయినదాన్ని గుర్తించటం;—బ్రహ్మజ్ఞానమన్నా భగవంతుడన్నా, ప్రకృతిఅన్నా, మరెన్ని విధాల పేర్లెట్టినాను.

అయితే వ్యక్తిజీవితములో, వ్యక్తిపరివర్తనలో, బయటిప్రవర్తనలో, లోపలి అనుభవములో, ఈ ఆలోచన ఈ గుర్తించటం ఎలా ఉపయోగిస్తాయని అంటే కళ మానవజీవితంలో, వ్యక్తిదినచర్యలో ఎలా సహాయపడుతుందో పరిశీలించాలి. దీనికి మానవప్రకృతి మానవస్వభావము ఎలా ఉంటాయో అర్థం చేసుకోవటం అవసరం.

మనుష్యుడు అవతరించి నప్పటినుంచి— ఆదాము (Adam) నుంచి అనుకున్నా సరే, ఒరాంగ్ ఉటాంగ్ నుంచి అనుకున్నా సరే — అతని మానసికతృష్ణ భాగ్యంకోసము, ఆనందముకోసమూను. జీవితకాలంలో ఈ మృగతృష్ణలకోసం వెదకి వేసారిన వ్యక్తి, స్వర్గం

అంటే సౌఖ్యమయంగానూ, భగవంతు డంటే చిదా నంద స్వరూపుడుగాను భావించుకోటాని కిదే కార ణము. మనుష్యుడు మతసిద్ధాంతాల్లో, ఆధ్యాత్మికచిం తనలో మున్గి డయిపోయినా, వ్యాపారములో ధనసం పాదనలో తదేకదృష్టితో తంటాలుపడినా, యుద్ధ మంటే భయపడినా, పిల్లలంటే ప్రేమించినా, సంఘ నియమాలు ఏర్పరిచినా, వాటిని ఒక్కొక్కప్పుడు ఉల్లంఘించినా— ఐహికంగా ఎన్ని ప్రయత్నాలు చేసినా, ఆముష్మికంగా ఎన్నిరీతుల ఆలోచించినా ఈ సౌఖ్యంకోసం; ఈ ఆనందం కోసం పాకులాడుతాడు, పరిగెడుతాడు.

ఇటువంటి స్వభావము, ఇటువంటి కోరికగల వ్యక్తి, కళారాధనవల్లనైనా, తదితర మార్గాలవల్ల నైనా ఈ అనంత విశ్వమయత్వాన్ని గుర్తించగలిగి నప్పుడు, తనకీ ఇతర ప్రపంచానికీ, అంతరాత్మలో, అనాదిలో, అనంతంలో భేదంలేదని తెలిసికో గలిగి నప్పుడు తన సౌఖ్యం తన ఆనందం ఏవిధంగానైనాసరే పొందాలనే నిశ్చయానికి రాలేడు.

తన కోరికలు, ఇతరులని యుద్ధాల్లో ముంచేసి అయినా, ఇతరుల ఆనందం, ఇతరుల సౌఖ్యం, ఇతరుల ఆశలు, అన్నీ నాశనముచేసి అయినా సరే తనకోసము ఆ భాగ్యము సంపాదించుకోవాలని ప్రయత్నించలేడు. అంతేగాక, తను కోరే ఆనంద సౌఖ్యాలు మిగిలినవారిని లక్ష్యము చేయకుండా తనకోసము సంపాదించుకో వాలని ప్రయత్నించినకొద్దీ దొరకని ఈ సంపదలు, బాహ్యప్రపంచానికి, ఇతర వ్యక్తులకి తను ఏవిధంగా నైనా ఈవన్మాత్రంగానైనా మరొకవ్యక్తికి తనుకలిగించి నప్పుడు, అవి తనకికూడ అత్యంతసుఖాన్ని ఆనందాన్ని ఇవ్వడము కనిపెట్టగలడు. ఈ అనుభవము కలిగినప్పుడు- వ్యక్తి దినచర్యలో-ఆలోచనలో తప్పక మార్పు వచ్చి తీరుతుంది.

వేలకొలదిజనం ఒక్క క్షణమాత్ర మయినా తమర్ని తాము మరచిపోయి ఆనంద మనుభవింపజేసే కళాస్వరూపాన్ని కల్పించినవ్యక్తి మానసికంగా అనుభ వించే స్వర్గసౌఖ్యమును ఇతర ఐహిక విజయాలు ఎన్ని వేలయినా తీసికొని రాలేకపటం అతిశయోక్తి కాదు.

అలాగే ఒకసారి చూచినంతమాత్రాన, ఒక సారి విన్నంతమాత్రాన, ఒకసారి ఏకళాస్వరూప మయినా జీవజల్లే ఆనందం అనుభవించినంతమాత్రాన, తరువాత జీవితంలో కొన్ని సమయాల్లో మళ్లా ఆక్ష ణము జ్ఞాపకము తెచ్చుకొని, మళ్లా ఆ ఆనందం స్మరిం చుకో గలిగిన వ్యక్తికీ — అటువంటి అనుభవ మేలేని వ్యక్తికీ మానసికంగా గాకుండా దినచర్యలో కూడా ఎంతో తేడా ఉంటుంది.

ఇటువంటిమార్పు జీవితంలో కలిగించే విధానాలు ఎన్నో ఉన్నాయి. ఉదాహరణకి, తత్వవిచారముతో సంబంధము లేనట్లు కనపడే శాస్త్ర పరిశోధన మార్గాను. గణితము, జ్యోతిషము, ప్రకృతిశాస్త్రము, విద్యు చ్ఛక్తి - ఏశాస్త్రమైనా సరే అది అతనికి ఒకఅర్థంగాని సమస్యలో ఏదో ఒక ఊహాతీతమయిన దాన్ని ఊహించు కుంటేనే గాని తెగనిసమస్యలో దింపేస్తుంది. గణితములో (Infinity) అనంతమనీ, జ్యోతిషములో గ్రహాకర్షణ అనీ, విద్యుచ్ఛక్తి అయితే సూక్ష్మతరకణాల్లోని శక్తి అనీ, ప్రకృతిశాస్త్రమయితే జీవశక్తి అనీ ఇలాగే అనేక విధాలమన ఇంద్రియాగ్రహణాతీతమయిన ఒకచోట వది లివేస్తుంది. అలాగే వేదాంతమూను. "న ఇతి", "న ఇతి" అనీ, అనంతం అనీ, శాశ్వత మనీ వర్ణిస్తూ ఆత్మస్వరూ పాన్ని అవగాహన చేసుకోమంటుంది. అదే ప్రేమమార్గ ములోనూ; మొదట భౌతికంగాను మానసికంగానూ సంపూర్ణంగా తనవ్యక్తిత్వాన్ని మరిచిపోయేటంత సంపూర్ణంగా మరోవ్యక్తిని ప్రేమించటం — తన సర్వ వ్యాపకాలూ, తన సర్వస్వమూ ఆ వ్యక్తికే అంకితం చేయటం — అంతనుంచి అటువంటి ప్రేమ ప్రతివ్యక్తి మీద, ప్రతిస్వరూపముమీదా చూపించగలగటం, ఆ పైన ఆ ప్రేమే ప్రపంచంయొక్క సృష్టికర్తమీదకి మార్చుకోవటంలోకి మారుతుంది.

అయితే ఈ మార్గాలు కేవలం అనుభవంవల్లనే తెలుసుకోతగినవి — అందులోనూ స్వబుద్ధివల్ల ఏరుకో తగినవి. కళారాధనమట్టుకు కొంతవరకు నాటవచ్చు; అభివృద్ధి పొందించవచ్చు—సులభంగా పురికొల్పవచ్చు.

ఎప్పటికైనా మానవజాతికి సర్వవిధాలా శాంతి, వివిధ జాతీయతత్వాల్లోను ఓర్పూ భ్రాతృత్వమూ ఏర్పరచా

లంటే కళారాధనను రేపటి ప్రపంచంయొక్క ప్రజకి, ఈనాటి పిల్లలకి బోధించాలి. కళాస్వరూపాన్ని సృష్టించటంలోకలిగే ఆనందన్నూ, అనుభవించటంలో అహంభావత్వాను అణగిపోవడన్నూ రేపటిప్రజకి రుచిమాపించాలి.

అయితే ప్రపంచాన్ని ఉద్ధరించటానికి కళారాధన ఒక్కటేనని అనడానికి వీల్లేదు కాని అన్నిటికంటె అది ఎక్కువ వీలయిన మార్గము; సులభమయిన దీని.

అందుచేతనే అడయారులో లలితకళలు బోధించటానికీ, అలోక్యరాలో నృత్యము నేర్పటానికీ, శాంతినికేతనములో మొదటినుంచీ కళారాధన విద్యావిధానములో ఒకశాఖగా ఏర్పరచటానికీ కూడా కారణం ఆయా మహాశయులు లక్ష్యంలో ఉంచుకున్న సకలమానవ సౌభ్రాతృత్వము, మానవసేవ ప్రపంచ శాంతి అనే ఆదర్శాలు.

---

# పునరభ్యుదయము

శ్రీ ఇవటూరి సుందరయ్య

లోకబాంధవుఁ డినుఁడు సుశ్లోకుఁ డతఁడు
కర్మసాక్షియై జగములు గాచుచుండ
నతని సుప్రతాపంబున కాఁగ లేక
తమి సుఖంబులఁ బడయంగఁ దలఁచునంత
గాఢతమ మెల్లయెడలను గ్రమ్మివైచి
పూర్వవిజ్ఞానదృష్టులఁ బోకడంచి
కన్నుగానని దుస్థితి గలుగఁజేయ
మంచిచెడ్డలు గానక మనలె జనము
జనులు నినుఁడును నిట్లుండ నందు చూచి
శ్వేతరుచిరాజు రాజ్యంబు స్వీకరించి
యనునయించుచు నుత్సాహ మొనయఁజేసి
పటుకరంబులఁ జల్లగాఁ బఱపి పఱపి
యినుఁడు కృపతోడ జగతికి నిచ్చినట్టి
పద్మకోశవికాససంపదల దోఁచి
స్వీయకువలయప్రియకోటిఁ జేర్పఁజొచ్చె
నతతదోషాకరోరుసంసర్గమునను
విహితనిజధర్మకర్మముల్ విడిచి మిగుల
విషయసుఖకృత్యములె విధివిహితములుగఁ
దలఁచి కందర్పసుఖపరతంత్రు లగుచు
గోవధాచరణాదిక ఘోరకృత్య
జీవనక్రూరదుర్జనసేవ్యుఁడైన
రాజుప్రియమె ప్రియంబుగ నోజఁ దిరిగి
నిఖిలశక్తులఁ గోల్పోయి నియతిఁ దప్పి
మంచములు పట్టి మైమఱచి రవ్వ
డతిముదంబున రాజు మిన్నందఁదొడఁగె
నతనిచెలు లెల్ల భువనంబు లాక్రమించి
రట్టి దురవస్థ ప్రజలు తా మడలుచుండఁ
ద్రివిధసుస్వరవేది సద్విజగణంబు
కాలగతినైన వికృతికి జాలినొంది
యుద్ధరింపంగ లోకంబు నూహఁ జేసి
"గురుకళత్ర సంసర్గ సంకోచరహిత
చరితసాంగత్య సతతానుషంగమునను
విహితనిజధర్మకర్మముల్ విడిచి మీరు
సోమరులును విషయసుఖకాము లగుచు
నిట్టిజాడ్యంబు నొందితి రిప్పుడైనఁ
బారతంత్ర్యము వీడి ధీబలము గాంచి
తెలివితెచ్చుక పూర్వపుఁ దెన్ను వట్టి
సకల నిజధర్మకర్మ సంసక్తు లగుచు
సర్వసౌభ్రాతృభావంబు సంతరించి
పట్టువదలక శాంతిమైఁ బాటుపడుచు
నైకమత్యంబునను యత్న మాచరింపుఁ
డపుడు మీ కెల్లకష్టంబు లంతరించు
నంచు బోధించుగతిఁ ద్రిస్వరాంచితముగ
గొంతు లెత్తుక బిగ్గరఁ గూకలిడఁగఁ
దెల్లగద్దలు చెలరేఁగి ధిక్కరించి
యినుపముక్కులఁ దమ్ము బాధించుచున్న
వెఱపుఁ జెందక ద్విజకోటి యఱచుచుండ
నామహాద్విజరవంబుల నాలకించి
మైనఁ గన్నుల విప్పి మీ రంద ఱిపుడు
రాజసేనావిశేషసంప్రాప్తజాడ్య

గుణమునను జేసి యింద్రియకోటియెల్ల
వశముగాకున్న జనులార! పాటుపడుఁడు
అదిగొ తొలిదెస నిన తేజ మంకురించె
ద్విజరవంబులు చెలఁగుచు దెసలు నిండె
నుదయగిరిసింహపీఠి నుజ్జ్వలముగ
నినుని తేజము వ్యాపించె నేని యపుడు
రాజు తన తేజ మతని కర్పణము చేసి
తొలుత నిచ్చట మును దాను దోఁచికొన్న
పద్మకోశవికాససంపదల మరలఁ
బ్రాగ్దిశాభూమి సరసుల పాలుచేసి
మైత్రి వాటించి యభివృద్ధి మదిఁ దలంచి
యర్హతరనిజజన్మదేశాభిముఖుఁడు
మిత్రకరలబ్ధతేజస్సమేతమూర్తి
యగుచు నపరాద్రికూటంబు నధివసించు
నతని చెలు లెల్లఁ దమ తేజ మడఁగ నపుడు
భువనములలోనఁ దలవంపుఁ బొంది తొంటి
మోదమును వీడి మూతులు ముడిఁచికొంద్రు
కర్మసాక్షి ప్రతాపంబు గ్రాలుచుంట
విహితకర్మాచరణవిధి విములు లగుచు
జాడ్యముల వీడి విజ్ఞానశక్తి గలిగి
ముదమునొందుచును పునరభ్యుదయమంది
యాయురారోగ్యసంపద లంది మీర
లినునికృపచేత సుఖుల రయ్యెదరుగాత! -

---

# కర్ణాటక గానశైలి పవిత్రత[1]

శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ

తెలుగువారి పాటలలో హిందూస్థానీ పోలికలు ఎక్కువగా మిశ్రమగుచున్నవనియు, వారిది పరిశుద్ధమైన కర్ణాటకగానశయ్య కాదనియు ఒకవిమర్శన ప్రబలుచున్నది. గొప్పగొప్ప తెలుగుగాయకులను



రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు

వాదకులను గూర్చికూడ ఇట్టియభిప్రాయమే ఇతరులు వెలిపుచ్చుచున్నారు. గొప్పవిద్వాంసులు కొందరిమాట యట్లుండనిచ్చితిమేని సామాన్యాంధ్రగాయకులవిషయమునపైయభిప్రాయము కొంతవరకు నిజమే అనకతప్పదు.

ఇందుకు ముఖ్యముగా నాకు తోచిన కారణములు రెండు: మొదటిది తక్కినవారికంటె తెలుగువారు ఉత్తరభరతఖండమునకు సమీపముగా నుండుట. అందుచేత తక్కిన ద్రావిడభాషలకంటె తెలుగులో హిందూస్థానీపదములు ఎక్కువగా మిశ్రమయినట్లే, తెలుగువారి సంగీతమందుగూడ హిందూస్థానీ పోకడలు ఎక్కువగా చేరి అతుకుకొన్నవి.

రెండవ కారణము ఇంతకంటె ప్రబలమయినది. తెలుగుదేశమందు సంగీతమును విద్యగా నేర్చి అభ్యసించువారిసంఖ్య ఈవల చాల స్వల్పమగుచున్నది. దాని కెక్కువ ప్రోత్సాహము నిచ్చి పోషించుచుండిన రాజులును, జమీన్దారులును ఈవల ఉదాసీనులగుచున్నారు. చాలసందుకు తెలుగుతరుణులకు స్వతంత్రబుద్ధి రాను రాను బలిసిపోవుటచే కర్ణాటక సంగీతమును నేర్చుటకు కావలసిన కట్టుదిట్టములకు తలయొగ్గుట కష్టముగా తోచుచున్నదేమో! కాని తెలుగువారిలో అరవలకన్న కన్నడులకన్న అనేకులకు మంచి ఘనమైన శారీరము కలదు. కావున వారు పాడకఉండలేరు. అట్టిస్థితిలో నాటకములు, గ్రామాఫోనులు, సినిమాలు - ఇప్పుడు రేడియోలు - ఇత్యాదులమూలమున హిందూస్థానిపద్ధతులు వారిని సులభముగా వశపరచుకొనగల్గుచున్నవి.

ఎందు కనగా, కర్ణాటక హిందూస్థానీ సంప్రదాయములను స్థూలముగా పోల్చి

1. రేడియో ప్రసంగము. మద్రాసు ఆల్ ఇండియా రేడియోవారి అనుమతిని.

చూచినప్పుడు మొదటిదానికన్న రెండవది సులభ మనియు, జనరంజక మనియు స్పష్ట మగును. సూక్ష్మస్వరూపములమాట యిప్పుడుపని లేదు. ఏపద్ధతియందైనను సూక్ష్మస్వరూపము తపస్సుచేసియే సాధింపవలయును. ఇప్పుడు మనవారు హిందూస్తానీ యనుపేర పాడునదియు, వాయించునదియు సామాన్యముగా దాని స్థూలస్వరూపమే గాని సూక్ష్మస్వరూపము కాదనుట ప్రత్యేకముగా చెప్పబని లేదు. గమకములందుగాని, తాళలయములందుగాని, తానములందుగాని ఎక్కువ లోతుకు దిగకయే పాడి హిందూస్తానీ యనిపించవచ్చును. రక్తి కలిగింపవచ్చును. స్థాయిలోని పండ్రెండు స్థూలస్వరములను శుద్ధముగా పట్టగలిగిన గాత్రము గలవారి కందరికిని ఇది సాధ్యము. శుద్ధమైన నాదమును విన్నప్పుడు రంజన ఎవరికి కల్గదు? చెవిటివారికి తప్ప. కర్ణాటక పద్ధతియందలి స్థూలమైన నడకలనుగూడ ఇంత సులభముగా పట్టుకొనలేము.

కాబట్టి జనసామాన్యమునకు హిందూస్తానీయందు కలుగు రక్తి కర్ణాటకమందు కలుగుట, కలిగించుట కష్టము. జనసామాన్యమునకుగల యీరుచి విద్వాంసులకును వ్యాపించితీరును. వారిమెప్పును సంపాదింపకుండుట వీరికి సాధ్యముగాదు. ఎంత గొప్ప కర్ణాటకవిద్వాంసు డైనను కచ్చేరీతుదలో నైనను రెండుహిందూస్తానీవరుసలు వినరకపోయెనా అతనికి మానము దక్కదు. ఆ రెంటికై మాత్రమే మూడు నాల్గుగంటలైనను సభలలో వేచి యువ్విళ్లూరుచుండు రసికులును అనేకు లుందురు. కనుకనే దాక్షిణాత్య విద్వాంసులలో హిందూస్తానికై ప్రత్యేకముగా పరిశ్రమించి సాధించినవా రనేకు లున్నారు. కాని ఉత్తరదేశపుగవాయీలలో ఎవరైనను కర్ణాటకమునకై శ్రమించినవారు సాధించినవారు కలరేమో నే నెరుగను — ఒక కీర్తిశేషుడగు అబ్దుల్ కరీంఖాను తప్ప.

ఇట్లగుటచేత హిందూస్తానీపద్ధతి క్రమక్రమముగా భరతఖండము నంతయు ఆక్రమించుకొనుచున్నది. ఒక తెలుగు దేశమును మాత్రమే కాదు. కన్నడదేశపు ఉత్తర దక్షిణప్రాంతములందే కర్ణాటకపద్ధతికి గౌరవము లేదు. అరవ కన్నడ నాటకములలో, దేశీయగీతములలో, సినీమాలలో కనీసము సగానికి సగము హిందూస్తానీ వరుసలే వినవచ్చుచున్నవి. ఇది కేవలము ఇప్పటికాలమందు ఆకస్మికముగా కలిగిన, కలుగుచున్న మార్పు కాదు. ప్రాచీనకాలమందు ఇట్టిదానికే 'దేశీపద్ధతి' యని పేరు. అంతవరకు ప్రాతదైయున్న పద్ధతికి 'మార్గము'అని వారు పెట్టిన పేరు. 'దేశీ' పద్ధతి క్రమక్రమముగా జనులలో వ్యాపించి బలిసి విద్వాంసులనుగూడ లొంగదీసి,కొన్నాళ్లకు మడి గట్టుకొని 'మార్గ' మనిపించుకొని విశ్వామిత్రునివలె గెలిచి నిలుచును. ఇది ప్రతివిద్యయందును అనాదిగా సహజముగా జరుగుచున్న మిశ్రణప్రవాహము. తంజావూరిలో మహారాష్ట్రప్రభువులు రాజ్యము చేసిననాళ్లలో ఆనాటి హిందూస్తానీపలుకుబళ్లు ఎక్కువప్రోత్సాహమును గడించి కర్ణాటకములో మిశ్రమై నిలిచియున్నవి. మనలో జావళ్లు అనబడు జనరంజకములగు చౌకరకపు మెట్లు కడచినశతాబ్దమందు అడ్డు ఆక లేక ప్రబలుట కిదే ముఖ్యకారణము. యమునా కల్యాణి, హమీరు, హుసేని, బ్యాగు, నవరోజు మొదలగు అనేకరాగములు మనలో

నిలుకడగా నిలిచి కర్ణాటకగౌరవము నందుచుండుట యీమార్గముననే. ఇట్లే వెనుక ఎప్పుడో మనలో వచ్చి చేరిన 'కాపి' రాగము కాలక్రమమున కర్ణాటకకులముతో కలిసి ప్రాతపడిపోగా ఆరాగములో త్యాగరాజు రచించిన 'మీవల్ల గుణదోషమేమి' మొదలగు కృతులను ఇటీవల క్రొత్తగా వచ్చిన 'హిందూస్తానీ కాపి' యనబడు వింతరాగమునకు త్రిప్పుకొని పెద్దపెద్ద కర్ణాటక విద్వాంసులే సభలలో ఇప్పుడు పాడుచున్నారు! ఇన్నాళ్లును జావళ్లకును తిల్లానలకు మాత్రము పనికివచ్చుచుండిన 'కాపి' యిప్పుడు కృతుల అంతస్తు కెక్కుచున్నది!

కాబట్టి ఇది తెలుగుజాతియందు మాత్రమే కలిగిన సంకరముకాదు. కొద్దిగనో గొప్పగనో దక్షిణదేశమందెల్ల ఇది సంభవించినది. మరి తక్కినవారికంటె తెలుగువారిలో ఇది యెక్కువయని చెప్పినప్పుడు నిజమని ఒప్పుకొనవలసి యున్నది. కారణములు మొదటే చెప్పితిని. ప్రాచీన విజయనగర సామ్రాజ్య సంప్రదాయములనే అన్నివిధాల ముందుకు తెచ్చిన తంజావూరు, మధుర, తిరువాన్కూరు, మైసూరు మొదలగు సంస్థానముల రాజులును వారి ననుకరించు ప్రకృతులును ప్రజలును పోషించి గౌరవించుటచే ఆ సంప్రదాయములు నేటికికూడ పూర్తిగా నశింపక పైప్రాంతములలో కర్ణాటకపద్ధతి యింకను ప్రాయముగల్గి పోరాడుచున్నది. హిందూస్తానీపద్ధతి తెరలు తెరలుగా వచ్చి నిలిచి యెదిరించినను దానికి కర్ణాటకవేషము వేసి తనకట్టుదిట్టములకు లోపరచుకొనజాలుచున్నది. లోపడక పెనుగులాడు తుంటరివరుసలను ధైర్యముగా ఉదాసీనదృష్టితో జూచుచు దూరముగా నుంచ ప్రయత్నించుచున్నది. ఏమి కారణమోకాని తెనుగుదేశమందు దాక్షిణాత్య గానకళకు బలము సమకూడలేదు. లలితకళలలో నెల్ల తెలుగువారు నాకు జూడగా కవిత్వమున కిచ్చినంత ప్రోత్సాహము, చూపినంత గౌరవము తక్కిన దేనికిని ఇయ్యలేదు; చూపలేదు. కనుకనే కవిత్వము వృత్తిగాగలవారు పద్యరచన చేయుటకు సహజముగా నిర్భయముగా చేయివేయగలవారు, వారిని గౌరవించు దాతలు తెలుగువారిలో నున్నంతమంది మరి యెందును నాయెరుకకు రాలేదు. అంతటి యభిమాన శ్రద్ధలను ఆంధ్రులు సంగీతమందును చూపియుండిరేని ఇదివరలో కర్ణాటకపద్ధతి భరతఖండమునెల్ల ఆక్రమించి యుండెడిది. కర్ణాటక సామ్రాజ్యమును దానిమహోన్నతదశలో ఏలినవారు తెలుగువారు. కర్ణాటకగానకళకు జీవగర్రలవంటి త్యాగరాజు క్షేత్రయ తీర్థనారాయణయతి మొదలగు వాగ్గేయకారకులు వందలకొలది తెలుగువారు; నేటి స్వభాషాభిమానులెట్లు తలచినను గానమునకు పనికివచ్చుభాషలలో తెలుగువంటిది ఇప్పటికి మరియొకటి లేదు; ఇంత యున్నను అచ్చతెలుగు దేశమున స్వదేశీయగానకళకు ప్రచారము దుర్బలముగా నుండుట వింతకదా! ఇది సామాన్యుల మాటకాని విద్వాంసులమాట కాదు. తక్కినవారితో పోల్చి చూచినప్పుడు తెలుగు గాయకవిద్వాంసులు చాల కొద్దిమందియే; కాని వారెవరును పాండిత్యమందుగాని పద్ధతిపారిశుద్ధ్యమందుగాని ఇతర విద్వాంసుల కెవరికిని కసినము తీసిపోవువారు కారు. శ్రీదోరం వెంకటస్వామినాయుడుగారివంటి

వారి మహోదారరచనలందును హిందూస్థానీసంకర మున్నదని కొందరు తలచుట నాకు జూడగా అనాలోచితపుమాట; ఎందుకనగా, నాదపవిత్రత హిందూస్థానియందును, నడకపరిశుద్ధి కర్ణాటకమందును ప్రధానశక్తులుగా నేర్పడి వాని కొకవ్యక్తివిశేషము నిచ్చుచున్నవి. కాని కర్ణాటకమందు అపస్వరములును హిందూస్థానియందు అవలయమును దోషములే యగును. కనుక హిందూస్థానిరుచి నెరిగి పరిశ్రమించిన కర్ణాటకవిద్వాంసులందు - నాగసపులవారగు కీ. శే. బిడారం కృష్ణప్పగారి పాటయందువలె - నాదపారిశుద్ధ్యమును, రచనలలో నెమ్మదియు ఎక్కువగా నుండును. అట్లే కర్ణాటకము చవి చూచిన హిందూస్థానిపండితుల యందును లయశుద్ధి స్పష్టముగా నుండును. నాయుడుగారు రెంటిని చాలదూరము సాధించిన ప్రతిభావంతులుగాన వారి కర్ణాటకపు వాయింపులో -- శ్రీ పరూరు సుందరరామయ్యరుగారి వాయింపునందువలె - నాదపరిశుద్ధి, నెమ్మదిగల చల్లనికల్పనలు ఎక్కువగా వెలువడును. అంతమాత్రమున అది హిందూస్థానిసంకర మనుట కర్ణాటకపు స్వరూపము తెలియక చెప్పుమాటయే కాని వేరు కాదు. అది యుండనిండు.

పవిత్రమైన కర్ణాటకశైలి మనపెద్దలు ఎన్నో వందల యేండ్లుగా సాధించి మన కిచ్చిన అమూల్యమగు లబ్ధి. దాని అగాధమైన ఆధ్యాత్మికమైన గాంభీర్యము, వైశాల్యము, వైవిధ్యము, లావణ్యము వీనిని అనుభవించి ఆనందించు నవకాశములు సామాన్యులగు తెలుగుగానరసికులకు కరవగుచున్నవి. ఇది చాల శోచనీయమగు విషయము. దీనిని సవరించుటకై ఆంధ్రమహాశయు లందరు పూని పనిచేయవలసియున్నది. హిందూస్థానినడకలు సులభముగా రక్తిని గలిగించునే, వాని నేల తిరస్కరింపవలయును? అని యడుగవచ్చును. ఈ 'రక్తి' అనుపదము చాల మెలకువతో వాడవలసినట్టిది; లేకున్న మనము మోసపోవుట నిజము. ఒకహిందూస్థానీయేనా, వారివారి సంస్కారమునకు తగినట్లు ప్రతి వస్తువును రక్తినీయగలదు. అట్లని అన్ని వస్తువు లిచ్చురక్తియు ఒకటే రక మగునా? అందులో తరతమభావములు లేవా? చిన్నబిడ్డలు చేతికి దొరకిన రాళ్లు రప్పలతో ఆడుకొని తృప్తిపడుదురు. వారి కంతకంటె మంచి ఆటసామాను లిచ్చి రుచిని, జ్ఞానమును పెంచుట మనధర్మముగదా? నిండిన చెరువు చూచినప్పుడు చిత్తవికాస మున్నది. కాని అంతటితో తృప్తిపడి జన్మమం దొకసారియైనను సముద్రమును చూడనివాని బ్రదుకు అల్పముగాదా? అట్లు ఉత్తరదేశమువారు నాటరాగమును తెలుగువారినుండి యెరువు తీసికొని దానిని చౌకపరచి 'తెలంగ్' అని పేరు పెట్టి ఆరాగములో 'శ్యామసుందర మదనమోహన'వంటి పాటలను రచించి మనకు వినిపింపగా, మనము విని రక్తిపడవచ్చును; పాడి సంతసింపవచ్చును; కాని అంతకే చాలించుకొని అసలు నాటరాగమునే మరచిపోతిమేని మనగానరసికత ఎందుకు తరమైనది? కమాసు రక్తిరాగమే కాని దానికి మూలమైనది 'రాగంబులలో గాంభీర్యము గల రాగము కాంభోజియే' అని మనమే చూపి చెప్పుచుండినమాట యిప్పుడు మరచుట తగునా? పైకాంభోజిని ఒకానొకకాలమున మనదేశపు ఎరుకలవారుగూడ క్రొత్త విన్యాసములతో పాడుచుండగా విని, ఇతర

కర్ణాటకగాయకు లందరు దానిరక్తిప్రవాహమునకు పరవశులై, కృతజ్ఞతతో 'ఎరుకల కాంభోది' యనియే పేర్కొని కన్నుల కద్దుకొని పూజించిరిగదా. తెలుగు తెలియని వారు తరువాత కొన్నాళ్లకు దానికి 'యదుకుల కాంభోజి' యని గీర్వాణీకరణము చేసిన మాట యట్లుండ నిత్తము. దానిని మన మిప్పుడు పల్కరింపక దాని ఛాయారూప మనదగు 'తిలక్ కామోద్' రాగము పాడుకొన్నంత మాత్రమున మనలో నిజమైనరక్తి నిలిచినట్లాయెనా?

కాబట్టి వస్తువు సులభమైన కొల్ల ప్రాయశః దానివలన గలుగురక్తియు పలుచనగానే యుండును. ఎప్పుడో ఎవరికో కొందరికి ఆకస్మికముగా తప్ప అందరికిని గొప్పరుచులు సులభముగా దొరకవు. అట్లని ఎంతకష్టపడిన అంతరక్తి చిక్కునని చెప్పరాలేదు. అట్లు గూడ భ్రమించి చెమటలోడ్చువారు సంగీత ప్రపంచమందు లేకపోలేదు. మరేమనగా, రంజకవస్తువులలో సౌలభ్యముగూడ ఉండిన మేలేకాని, సులభమగు వస్తువు లోనే రక్తిని వెదకుచుపోయినయెడల అంతకంతకు అల్పతృప్తిపడవలసివచ్చును. అల్పతృప్తి కళాప్రపంచమందు సంస్కారిలక్షణము గాదు, మరి సోమారిలక్షణము.

---



# కొత్తబంతులు

శ్రీ డాక్టరు అప్పరాజు శేషగిరిరావు

'కారు పాలిష్ పూర్తి అయిందా? రంగా!'

'పెద్దబ్బాయిగారు నానాతిప్పలు పెట్టుతున్నారండి. ఇంకొక్క అగంటలో పూర్తి అయిపోతుంది, బాబు.'

'హార్న్‌కు రంగు వేశావా?'

'వేశానండి. లేసు అల్లీ బల్లక్రింద ఉంచానండి.'

'ఊఁ త్వరగా కానీ, యివాళ ఆదివారం కూడాను. కాస్త పెందలాడే వెళ్ళాలి.'

'చిత్తం!'

'సుందరీ!'

'.........'

'సుందరీ!'

'ఆఁ......'

'కాస్త త్వరగా రావాలి.'

'ఎందుకో' అన్నది — అంతఃపురంలోంచి.

'ఎందుకో! అక్కడనుంచే సమాధానం చెప్పక పోతే, కాస్త వంటింట్లోంచి కాలు బయట పెట్టే ఏమి పోయింది?'

సుందరి అప్పటికీ రాలేదు. గదిదొడ్డిగుమ్మము దగ్గర కెళ్ళేటప్పటికి బాదంచెట్టుక్రింద నించొని ఉంది. ప్రక్కన మోహన్ చెట్టుమీదకు చూస్తూ కిలకిల నవ్వుతూ వున్నాడు.

నేను పడుతున్న ఆదుర్దా తన కేం తెలుస్తుంది? ఆరోజు ఆదివారం. మా కాస్మాపాలిటన్ క్లబ్బు ఆఫీసర్లు కాస్త పెందలాడే వస్తారు.

తక్కిన ఆరురోజులకంటె ఆరోజు కొత్త లైఫ్ యెక్కువ వుంటుంది—క్లబ్బులో. పైపెచ్చు ఆరోజు కొత్త టెన్నిస్ బంతులు వేస్తారుకూడాను. కొత్తబంతుల రోజున క్లబ్బుకు పండగ వచ్చినట్లుంటుంది. టెన్నిసే అన్నమాటేమిటి? 'కొత్త' అనేది యేదైనా సంతోషాన్ని యిస్తుంది—కొత్తవస్త్రం కానీయండి, కోటుకానీయండి, నెహ్రూ బోర్డరు ఖద్దరు పంచె కానీయండి, నేలంచు వుత్తరీయం కానీయండి— 'కొత్త' అనే పదంలోనే వుంది ఆ మహాత్మ్యము, ఆమోజు.

ఇక కొత్త టెన్నిస్ బంతులతో ఆడటంలో ఉండే ఆనందం ఆ టెన్నిస్ ఆటగాళ్ళకే అనుభవవేద్యం. ఇతరులు వూహించనూ లేరు, చెప్పినా గ్రహించనూ లేరు! ఆ కొత్తబంతులు చూస్తే, స్పృశిస్తూవుంటే, యేమేమిటో జ్ఞాపకంవస్తాయి, మనస్సు ఎక్కడెక్కడనో విహరిస్తుంది.

అదీగాక ఆ కొత్తబంతులతో ఆడే వుత్సాహం ఆ ఒక్కరోజే, ఆ కాసేపే! ద్విగుణీకృతోత్సాహంతో, మామూలుకంటె పదేళ్లు చిన్నవాడినై, మామూలుకంటే యెక్కువ జవసత్వాలతో, యెక్కువ పట్టుదలతో, ఆబంతి తెలుపు విరిగేవరకు, ఆ గట్టితనం కరిగేవరకు, యెక్కడలేని ఆవేశంతో మూడు, నాలుగు ఆటలు ఆడగలవు. అంతే! ఆతర్వాత మామూలు ఆటే! మామూలుపాటే! మళ్లా నాల్గో రోజునగాని ఆవుత్సాహం రాదు. ఈ మధ్యనున్న రెండు రోజులూ రెండు సంవత్సరాలన్నరలాగ తోస్తుంది! ఇదీ వరస! వరస తప్పని వరస.

ఆ కొత్తబంతుల రోజున నామనఃస్థితి, ఆవేగము మా సుందరి కేం తెలుస్తుంది? ఆవంటయిల్లేమో! ఆపిల్లలేమో! ఆమోహనుని పెట్టుకొని- చెట్టుక్రింద నించొని కాకులను చూస్తున్నది. పిలిస్తే 'ఎందుకో' అని సందేహాన్ని ప్రశ్న రూపకంగా ప్రకటిస్తోంది. కాలం వురుకులూ, పరుగులూ పెడుతోంది. అసలు నేను నిద్రలేవటమే ఆలస్యమయింది. నా డ్రెస్ అందిద్దామనీ, ఆ ఫల హారం ఇదీ కాస్త త్వరగా యిచ్చిలేన మమ కేమో

తను తీసుకొని నన్ను త్వరగా పంపించాలనీ ఆమెకు ఆదుర్దా ఉంటేగా! మళ్లా పిలిచాను. పెద్దగా పిలిచాను.

'సుందరీ!'

'హూఁ! హూఁ!'

'ఏమి టాహూఁన్నూ, హాఁన్నూ, నేను అర్జంట్‌గా వెళ్లా లంటుంటే!'

'వెళ్లండీ. మిమ్మల్ని నే నేమన్నా పట్టుకు ఆపేశానా?' అంటూ వచ్చింది, నవ్వుతూ, గజానికి నాల్గడుగులు మోపుతూ గజగమనంతో.

'నా డ్రెస్సు?'

'దొరగారు లేచేటప్పటికి సిద్ధంగా వుండాలని ఆ బల్లమీదే వుంచాను. చూస్తేగా! నిద్రలేచినప్పటి మంచి వొకటే హడావిడి! పైగా దృష్టి పేపరుమీద వుంది, నోరు నన్ను పిలుస్తూవుంది, చొక్కా మడత బల్లమీద కూర్చొనివుంది. ఈ కాసేపూ పేపరు చదువు కొంటూ ఆలస్యం చేసుకోకపోతే, కబుర్లు చెప్పతూ డ్రెస్సు పూర్తిచేసుకోకూడదూ!' అంటూ వాచర్ ఆలస్యంగా పరీక్ష కాగితాలు రాసే స్టూడెంటుచేతిలో ఆన్సరుపుస్తకం లాక్కుంటున్నట్లు లాక్కొని పక్క కుర్చీలో కూర్చొని ఆఖరుపేజీలో టెన్నీసు సెట్టుకు వెనకగా నించున్న యిద్దరు యువతీయువకులబొమ్మ చూస్తోంది.

'అయితే! పరాయి ఆడదాన్ని పక్కన నిలుచో బెట్టుకొని ఆడటానికీ, గలిచి ఫోటోకూడా తీయించు కోటానికీ,యీమగాళ్లకి సిగ్గుగా ఉండదూ? ఈముల్లెక్‌ను చూడండి, యీ సెయిలర్ పక్కన నించొని యెట్లా ఫోటోలో పడ్డాడో!'

'టెన్నీసు కోర్టులో ఆ భావాలకూ, ఆ విచక్షతకూ, అవకాశమయితే లేదుగాని ఆ ముల్లెక్, ఆ మిసెస్ హూ్యా సెయిలరు, సరియైన అన్నా,చెల్లెళ్లూ.'

'అట్లాగా!'

'సరేగాని నన్ను చూడవద్దని పేపరు లాక్కొని నవ్వుచేసే పనేమిటి? ఎవరో ఎవరికో బుద్ధి చెప్పి ఏమిటో చేసినట్లు.'

పేపరు విసిరిపుచ్చుకుని, పందిరిమంచముమీదికి గిరాటేసింది. 'మంచం నాకోసం కాదు. మీకోసం' అన్నట్లు చప్పుడుచేస్తూ పేపరు మంచానికీ, గోడకీ మధ్య సందులోకి దిగజారింది.

చొక్కా తొడుక్కుంటూ పేపరులో ముఖ్య విషయాలు నెమరువేసుకుంటున్నాను — మార్క్లబ్బులో ప్లేయర్ చంద్రరావు బొంబాయిలో ప్రఖ్యాత ఆట గాడయిన గొజాను చాలావరకు క్రిందపెట్టి ఆఖరు సెట్టులో గొజా కరుకుదెబ్బలకు తట్టుకోలేక లొం, పోయాడనీ; అంతటి త్యాగి, అంతటి భోగి, అంతటి రోగి అంతటి స్వార్థరహితుడు, అంతటి దేశసేవాతత్పరుడు బోసు ఎక్కిన కాంగ్రెసుగద్దె దిగనంటూ మారాము చేస్తున్నాడనీ, కాంగ్రెసు పెద్దలు 'కాదు నాయనా యిది కూడద'ని బుజ్జగిస్తున్నారని.

ఇస్త్రీ మడత తెల్లటి మల్లెపూవులాంటి ఖద్దరు షర్టు సగంచేతులది, స్పోర్టింగు కాలరుది తొడుక్కొని

'సుందరీ!'

'.........'

'లేదు! మళ్లా వంటిల్లు చేరింది. ఈ గుండీ లెక్కడ తగలడ్డాయో?...అబ్బ!...నయమే! ఇక్కడే జాగ్రత్తచేసింది. బతికిపోయాం.'

గుండీలు పెట్టేసుకుని చేతులో దువ్వెన పట్టు కొని అద్దంలో చూచుకుంటూ 'ఈ జుట్టుకు మా ఆవిడ గుణమే వచ్చింది. ఒక తీరాన లొంగదు. దువ్వగా దువ్వగా గాని అణగదు' అనుకుంటూ తల డ్రెస్సు చేసుకుంటున్నాను. ఇంతలో అద్దంలో మా సుందరి ప్రత్యక్షమయింది — ఒక చేతిలో పిండిపళ్లెమూ, ఇంకో చేతిలో కాఫీకలశమూ పట్టుకుని.

'ఊఁ! రావాలె! త్వరగా రావాలె!'

'అహ! యేమి టా చమత్కారం, వస్తాం టే నే. నడిచి రావాలా లేకపోతే ఇంట్లోకూడా కారెక్కి తిరగాలా!' అంటూ ఆ ఫలహారమూ, కలశమూ టేబిల్‌మీద పెట్టింది. నాకు వెళ్లాలన్న ఆదుర్దా యెక్కువగా వుంది.

'రిస్టువాచీ! నా రిస్టువాచీ యెక్కడుంది?'

'మీరంతా తమాషాఅండీ! మీ వాచీ మీ పర్సూ అన్నీ నా అధీనంలో వుంటున్నట్టు! మీవి ఏవేవి యెక్కడెక్కడుంటున్నయో నాకెట్లా తెలుస్తుంది?'

'తెలుసుకోవాలె!'

'చిత్రం! తెలుసుకోవాలె! నా అప్పడాల కర్ర యెక్కడుందో చెప్పండి. ఇప్పుడు నాకు కావాలి.'

'అట్లాగే! అట్లాగే వాదన! పగే రాత్రి తీరికగా కూర్చుని మాట్లాడుకుందాంగాని, నా పంట్లాం! నా పంట్లాం యేదీ?'

'అదేం వంకేన కనబడుతూవుంటేనే యెదురుగా.'

'అది పనికిరాదు.'

'ఇంకో మాయందే.'

'అబ్బా! యీ ప్రశ్నలకు జవాబు చెప్తుంటే అక్కడ ఆటకాస్తా అయిపోతుంది.'

'యేకాస్తా?'

'కొత్తబంతులతో ఆట. నీకేం తెలుస్తుంది అంగులోవున్న పరదా! అందుకోసే యివాళ సూటూ అదీ కొత్తది వుండాలనే నే నిందాకటినుంచీ అనుకునేది.'

'మరి నాకేం తెలుస్తుంది - మీ రనుకునేది? అయితే తెస్తావుండండి. బీరువాతాళంచెవులతో హనుమ యిందాకట్నించీ ఆడుతున్నాడు. యెక్కడ పారేశాడో యేమో' అనుకుంటూ వెతుకుతోంది. నేను బల్లముందు కూర్చున్నాను ఫలహారం చేద్దామని. అప్పటికే మా మోహాన్ బల్లమీద కైతాయించి 'కాం, కాం' అంటూ పచ్చిమిరపకాయముక్కలన్నీ ఉప్మాలోంచి యేరి క్రింద పారేస్తున్నాడు.

'హనుమా! రా! కాఫీ తాగుదుగాని.'

'వొస్తున్నా! నాన్నా! బొమ్మలు దాస్తున్నా.' అంటూ చేతిలో చిల్లపెంకూ వాడూ తయారయ్యాడు హనుమ.

'సుందరీ! ఉప్మాలో జీడిపప్పు వెయ్యలేదేం?'

'వెయ్యకేం! పైగా జీడిపప్పంతా యేరి మీ ప్లేటులోనే వేశాకూడాను.'

'జీడిపప్పు కమ్మంది నాన్నా!'

'ఛీస్! ఇంకేం! జీడిపప్పు హనుమకు నివేదన అయిందిలే. ఊ! కాఫీ తాగటంకూడా పూర్తయింది. ఆ పంట్లాం యేవేళకి వచ్చేటట్లు లేదే. ఊ! త్వరగా!'

'ఉండండి మరి, వెతుకుతున్నా. పంట్లాం, పంట్లాం అని అట్లా కేకలేస్తే పంట్లాని కేమన్నా కాళ్ళున్నయా నడిచిరావటానికి!'

'లేకేం! సరిపోయింది నేను పడే తొందరకి జరిగే ఆలస్యానికీ! మా డుమ్మాప్పు అయిపోయింది. నాలుగింటికల్లా టెన్నిసు ప్రారంభిస్తారు. మొదటి సెట్టులో ఆడకపోతే కొత్తబంతుల మజా అనుభవించనట్లే లెక్క.'

'కారులో యెంతసేపటికి వెళ్తారు, అయిదు నిమిషాలన్నా పట్టదు. ఊరికే హడావిడి. సొంతపెళ్లి కొడుకుకైనా వుండదు యింత తొందర.'

'ఏమో పెండ్లికూతురికి చాలా జ్ఞాపకశక్తి పెట్టాడు భగవంతుడు. నేను మరచిపోయి ఆరేళ్లయింది.'

'చాల్లెద్దురూ! మనమాటేమిటి, నేను మాట వరసకి అంటే.'

'కొత్తపంట్లాం కనపడనట్టేనా?'

'కొత్త పంట్లాం లేదు. అయినా మీరు యీ మధ్య కొత్తవి కుట్టించుకున్నట్లు లేదే!'

'అది కాదు. చాకలి తెచ్చింది.'

'సరిపోయింది. ఇందాకట్నించీ మీరు హడావిడిపడేది చాకలి తెచ్చినదానికోసమేనా? కొత్తది కొత్తదంటూ నన్ను చంపుకుతిన్నారు. అయితే యిదిగో!'

'ఊ. మరి రిస్టువాచీ?'

సుందరి తల పైకెత్తి చూచి 'బలేవారండీ మీరు. గడియారం చేతికి పెట్టుకొని వెదుకుతున్నారూ?

మీలాంటివారు పురుళ్ళలో బిడ్డను పెట్టుకొని ఊరంతా తిరిగిందట !'

'మధ్యాహ్నం చేతికి పెట్టుకొనే నిద్రపొయ్యేను కాళోలు ?'

'రంగా ! కొత్తరకెట్టు కారులో పెట్టేవా?'

'చిన్నబ్బాయిగారు ఆడుకుంటున్నారండీ.'

'సుందరీ! వాడిచేతిలో రకెట్టు మెల్లిగా తీసుకో.'

'వాడు నా కియ్యడు, మీరే — అడగండి.'

'మోహన్ నీవు మంచివాడివి. రేటు యిస్తావూ' అంటూ వాడివైపు చేయి జాచాను. ఉహూ అంటూ మూతి యింత పొడుగున పెట్టి యింకో చేయి జాచాడు ఎత్తుకోమన్నట్టు. వాడిని ఎత్తుకొని ముద్దాడి మెల్లిగా రకెట్టు లాక్కుంటూ 'చూచావా, మరి లాలిస్తే పిల్లలెట్లా లొంగిపోతారో.'

'ఆడవాళ్లు కూడానూ !'

మోహన్ని దింపి రకెట్టు తీసుకొని బయలుదేరి పోతూ 'యివాళ కొత్తరకెట్టు, కొత్తబంతులు !!!'

'ఆ! ఏమిటో! కొత్త, పాత' అంది ఆవిడ, కొత్త పాతలను యీసడిస్తూ వేదాంతశైలిలో.

'సుందరీ! కొత్తంటే అందరికీ సంతోషమే, ఔనా? నాకూ అంతే. ఒక్క విషయంలో తప్ప నాకు కొత్తంటే సరదా.'

'ఏమిటో ఆ ఒక్క విషయమనూ ?'

'అంటే చూడు- కొత్తబట్టలు, చీరలు, జాకెట్లు కుర్చీలు, కొత్తగా పుట్టిన పిల్లలు, యివన్నీ మనకు సంతోషదాయకాలు. ఔనా కాదా ?'

'అవును లెండి. ఆ కొత్తదనం అక్కరలేని పాత దేదో చెబుదురూ !'

'అదా! ఇట్లా రా చెబుతా.'

'ఆ! ఏమిటో ?'

'పెండ్లాము, భార్య, చేసుకున్నది, ప్రియురాలు, ముద్దరాలు, ముద్దుగుమ్మ, యిల్లాలు, పిల్లలతల్లి- తెలిసిందా ?'

'ఊ! చాలు, ఊరుకోండి! మాటకో ముద్దారేమిటి- ఊపిరి సలపకుండాను. కందిపోయినై చూడండి బుగ్గలు. ఏమి టా మోటుతనం!'

'పోనీలే యిక నిన్ను ముట్టుకుంటే ఒట్టు.'

'ఉహూ ! ఏమి టా మాటలు !'

ఈలోగా 'నాన్నా నేను క్లబ్బుకి రావొద్దూ!' అని యింతిపొడుగున దీర్ఘంతీసుకుంటూ నా కాళ్లు చుట్టేసుకుని నా పాదాలమీద పాదాలు మోపి మోకాళ్లమీంది నిచ్చెనమెట్లెక్కినట్టు పైకెగబాకుతున్నాడు హనుమ, పెట్టినపేరు సార్థకపర్చుకుంటూ.

'చూడూ! వీడిని తియ్య కొస్త.'

ఆవిడ అద్దంలో ముంగురులు సవరించుకుంటూ 'రారా' అన్నది.

వాడు ఆ మాత్రానికే వెళ్లిపోతాడూ! నాచెయ్యి అందిచ్చాను. చంటికొడుకు, మరి దిగడే! 'ఉండు నాన్నా' అని వాడికో రెండణాలబిళ్ళ రెండు చిన్న ముద్దులూ లంచం యిచ్చుకొని మెల్లిగా మరిపించి రోడ్లో కారు షెడ్డుదగ్గిరికి బయలుదేరాను. సుందరి నావెనకాలే నన్ను సాగనంపటానికా అన్నట్లు వస్తోంది. రిష్టువాచీ ముల్లు 3-30 చూపించుతున్నది. కొత్తబంతులతో ఆడాలన్న ఉత్సాహం నాలో తీవ్రంగా పరుగులెత్తుతున్నది. ఎందుకో సుందరి నావంక చూచి విరగబడి నవ్వుతోంది. ఎందుకని నేను అడిగలేదు. పెద్దవాడు అప్పుడే ముందుసీట్లో కూర్చుని చిన్నవాణ్ణి చెయ్యి అందిచ్చి పైకి చేర్చుకుంటున్నాడు. చిన్నవాడు నన్ను చూచి 'నాన్నా! కా...తా'

'అంటే!'

'అంటే— కా రెక్కుతా— అన్నమాట' అని మారుపలికింది, మా కోకిల.

రంగడు రెండో వేపున యింకా కారు పాలిష్ గుడ్డతో తుడుస్తున్నాడు. నేను కారుతలుపు తెరుస్తూ 'యీ తలుపునిండా బురదమచ్చలూ పిచ్చిగీతలూ ఏమిట్రా రంగా?'

రంగడు తెల్లమొహంవేసి 'ఏమోనండి! నే యీ వేపు తుడుస్తున్నాను. అబ్బాయిగోర్లు ఆవేపునించి యెక్కొచ్చారండి.'

ఆ చిట్టిచేతులు మా మోహన్ వేగాని ఆ గీతలు కొంచెం పెద్ద ఆర్టిస్టువే.

'హమ్మా! మువ్వేనా గీసింది యీగీతలు?'

'నేనే నాన్నా! బొమ్మలు డాడా. ఇది నవ్వూ ఇది అమ్మా. హి! హి! హి!' అంటూ తలుపుదగ్గిరకి వచ్చి చూపించాడు.

మా ఆవిడ నవ్వుతూ — బాపిరాజు గారు మహా పెద్ద చిత్రకారు డంటారు గా మీరు! రేండీ, ఇంత కన్నా బాగా వెయ్యగలరా మన బొమ్మల్ని?'

'అవునులే మన్నే మెచ్చుకోవాలి మనవాడిప్రతా పానికి. తీసికెళ్లు త్వరగా వాళ్లని. రంగా! నీపాలిష్ బండలు మునిట్లే వుంది గాని క్లబ్బుదగ్గిర పని పూర్తిచేసుకో వచ్చు కారు స్టార్టు చెయ్యి' అని నేను డ్రైవింగుసీటులో కూర్చున్నాను.

సుందరి మారంగా నుంచుని నవ్వుతూ వాళ్లను తీసుకువెళ్లదే!

'ఏమి టానవ్వు, నేను త్వరగా వెళ్లాలంటూ వుంటే!'

కారు ఇంజన్ స్టార్టు అయింది. ఆమె ఆదుర్దాగా గబగబా పరిగెత్తుకొచ్చి తలుపుమీద ఆనివున్న నా చెయ్యి పట్టుకొని 'వెద్దురుగాని ఒక్కసారి యింట్లోకి రావాలి' అంది మళ్లా నవ్వుతూ.

'చూచావా నాలుగయింది!'

'అవును లెండి ఒక్కసారి దిగండి. కావలసి నంత టైము వుంది దిగాలి. దిగకపోతే వొట్టే.'

'బాగానే వుంది' అని విసుక్కుంటూ స్విచ్ ఆఫ్ చేసి యింట్లోకి వచ్చాను.

'ఇట్లా రండి' అంది సుందరి - నిలువుటద్దంవద్ద నిలబడి.

వెళ్లాను—

'చూచుకోండి అద్దంలో'

అద్దంలో నన్ను నేను చూచుకొని నిర్ఘాంత పోయాను!

నా తెల్లటి చొక్కామైని బురద — మోహన్ చేతులకు సంబంధించినది; తెల్లని పంట్లాంమైని మసిమర కలు — పెద్దవాడి పాదాల బాపతు. అన్నిటికన్నా విశేషం—

నా మొహంమీద, బుగ్గలమీద ...నీలపు ... మచ్చలు!!

'సుందరీ! సరే యీ బురదా యీ మసీ యెవరి పనో తెలుస్తా నేవుందిగాని, నా మొహంమీద యీ నలుపులో క్లేమిటి?

'ఏమో' అన్నది ఆమె మొహం గోడవైపుకు తిప్పి.

'ఏమో ఏమిటి! చెప్పు మరి.'

'ఇప్పుడు చెబుతూ కూర్చుంటే మీకు టెన్నీసు వేళ మించిపోతుంది. అక్కడ బంతు లప్పుడే పాతబడిపో తవిగాని, ఇంకో పట్లాం చొక్కా తీస్తాను; మీరు మార్చుకుని త్వరగా దయచేద్దురూ.'

'కాదు చెప్పవూ?

'ఆ! యేముంది! నేను యివ్వాళే నీలపుకుంకం తెప్పించాను - బజారునుంచి'

'.....................'

నేను కుర్చీలో కూర్చుని జోడు విప్పబోతు న్నాను.... తెల్లటి టెన్నీసు జోడుమీద రెండు బుల్లి నల్లటి పాదాలు!!

ఆ పాదాలు చూస్తే ముద్దూ వచ్చింది - ఆ నల్ల రంగు చూస్తే వళ్లూ మండింది

'సరే చొక్కా, పంట్లాం మార్చుకొంటాను మరి యీ పూజాగతి యేమిటి? మధ్యాహ్నం స్నానంలో వేస్తే సాయంత్రానికి గాని ఆరదాయెను.

'పరవాలేదు లెద్దురూ. ఏమంత మాసిపోయినై యేమిటి? అయినా స్వంతడ్రైవింగు కాబట్టి స్వంత క్లీనింగు చేసుకున్నారేమో అనుకుంటారులెండి క్లబ్బులో, కానీండి త్వరగా తెమలండి.'

'అయితే డ్రైవింగూ, క్లీనింగూ ఒకరకం పనులేనా ?'

'కాకేం! రోజూ వంట చేసి అవసరమైనప్పుడు అంట్లు తోముకోటం లేమా నేను.'

'.................'

టించర్‌గా సరిపోయినట్లుంది — సమాధానం. క్లబ్బూ, కొత్తబంధువులూ ఒక్కసారి మాయమయినయి వాదృక్పథంనుంచి. 'శభాష్! సుందరీ! మెస్సీ సంతా 'మసి'అయిపోయిందిగాని, ఆనీలపుష్పంకం యింకా కొత్త ప్రొద్దుగాని రా....



శ్రీమతి అంకాల అరవిందకన్యగారు

ఈమె సుప్రసిద్ధాంధ్రచిత్రకళాకోవిదులగు శ్రీ అంకాల వేంకటసుబ్బారావుగారి జ్యేష్ఠపుత్రిక. శ్రీ రావు సాహేబు కోకా అప్పారావునాయుడు, బి. ఏ. బి. ఎల్ (శ్రీకాకుళము)గారి మేనకోడలు.

ఈమె మొన్నటి డిసెంబరు నెలలో జరిగిన హయ్యరు ఫ్రీహ్యాండు టెక్నికల్ టీచర్సు సర్టిఫికెట్టు పరీక్షలో ప్రథమశ్రేణిలో కృతార్థురాలైనది చిత్రకారుని పుత్రిక యనిపించుకొన్నది. 'పెయింటింగు' లోయరుపరీక్షలోకూడ ఈవత్సరము కృతార్థత నందినది. వయస్సు ౧౮ సంవత్సరములు.

# బెనిటో ముస్సోలినీ

శ్రీ అకుండి వెంకటేశ్వరరావు

ఇటలీనియంత, ముస్సోలినీ ఇటలీలో 'వరానో డి కోస్టా' అనే కుగ్రామంలో ౧౮౮౩-వ సం॥ జూలై ౨౯-వ తేదీని జన్మించాడు. ఈ ముస్సోలినీ వంశీయులు పూర్వకాలంనుంచీకూడా యుద్ధవీరులుగను, దేశాభిమానులుగను చాలా ప్రసిద్ధి పొందినవారు. ముస్సోలినీ తండ్రి, 'అలెశాండ్రో ముస్సోలినీ' కమ్మరంపని చేసేవాడు. కాని ఆకాలంలో రాజకీయసాంఘిక విషయాల్లో చాలా శ్రద్ధ తీసుకొని చాలా ఉత్సాహంగా పనిచేసేవాడు. ముస్సోలినీతల్లి, 'రోసా' చాలా విద్యావంతురాలు. అందుచేత పిల్లల ఉత్సాహమును కనిపెట్టి సముచితంగా విద్యాబుద్ధులను చెప్పుతూ, వారి యభిరుచుల కనుగుణంగా సహాయంచేస్తూండేది.

బెనిటో ముస్సోలినీ
(౧౮ ఏండ్ల వయస్సప్పుడు)

యుక్తవయస్సురాగానే ముస్సోలినీని, తమ గ్రామానికి రెండుమైళ్ల దూరంలోవున్న ఒక చిన్న బడిలో ప్రవేశపెట్టారు తల్లిదండ్రులు కాని అతని దృష్టి ఎప్పుడూ ఆటపాటలమీదనే వుండేది. తోడిబాలురందరికీ ఇతనంటే అయిష్టంగా వుండుటచేత, తరుచుగా వారు ఇతన్ని, వారిలో కాని కొట్టడానికి ప్రయత్నించేవారు. కాని ముస్సోలినీ ఒక్కడైనా వాళ్లందరికీ తగిన సమాధానం చెప్పేవాడు. తరుచుగా ఇతనికి దెబ్బ లెక్కువ తగిలినా, ఎవ్వరితోనూ ఫిర్యాదు చేయకపోవడం కాకుండా, అటువంటి దెబ్బలాటలంటే చాలా సంతోషంగావుండేది ఇతనికి. తరువాత కొంత కాలాని కతడు గ్రామస్కూల్లో విద్య పూర్తిచేసి హైస్కూల్లో ప్రవేశించాడు. ఇక్కడకూడా చదువు సంస్థలు తక్కువైనా, మంచి ప్రపంచజ్ఞానమును, కట్టుదిట్టమైన క్రమశిక్షణమును బాగా అలవరుచుకున్నాడు. ప్రతిరోజూ తన తండ్రితోకూడా పోయి, అక్కడ కర్మాగారంలోని యంత్రములనుగూర్చి, అవి పనిచేసే విధానమునుగూర్చి మంచి ఉత్సాహంతో నేర్చుకున్నాడు.

మొత్తంమీద ముస్సోలినీయొక్క విద్యావిషయంలో, అతని తల్లిదండ్రులకి తృప్తికలుగలేదు అందుచేత అతన్ని స్కూలు టీచరు ట్రైనింగు చదవటానికి 'ఫార్లింపోపోలీ' అనే పట్టణానికి పంపించారు. అక్కడకూడా అతడు అల్లరిచిల్లరిగానే తిరుగుతూ వుండేవాడు; కాని, ఏదో విధంగా 'డిప్లమా' సంపాదించాడు. మరునాటినుంచే ఉద్యోగప్రయత్నాలు ప్రారంభించాడు. అనేకదినములు తంటాలుపడి ఒకస్కూల్లో ఉద్యోగం సంపాదించాడు. ఒకసంవత్సరం గడిచింది. వేసంగి సెలవు లిచ్చారు. కాని ముస్సోలినీదృష్టి ఇంటిమీదికి పోలేదు. చుట్టూ వున్న విశాల ప్రపంచం అతని దృష్టిని ఆకర్షించింది. దేశసంచారం చెయ్యాలని బుద్ధి పుట్టింది ఇతనికి. ముస్సోలినీ చిన్నప్పటినుంచీకూడా తన మనోనిశ్చయానికి వ్యతిరేకంగా నడిచేవాడు కాదు.

దగ్గిరడబ్బు బహుస్వల్పంగా వుంది, కాని ముస్సోలినీ తన మనోనిశ్చయాన్ని మార్చుకోలేదు. తక్షణం స్విట్జరులాండు దేశం ప్రయాణంకట్టాడు. దారిలో అనేక అవస్థలు పడ్డాడు. స్విట్జరులాండు ప్రవేశించగానే అతని కష్టాలెక్కువయ్యాయి. అనేకదినములు జీవితం దినదిన గండముగా గడిపాడు. చివరకి కొంతకాలం కూలిపని చేసి కాలం గడుపుకున్నాడు. పత్రికలకు వ్యాసములు వ్రాసేవాడు. ఈకాలంలోనే రాజకీయములలో ఎక్కువ జోక్యం కలుగచేసుకొని ఉత్సాహంగా పనిచేసేవాడు. రాజకీయ సంబంధములైన గ్రంథాల నేకము చదివి మంచి రాజకీయార్థికజ్ఞానం సంపాదించుకున్నాడు. సమయం దొరికినప్పుడల్లా ప్రజాసంఘములలో ప్రముఖ పాత్ర వహించి, అనేక సభలలో ఉపన్యాసా లిచ్చేవాడు. ఇతని ఉపన్యాసాలన్నీ ప్రజాభిమానంతో, రాజకీయ విషయములతో, ఉద్రేక పూరితంగా ఉంటంచేత, ప్రభుత్వంవా రతనిని ఆదేశమునుంచి వెళ్లిపోవలసినదిగా ఆజ్ఞాపించారు.

మర్నాడే మూట ముల్లె కట్టి స్వదేశం చేరుకున్నాడు ముస్సోలినీ. బంధువులు స్నేహితులు, అతనికి ఆదరపూర్వకమైన స్వాగత మిచ్చారు. అప్పుడు నిర్బంధ సైనికవిద్య అమలులోవుంది. ముస్సోలినీయొక్క మనస్సుకూడా సైనికవిద్య, సైనిక జీవితముల మీదకి మళ్లింది. తక్షణం 'వెరోనా' పట్టణంలో సాధారణ సైనికుడుగా ప్రవేశించాడు. అతడు సైన్యసంబంధమైన ప్రతీ విషయములోనూ, మాటలలో క్రియలలో కూడా అమితమైన ఉత్సాహమును, తెలివిని ప్రదర్శించి, అధికారులకు విస్మయం కలిగించేవాడు. ముస్సోలినీ తన సైనిక జీవితకాలంలో, శిక్షణమునుగూర్చి శ్రద్ధతీసికొని సైనికుని ప్రధానలక్షణ లక్ష్యములను బాగుగ గుర్తించి, వాని ప్రాధాన్యమునుగూర్చి బాగుగా గ్రహించాడు. హఠాత్తుగా ఒకనాడు ముస్సోలినీకి తండ్రి వద్దనుండి, తల్లి మరణశయ్యపై నున్నదని, తక్షణం రావలసిందని టెలిగ్రాము వచ్చింది. ముస్సోలినీ తక్షణం తన నాయకునిదగ్గిర శలవు తీసికొని బయలుదేరాడు. ముస్సోలినీ వచ్చేసరికి, అతని తల్లి కొనవూపిరితో వుంది; అతను వచ్చిన మరుక్షణంలో మరణించిం దా వీరమాత. ముస్సోలినీయొక్క దుఃఖానికి మేరలేదు. అతడు బయట ఎంత నిర్భయంగా సంచరించేవాడో, తల్లియెడల అంత భయభక్తులతో మెలగేవాడు. ముస్సోలినీ తన మాతృవియోగ దుఃఖసాగరంలోనుంచి అనేకమాసములకుగాని తెమిలి బయటపడలేకపోయాడు.

తరువాత ముస్సోలినీ, విధిలేక 'ఒనేగ్లియా'లో ఒక మిడిల్‌స్కూల్లో ఉపాధ్యాయుడుగా ప్రవేశించాడు. కాని కొద్ది కాలమునకే ఆవుద్యోగం వదిలివేసి, అప్పుడు 'పొపోలో' పత్రికా సంపాదకుడైన 'బాటిస్టీ'కి సహాయకుడుగా పనిచేశాడు. ఆ కాలంలో, ముస్సోలినీ తన పత్రికారచనాశక్తిని చాలా అభివృద్ధి సలుపుకొని అనేక రాజకీయ విషయములనుగూర్చి అనేకవ్యాసములను వ్రాశాడు. క్రమంగా అత డొకసోషలిస్టు పత్రికకు సంపాదకు డయ్యాడు. ముస్సోలినీ, పత్రికా సంస్థయొక్క మహాదాశయములను, ప్రభావమును పూర్తిగా గ్రహించి, దాని యభివృద్ధికి అనేక విధములుగ పాటుపడ్డాడు. ౧౯౧౨ సంవత్సరములో అతని ౨౯-వ యేట, 'మిలన్'లోని ప్రధాన సోషలిస్టు పత్రికయైన 'అవాంటి' (Avanti) కి ముస్సోలినీ డైరక్టరుగా నియమింపబడ్డాడు. ఈ సమయంలోనే ముస్సోలినీ తండ్రికూడా మరణించాడు. అతని సోదరుడు 'ఆర్నాల్డో' విద్యాభ్యాసమున కితర దేశములకు పోయాడు. సోదరి 'ఎడ్విజ్' అత్తవారింటికి వెళ్లింది.

ముస్సోలినీ ఉద్యోగానికి వచ్చిన కొద్ది మాసములకే 'అవాంటి' పత్రిక బ్రహ్మాండంగా అభివృద్ధిపొందింది. అందుచేత ముస్సోలినీ తనపార్టీలో మంచి గౌరవస్థానం ఆక్రమింప గలిగాడు. ప్రతీ విషయంలోనూ ముస్సోలినీ, తన నిష్పాక్షికమైన ఆత్మనిశ్చయానికే బద్ధుడయేవాడు కాని మాయమాటల కెప్పుడూ తలయొగ్గలేదు. ముస్సోలినీ భార్య 'రాచెల్' చాలా తెలివి కలది. భర్తకన్ని విషయములలోనూ చేయూత నిస్తూ, కష్టనష్టాలకు లెక్క చేయకుండా సంచరించింది. ముస్సోలినీకి 'ఎడ్డా' ఒక్కతే కుమార్తె.

ప్రపంచ యుద్ధపు గాడ్పులు మెల్లమెల్లగా వీస్తున్న రోజు లవి. ఇటలీ, ఎక్కడ చూసినా ప్రతిదినమూ

ఏదో విషమైన తిరుగుబాటులు, అల్లరులతో నిండివుంది. రాజకీయ తంత్రజ్ఞులు, తమతమ పార్టీబలాధికారముల కొరకు అనేక విధముల తాపత్రయం పడేవారు. పార్టీ బలంకొరకు ఎట్టి దురంతాలైనా చేయడానికి సిద్ధపడుతూ వచ్చారు నాయకులు. హఠాత్తుగా ౧౯౧౪ సం. ఆగస్టులో ప్రపంచయుద్ధం ఆరంభమైంది. అన్ని దేశములవారు ఆశ్చర్యపడ్డారు. వివిధదేశములలో ఈ యుద్ధదేవత వివిధగతుల తాండవించింది. స్థితిగతులు సమయానుకూలంగా గంటగంటకీ మార్పు చెందవలసి వచ్చేది. ముస్సోలినీ, తన 'అవాంటి' కార్యాలయంలో నుంచి యుద్ధవేషముల సంరంభము చూశాడు. వాటి సాంఘిక, ఆర్థిక వాతావరణమును, వివిధదేశముల రాజకీయ పరిస్థితులను తీక్ష్ణదృష్టితో చూస్తూ, ముస్సోలినీ ఇటలీకర్తవ్యమునుగూర్చి తనపత్రికద్వారా ప్రజలలో తీవ్రప్రబోధం కలిగించడం ప్రారంభించాడు. ఈ విషయములో ముస్సోలినీకి పార్టీలోని ఇతర సభ్యులకు భేదాభిప్రాయాలు బయలుదేరుటచేత, ముస్సోలినీ, తనవుద్యోగానికి సోషలిస్టుపార్టీసభ్యత్వానికి నీళ్లు వదలుకోవలసి వచ్చింది. ఇటలీ యుద్ధంలో పాల్గొనకూడదంటారు మిగిలిన సభ్యులంతా. ఇటలీ యుద్ధంలో పాల్గొనితీరాలంటాడు ముస్సోలినీ!

తనమనోభావాలను ప్రకటించటానికి పత్రికాసాధనం లేకపోవడంచేత, ముస్సోలినీ అనేకసభలను జరిపి, తీవ్రప్రబోధమును సాగిస్తూ 'ఫేసిస్టు' పార్టీ ఒకదానిని కట్టుకొచ్చాడు. తక్షణం కొందరు మిత్రుల సహాయంతో 'పొపొలొ డి ఇటాలియా' అనేపత్రికను స్థాపించి, ముస్సోలినీ తనయుద్ధప్రచారం ప్రారంభించాడు. కొలదిదివసములకే 'ఫేసిస్టు' పార్టీలో ఉద్రేకపూరితులు, ఉత్సాహవంతులు అయిన యువకులనేకులు సభ్యులుగా చేరారు. ప్రజలుకూడా చాలామంది ముస్సోలినీ అభిప్రాయములతో ఏకీభవించడం ప్రారంభించారు. ముస్సోలినీ ప్రయత్నఫలితంగా ఇటలీ యుద్ధమునకు సిద్ధపడింది. ముస్సోలినీ ఇటలీసేనలో అతిసంతోషంతో ఒకసామాన్యయుద్ధవీరుడుగా ప్రవేశించాడు. ముస్సోలినీ, ఎప్పుడు శత్రువును ముఖాముఖీగా ఎదుర్కొని, బాంబులవర్షంలో వీరవిహారం చేద్దామా అని తొందరపడేవాడు. యుద్ధంలో అతడు చూపిన ధైర్యసాహసములకు, బుద్ధికుశలతకు అధికారులాశ్చర్యపడి, అతన్ని క్రమక్రమంగా, ఒకసైన్యాధికారిగా చేశారు. ముస్సోలినీ ఆదినాల్లో అనేక అవస్థలు పడ్డాడు. నిద్రాహారాలులేక, జ్వరంతో బాధపడుతున్నా అతడు చేతిలో తుపాకీ విడువలేదు. 'పొపొలొ డి ఇటాలియా'కి వ్యాసములు వ్రాయడం మానలేదు. ఒకనాటియుద్ధంలో ముస్సోలినీకి గాయములు తగలడంచేత దగ్గర వున్న హాస్పిటలుకు పంపించారు అతన్ని. అప్పుడతని శరీరంలో అనేకచోట్లనుంచి ౪౪ ఇనపముక్కలు తీశారు డాక్టర్లు. క్రమంగా స్వస్థత కలిగినా, ముస్సోలినీ తిరిగి యుద్ధంలోకి వెళ్లటానికి వీల్లేకపోయింది; చాలాకాలం కఱ్ఱలసహాయంతో నడవవలసివచ్చింది. అందుచేత ముస్సోలినీ తనపత్రికా కార్యాలయంనుంచి, పత్రికాముఖంగానే నవయావచ్ఛక్తితోను యుద్ధం సాగించాడు.

యుద్ధం నిరాతంకంగా సాగుతున్నా దేశంలోని యుద్ధప్రతికూలపక్షంవారు ప్రచారం సాగిస్తూనే వున్నారు. ముస్సోలినీ తనపత్రికలో బాంబులవంటి వ్యాసాలువ్రాసి, ప్రజలలో యుద్ధాభిలాషను రేకెత్తించి, ప్రతికూలపక్షాలను నాశనంచేశాడు. చివరకి యుద్ధంలోకూడా ఇటలీ జయం పొందింది.

యుద్ధానంతరం ఇటలీ స్వదేశవ్యవహారములలో చాలా చిక్కులు బయల్దేరి, అనేకకష్టనష్టాలనుభవించింది. దేశంలో అనేకరాజకీయపక్షాలు, ప్రజాసంఘములు బయలుదేరి, పరస్పరము భేదాభిప్రాయాలు కలిగి అవి యుద్ధం ప్రారంభించాయి. ముస్సోలినీ తన 'ఫేసిస్టు'పార్టీసహాయంతో వ్యతిరేకపక్షాలమీదికి దండయాత్ర సాగించాడు. వివిధపక్షాలవారికి ఆయుధయుద్ధములు, ప్రతియుద్ధములుకూడా జరుగుతూ ఉండేవి.

౧౯౧౯-వ సంవత్సరం మార్చి ౨౩-వ తేదీని, మిలన్‌లో ముస్సోలినీ యాజమాన్యంలో 'ఫేసిస్టు'లంతా ఒక మహాసభ చేశారు. ఆ సభలో ముస్సోలినీ ఫేసిస్టుపార్టీయొక్క ఆశయములను, అభిప్రాయములను ప్రస్తుతకర్తవ్యమును, పార్టీవిధానములను స్పష్టముగా

తెలియజేస్తూ గంభీరంగా ఉపన్యసించాడు. అక్కడ సమావేశమైన సభ్యులంతా ముస్సోలినీ అభిప్రాయముతో ఏకీభవించి, అతని నాయకత్వమును స్థిరపరిచారు. మరునాటినుంచే పార్టీ సభ్యుల సంఖ్య హెచ్చ నారంభించింది. ముస్సోలినీ మొదటినుంచీ, తనపార్టీ నంతను కట్టుదిట్టముగను, నియమబద్ధముగను, క్రమశిక్షణాబద్ధముగను తయారుచేయవలెనని సంకల్పించుకున్నాడు. అప్పుడు 'ఫేసిస్టు' పార్టీవారికి విరోధులైన సోషలిస్టు పార్టీవారిచేతిలో వుండి ప్రభుత్వం. పార్లమెంటు సభ్యులూ, ప్రధానమంత్రి, తదితర ప్రభుత్వోద్యోగులు అంతా సోషలిస్టులే. అందుచేత అనేక పట్టణాలలో సోషలిస్టులకీ, ఫేసిస్టులకీ పోరాటాలు ఎక్కువయాయి.

ఇంతలో పార్లమెంటు నూతన సంవత్సరపు ఎన్నికలారంభమయాయి. ముస్సోలినీ, తన పార్టీపక్షమున ఎన్నికలలో పాల్గొన్నాడు. కాని సోషలిస్టులకే జయం లభించింది. ఫేసిస్టులు పూర్తిగా ఓడిపోయారు. సోషలిస్టు పత్రికలు ముస్సోలినీనిగూర్చి "**A dead body has been fished up from the Navaglio**" అని అనేక విధాల దూషించాయి. కాని ముస్సోలినీ ఏమీ జంకలేదు. యథాప్రకారం, తన పత్రికాముఖమున, తన పార్టీని బలవత్తరం చేయడానికనేకవిధాల కృషిచేసేవాడు. "ఎప్పటికైనా సోషలిస్టుల నణగద్రొక్కి, ఫేసిస్టు పార్టీ ప్రభుత్వం స్థాపిస్తా" నని.—

"Don't fear. Italy will heal herself from this illness. But without our watchfulness, it might be deadly. We will resist. Resist ! I should say so. Indeed within two years I will have my turn"

తనపార్టీకి ధైర్యం చెప్పేవాడు. 'పొపోలో డి ఇటాలియా' పత్రికా విలేఖరులున్న ప్రతిగ్రామంలోనూ, వారి యాజమాన్యంక్రింద ఫేసిస్టు పార్టీని అభివృద్ధిచేశాడు ముస్సోలినీ. ౧౯౧౯ సంవత్సరం అక్టోబరులో, 'ఫ్లారెన్సు' పట్టణంలో మొదటి ఫేసిస్టు మహాసభ సమావేశమై, దౌర్జన్య సహితంగా నైనా సోషలిస్టు ప్రభుత్వమును కూలద్రోసి ఫేసిస్టు ప్రభుత్వం స్థాపించాలని నిశ్చయించింది.

"But in the mean time it is necessary to steer a ship even against the stream' even against the flow—even if ship wreck is waiting for the solitary and haughty bearers of heresy"

అని ముస్సోలినీ తనపార్టీ సభ్యులను హెచ్చరించాడు.

ముస్సోలినీని, చంపటానికి సోషలిస్టు లనేక ప్రయత్నాలు చేశారు. కాని ముస్సోలినీ వాటి నన్నింటినీ సమయానుకూల ప్రవర్తనవలన తప్పించుకొంటూ, తన పార్టీబలము నభివృద్ధిచేసుకోటానికి తగిన సన్నాహములను చేసుకొంటూ, శత్రుపక్షములపై పగదీర్చుకోటానికి, తగిన సమయంకోసం ఎదురుచూస్తుండేవాడు. ఒకనాడతడు ఒక కాఫీహోటల్లో వుండగా కొందరు సోషలిస్టు లతన్ని ముట్టడించారు. అప్పుడు ముస్సోలినీ, నిర్భయంగా వారిముందు నిల్చొని

"What do you want of me? To strike me? Well, start. Then be thereafter on guard. For any insult of yours, any blow you will pay for dearly."

ఏంకావాలి, చంపుతారా, చంపండి-కాని ఏమ్మట జాగ్రత్త అని పళ్లుబిగించి మాట్లాడగానే వారంతా ఎందుచేతనో హడలెత్తి పారిపోయారు. తరువాత అనేకచోట్ల సోషలిస్టులకీ ఫేసిస్టులకీ యుద్ధాలు జరిగాయి. అనేకులు మరణించారు.

అటువంటి పరిస్థితుల్లో, ముస్సోలినీ తన కార్యక్రమం మార్చవలెనని నిశ్చయించి, తనపార్టీ పెద్దలనందరినీ మిలాన్‌లో సమావేశపరచి తన నూతన కార్యక్రమాన్ని తెలియజేస్తూ,

"...through news paper propaganda, or by example we would never attain great success. It is necessary to beat the violent adversary on the battlefield of violence."

అని గంభీరోపన్యాస మిచ్చాడు. సభికులంతా ముస్సోలినీ సూచన నామోదించారు. ముస్సోలినీ, తన సూచనలను కార్యరూపంలో పెట్టవలసిన పద్ధతులు, ప్రదేశములు మొదలైనవాటినిగూర్చి విపులమైన కార్యక్రమమును తెలియచేశాడు. పార్టీ నాయకులంతా ముస్సోలినీ ఆజ్ఞలను తూచా తప్పకుండా నెరవేర్చి, సర్వ సన్నాహములతో సమయమున కెదురుచూస్తు న్నారు. ఇటువంటి స్థితిలో సోషలిస్టు లొకరాడీకి లంచమిచ్చి ముస్సోలినీని చంపి రమ్మని పంపించారు. ఆరాడీ ముస్సోలినీ ఇంటికి వెళ్లే సరి కప్పుడే ముస్సోలినీ ఎక్కడనుంచో వస్తున్నాడు. ఆ రాడీ తనకొరకే వచ్చినట్లు తెలిసికొని ముస్సోలినీ, అతనిని తన పత్రికాకార్యాలయందగ్గర కలుసు కొమని చెప్పి వెళ్లిపోతూడు. తరువాత ఆరాడీ పత్రికాఆఫీసులో ముస్సోలినీని కలుసుకున్నాడు. ముస్సోలినీ అతడితో చాలా ఆదరంగా మాట్లాడాడు. ఎందుచేతనో, ఆరాడీ తన నిశ్చయాన్ని మార్చుకొని, తన సమాచారం అంతా ముస్సోలినీతో చెప్పి, క్షమా ర్పణ కోరి వెళ్లిపోతుండగా పోలీసులు షైరుచేశారు అతన్ని.

ముస్సోలినీ తన కార్యక్రమానికి సమయం సమీపిస్తోందని గ్రహించి, ఈలోపుగా తన పార్టీ బలము లను తెలుసుకోవాలని సంచారం బయల్దేరాడు. అతడు దర్శించిన ప్రతిదేశములోని జనులు అతని కఖండమైన స్వాగత మిచ్చారు. ఇంతలో పార్లమెంటు ఎన్నికలు ప్రారంభమైనాయి. ఫేసిస్టుపార్టీ కూడా ఎన్నికలలో పాల్గొంది. ఆసంవత్సరం ఫేసిస్టుపార్టీకి కొంతవిజయం కలిగింది. ముస్సోలినీ కొలదిమంది అనుచరులతో పార్ల మెంటులో ప్రవేశించాడు. తనబలం తక్కువైనా, తన అభిప్రాయములను పార్లమెంటులో నిర్భయంగా, ఖండి తంగా, ఉపన్యసిస్తూ సోషలిస్టుల నెప్పుడూ ఎదుర్కొనే వాడు. ప్రభుత్వమునుగూర్చి మాట్లాడుతూ, అప్పటి సోషలిస్టు ప్రభుత్వ ప్రధానమంత్రియైన 'గియోలిట్టో'ని ఎదిరించేవాడు కూడాను.

దేశపరిస్థితులనుగూర్చి విచారించటానికి రోములో ఫేసిస్టుకాంగ్రెస్సు సమావేశమై, ముస్సోలినీ నాయకత్వం క్రింద, తక్షణం తమకార్యక్రమాన్ని ఆచరణలో పెట్టి, ప్రభుత్వ స్నెదుర్కొ డానికి తీర్మానించింది. తదను కూలంగా పార్లమెంటులో ఏర్పడిన అనేక క్లిష్టపరిస్థితుల వలన, ప్రభుత్వం తరుచు ఒక సంఘంవారిచేతిలోనుండి ఇంకొకరి చేతిలోకి మారుతుండేది. ఇట్టి సందర్భంలో ముస్సోలినీనికూడా ఇటలీరా జు రెండుపర్యాయములు పిలిపించి ప్రభుత్వాన్ని నడిపించవలసిందని కోరాడు. కాని వారిలో వారికి గలిగిన అభిప్రాయభేదములవలన ముస్సోలినీ అంగీకరించలేదు. చివరికి అసమర్థుడైన 'ఫాక్టా' అనే అతడు సోషలిస్టు పార్లమెంటుకు అధ్యక్షు డయ్యాడు. ఫేసిస్టుపార్టీని మంచి చేసుకుంటేగాని లాభంలేదని ప్రభుత్వంవారు పూర్తిగా గ్రహించి ముస్సో లినీతో రాయబారాలు సాగించారు. కాని ముస్సోలినీ లొంగలేదు. అందుచేత పార్లమెంటులో ఫేసిస్టుపార్టీకి తగినస్థానం లేకుండా చేశారు. ముసోలినీ సమయం కని పెట్టి, తన సైన్యమైన 'బ్లాక్ షర్ట్సు' బలంతో రోము పట్టణం ముట్టడించ నిశ్చయించుకున్నాడు. కావలసిన సాధన సన్నాహములన్నీ పూర్తి చేసుకున్నాడు. ఉత్సాహంతో ఉప్పొంగిపోతున్న తన అనుచరులను ఉత్సాహపరుస్తూ కళ్లెములను బిగించి వుంచేవాడు. దండయాత్రకి సర్వసన్నాహాలను రహస్యంగా సిద్ధ పరుచుకుంటూ పైకి ముస్సోలినీ, నిర్లక్ష్యమైన ఖులాసా పురుషునిలా, సినీమాలకీ నాటకాలకీ తిరుగుతూ తన్ననుసరించివుండే పోలీసులకళ్లలో దుమ్ముకొట్టేవాడు.

హఠాత్తుగా ఒకనాడు తనపత్రికలో యుద్ధప్రక టన చేశాడు.

"Facisti! Italians! the time for determi ned battle has come.........Fascism draws its sword to cut the multiple Gordian knots which tie and burden Italian life. We call God and the spirit of our five hundred thousand dead to witness that only one impulse sends us on, that only one passion burns within us—the impulse and the passion to contribute to the safety and greatness of our country. Fascisti of all Italy! Stretch forth like Romans your spirits and your fibres! We must win! we will!..."

మరునాటినుంచి, పట్టణంలో ఎక్కడ చూసినా పోలీసుపటాలముల గస్తీ. ముస్సోలినీ, తన పత్రికా కార్యాలయములో అంతకుముందే కావలసిన వస్తు సామగ్రితో కట్టుదిట్టం చేసుకున్నాడు. అక్టోబరు 27 వ తేదీ అన్ని పట్టణప్రాంతములలో యుద్ధపిశాచం నృత్యం ప్రారంభించింది. 'పాపోలా డి ఇటాలియా' కార్యాలయాన్ని ప్రభుత్వదళం ముట్టడించింది. ముస్సోలినీ, స్వయంగా తుపాకీ ధరించి, తన అనుచరులతో శత్రువుల నెదుర్కొన్నాడు. కొన్నిగంటలు యుద్ధం జరిగింది. ప్రభుత్వదళం భయపడి ముస్సోలినీతో రాయబారం సాగించింది. ఆ రాత్రి తెల్లవార్లూ, మిలన్‌లోని ప్రముఖులంతా ముస్సోలినీవద్దకు వచ్చి రాయబారాలు సాగించారు.

దేశంలో అన్ని ప్రాంతాలలోనూ ఒక్కమాటుగా యుద్ధజ్వాల లావరించి, ప్రభుత్వాన్ని భయభ్రాంతం చేసినవి. ముస్సోలినీసేనలు అన్నీ కలిసి రోముపట్టణానికి దారి తీసి, తమ నాయకునికొరకు కెదురు చూస్తున్నాయి. వివిధప్రాంతములలోను ఫేసిస్టులకే జయం కలిగింది. అన్ని ప్రాంతములనుండి వచ్చి ఫేసిస్టు సైన్యవ్యూహములు రోమునగరాన్ని ముట్టడించి, ముస్సోలినీ రాగానే, అతని నాయకత్వంక్రింద పట్టణంలో ప్రవేశించాలని తహతహ పడుతున్నాయి అటువంటి సమయంలో రాజుగారిదగ్గిరనుంచి 'జనరల్ సిట్టాడినీ' అనే అతడు ముస్సోలినీ ప్రభుత్వాధికారం వహించమని కోరుతూ ఆహ్వానం తీసుకొచ్చాడు. కాని ముస్సోలినీ దాని కంగీకరించక రాజుగారి దగ్గిరనుంచి టెలిఫోనులో ఆహ్వానం రావాలన్నాడు. రెండు మూడు గంటలలో తనకోరికప్రకారం ఆహ్వానం వచ్చింది ముస్సోలినీకి. ఈ సంగతులన్నీ తనయనుచరు లందరకీ తెలియజేస్తూ "పాపోలా డి ఇటాలియా" ప్రత్యేక సంచిక ప్రకటించాడు ముస్సోలినీ.

ముస్సోలినీ రాజుగారి ఆహ్వానం అంగీకరించాడు. తన ప్రయత్నం ఫలించిందని సంతోషించాడు. తనజీవితాశయం నెరవేర్పుకో గలిగినందుకు గర్వించాడు. ముఖ్యంగా తన అనుచరుల దేశభక్తికీ, ధైర్యస్థైర్యములకు ఆశ్చర్యపడి ఆనందించాడు. అనేక సంవత్సరాలనుండీ, నిద్రాహారములను మాని, కష్ట నష్టములకు లెక్క చేయక సల్పిన కృషిఫలము నందుకొని, ఆనంద సాగరంలో మునిగిపోయాడు. కాని ముస్సోలినీ తన భావిజీవితపథమును గూర్చి ఆలోచించకపోలేదు. భావిజీవితమంతా, అనేక క్లిష్టసమస్యలతో, చిక్కులతో, మితిమీరిన భారంతో నిండివున్నదని గుర్తించి, ముస్సోలినీ వాటి నన్నింటినీ భేదించుకొని పోటానికి దృఢనిశ్చయుడై తగిన సన్నాహములను ప్రారంభించాడు. తనజీవితంలో సర్వదినముల కోప్పడి, తన ప్రస్తుతౌన్నత్యానికి ప్రధానకారణమైన 'పాపోలా డి ఇటాలియా' పత్రికను ముస్సోలినీ విధిశేష గాంధీ అక్టోబరులో సోదరుడైన 'ఆర్నాల్డో' హస్తగతం చేశాడు. మర్నాడు రోముపట్టణ ప్రయాణాని కన్నీ సిద్ధంచేసుకున్నాడు ముస్సోలినీ. ముస్సోలినీ అనుచరు లాతనికి ప్రత్యేకంగా రైలుబండిని సిద్ధపరిచారు. కాని ముస్సోలినీ అంగీకరించలేదు. ఒకరైలుపెట్టె చాలు నన్నాడు తనకి. రోమునగరం అంతా మహోత్సవంగా అలంకరింపబడింది. బ్రహ్మాండమైన స్వాగతం ముస్సోలినీకోసం ఎదురు చూస్తూవుంది. ముస్సోలినీ తన సైన్య చిహ్నమైన నల్లచొక్కాను ధరించి, తన స్నేహితులయొక్కయూ, సైనికులయొక్కయూ, ప్రజలయొక్కయూ జయజయధ్వానములతో రోముపట్టణం ప్రవేశించి, తిన్నగా రాజుగారిదగ్గిరకి పోయాడు. తనరాజ్యాంగ విధాన మంతటినీ స్పష్టంగా, ఖండితంగా రాజుగారికి తెలియజేసి అతనికోరికపైని ముస్సోలినీ తన రాజ్య తంత్రాన్ని ప్రారంభించాడు.

మొట్టమొదట ముస్సోలినీ, తనసైన్యాల నన్నిటినీ శాంతంగా ఏవిధమైన కోలాహలము లేకుండా ఉండవలెనని కఠినంగా ఆజ్ఞాపించి, వా రందరినీ ప్రభుత్వ ప్రత్యేక సైన్యంగా నమోజు చేయించి అసలు ప్రభుత్వ సైన్యాన్నంతనీ తనవశం చేసుకొని, మొత్తం సైన్యాన్నంతనీ తనకనుసన్నలలో మెలగేటట్లు ఏర్పాటుచేసుకున్నాడు. కాని దేశంలో సంపూర్తిగా శాంతి వాతావరణ మేర్పడలేదు. అక్కడక్కడ ముస్సోలినీ సైన్యములకు విరోధిపక్షములకు పోట్లాటలు జరుగుతూ

వచ్చినవి. రాజకీయపక్ష యుద్ధాలతో దేశం అల్లరి చిల్లరిగా వుంది. అందుచేత ముస్సోలినీ, వివిధ రాజకీయపక్ష విరోధులను పూర్తిగా నణచివేసి, సర్వపక్షములకు న్యాయమైన హక్కుల నిచ్చి దేశములో సంపూర్ణ శాంతి నేర్పాటు చేయడానికి చాలా ప్రయత్నాలు చేశాడు. అన్ని పక్షములవారికి ప్రాతినిధ్య మిస్తూ ఒక మంత్రివర్గాన్ని నియమించి దానికి ముస్సోలినీయే అధ్యక్షుడుగా వుండేటట్లు ఏర్పాటుచేశాడు. దీనితోపాటు సర్వప్రభుత్వోద్యోగులుకూడా తన ఆజ్ఞలకు బద్ధులై నడుచుకొనవలెనని ఆజ్ఞాపత్రములను పంపించి, ముస్సోలినీ నవంబరు ౧౬-వ తేదీని పార్లమెంటును సమావేశపరిచాడు. ఆ సమావేశమునకు పార్లమెంటుసభ్యు లందరు హాజరయ్యారు. వారి కందరికీ తనరాజ్యాంగ విధానమును స్పష్టంగా తెలియజేస్తూ గంభీరోపన్యాసం చేశాడు ముస్సోలినీ.

అట్లు ముస్సోలినీ తన అధికారమును స్థిరపరచుకొని, దేశక్షేమమును, ప్రజా సౌఖ్యములను అభివృద్ధి చేయాలని నిశ్చయించుకున్నాడు. ఈ సదుద్దేశములను జయప్రదంగా నెరవేర్చుకొనుటకు, తన సర్వసౌఖ్యములను విడిచిపెట్టి, నిద్రాహారములనుకూడా త్యజించి అనేకమైన కష్టము లనుభవించాడు. దేశక్షేమమే తన క్షేమమని, ప్రజాసౌఖ్యమే స్వసౌఖ్యమని భావించి, దేశాభ్యుదయానికి కంకణం కట్టుకుని పనిచేశాడు. ఎటువంటి అవస్థలయందైనాసరే అతని కత్యుత్సాహకరములైన సుఖపుస్వారీ, మోటారు డ్రైవింగు, విమానయానము మొదలైనవిమాత్రం ఎప్పుడూ మానేవాడుకాదు. ఇతర విధమైన చుట్ట, బీడి, త్రాగుడు, మొదలైన దురభ్యాసము లేమీ లేవు ముస్సోలినీకి. అప్పుడప్పుడు శాస్త్రానందం కొరకు ఫిడేలు వాయించుకుంటూ ఉంటాడు. ఈఫిడేలు వాయిద్యంలో ముస్సోలినీ ఇప్పటికీ చాలా దిట్టమైనవాడట! ఇటువంటి బండఘటానికి, ఇటువంటి సున్నిత కళారాధన ఆశ్చర్యకరంగానే వుంది.

ముస్సోలినీ తనరాజ్యాంగ విధానాన్ని ప్రజ లెంతవరకు ఆమోదిస్తున్నారో తెలుసుకోవాలని దేశంలో వివిధప్రాంతాలకి సంచారం బయలుదేరాడు. అతడు దర్శించిన ప్రతి ప్రదేశంలోను ప్రజ లతని కఖండమైన స్వాగతముల నర్పించారు. తరువాత కొంతకాలానికి తన స్వశక్తిని, ప్రజాభిమానమును పరీక్షించుకోవాలని బుద్ధి పుట్టి, ముస్సోలినీ ౧౯౨౪-వ సంవత్సరం ఏప్రిల్ ౬-వ తేదీని ఎన్నికలని ప్రకటించాడు. ఈ ఎన్నికల కార్యక్రమం అంతా ముస్సోలినీ విలక్షణంలో వుండి నడిపించినా, రోములో అతనికే జయం లభించింది. కాని విరోధిపక్షాలకు కసుపుమంటలు తగ్గలేదు. ముఖ్యంగా సోషలిస్టులు, అనేకప్రాంతాలలో ప్రభుత్వంమీద తిరుగుబాట్లు చేశారు. కాని ముస్సోలినీ వాటినన్నింటిని పూర్తిగా అణచివేసి, దేశంలోను పార్లమెంటులోనుకూడా ఫేసిస్టుపార్టీ తప్ప మిగిలిన పార్టీలను రూపుమాపేశాడు. అంతటితో ముస్సోలినీ తన ఆత్మశక్తి పూర్తిగా గ్రహింపగలిగాడు.

తరువాత ముస్సోలినీ సైనికశాఖలో అనేక మార్పులనుచేసి దానిని చాలా అభివృద్ధిచేశాడు. ఇటలీ దేశాభివృద్ధికి, ఏయే విషయములలో ఏయే ఏర్పాట్లు చేయవలెనో తెలిసికొనుటకు ముస్సోలినీ ప్రత్యేకంగా ఒకకమిటీని ఏర్పాటుచేసి, తదనుకూలంగా దేశంలో సాంఘికవిద్యా వికాసముల కవసరమైన శాసనము లనేకములను చేశాడు.

౧౯౨౫-వ సంవత్సరం ఫిబ్రవరినెలలో ముస్సోలినీకి చాలా జబ్బుచేసింది. జబ్బుతో ౪౦ దినాలు మంచంపట్టి ముస్సోలినీ బయటకు రాలేకపోయాడు; పైగా తనసంగతి సమాచారముల నెవ్వరికీ తెలియనివ్వలేదు. ఇది అదనుతీసికొని సోషలిస్టులు మళ్లీ విజృంభించడానికి ప్రయత్నించారు. ఫేసిస్టుపార్టీ వారికి తరునాయకుడైన ముస్సోలినీ లేకపోవడంచేత ఏమి చెయ్యటానికీ తోచక, అతని దర్శనానికి చాలా హడావిడిచేశారు. నుదకు మార్చినెలలో ఫేసిస్టు పార్టీ సాంవత్సరికోత్సవంలో ముస్సోలినీ కృశించిన శరీరంతో గంభీరోపన్యాసం చేసి ప్రతిపక్షుల కాశ్చర్యం కలిగించాడు. మళ్లీ యథాప్రకారం, తాత్కాలికంగా చెలరేగిన అల్లరుల నణచి ముస్సోలినీ తనస్థానం సుస్థిరం చేసుకున్నాడు. కాని ఫీలైనప్పుడల్లా అతనిశత్రువు లతన్ని వధించటాని కనేక ప్రయత్నాలు చేస్తూనే వచ్చారు. ఇతర దేశములలోని సోషలిస్టులు 'జానీ బోనీ'

ఆల్బేనియా ఆక్రమణ ప్రపంచయుద్ధానికి దారితీస్తుం ప్రస్తుత స్థితిగతులని పట్టిమాస్తే ప్రపంచయుద్ధం మల్లీ దేమో అని భయంగా {వున్నా, మిగిలిన రాజ్యాలవా ఆరంభం ఔతుందేమో అనిపెద్ద లభిప్రాయపడుతు ఎవ్వరూ జోక్యం కలిగించుకోలేకుండా వున్నారు. న్నారు మరి, చివరకెల్లా పరిణమిస్తుందో!

---

కడచిన భారతి సంచికయందలి

# "లకుమాదేవి" కథలో సవరణలు

---

౮౨౮-వ పుట మొదటి కలంలో

" మీ రభ్యసించిన భరతనాట్యశాస్త్రమున కీ లావణ్యవతి సంపూర్ణ వ్యాఖ్య కాదు గదా!" అని చదువుటకు బదులు,

" మే మభ్యసించిన భరతనాట్యశాస్త్రమున కీలావణ్యవతి సంపూర్ణవ్యాఖ్య కాదుగదా! అని హర్షమును ప్రకటించెను" అని చదువగోరెదను.

ఇట్లే,

౮౦౬-వ పుటలో రెండవ కలంలో రెండవ పేరాలో,

"లకుమాదేవి భరతశాస్త్ర పాటవమును గాంచి సంగీతకళానైపుణ్యమును విని యానందించిన పిదప" అన్న తరువాత "నాతడు" అన్న మాటకు బదులు "కుమారగిరి "భూపాలుడు" అని చేర్చి, పిదప "ఆంధ్రోర్వీశుని యనుమతి బొంది యాతనికి అంకిత మిచ్చి" అన్న వచనమును తీసివైచి చదువుకొనవలయును.

ఈ సవరణలకు గారణము వసంతరాజీయమును రచియించినది కుమారగిరి గావున.

భా. వేం. కృ.

# పతిత

శ్రీమతి లీలావతీమున్షి

[రెండుముక్కలు: — 'శ్రీమతి లీలావతీమున్షి' బొంబాయి కాంగ్రెసుమంత్రులలో వొకరైన 'కన్హయిలాలు మణికులాలు మున్షి' గారి ధర్మపత్ని. ఆమెకూడ బొంబాయి రాష్ట్ర అసెంబ్లీ సభ్యురాలు. వా రిద్దరూ సత్యాగ్రహసమరంలో జైలుకుకూడ వెళ్లారు. రాజకీయాలలో పాల్గొనడమే కాకుండ, సాహిత్యంలోకూడ అపారమైన సేవజేస్తూవున్నారు. ఆధునిక గుజరాతీ సాహిత్యంలో వన్నెకెక్కారు.]

౬ మే, ౧౯—

చివరకు నే నొక నాటకకంపెనీలో చేరి వనమాల నల్లా వసంతసేనగా మారాను. సంసారం మారింది; పేరు మారింది; చివరకు శరీరంకూడ మార్పుచెందింది. ఆదర్శమాతాపితల ఆశ్రయంలో బాల్యం గడిచింది. గిరీశుని పెండ్లాడి సుఖపడదలంచాను. కాని నాతల్లి చనిపోగానే నాతండ్రికి నామీద విరక్తి జనించింది. నా తండ్రి రెండో పెండ్లి చేసుకొనకపోయినట్టయితే నా కీ దుర్దశ యెందుకు సంభవిస్తుంది?

కాని సమాజంద్వారా ద్వేషింపబడిన విధవకంటె నటి తీసివేయదగ్గది కాదు. నిస్సహాయురాలైన విధవను ఆశ్రయవిహీనను చేసి లాభంపొందజూచే నాబావమాదిరి నీచులు యిక్కడ వుండరు. కనీసం యీ పొట్ట అయినా నిండుతుందిగా! కాని ఈ జీవనం! నాకా? ఎంతవరకు నిర్వహించగలుగుతాను? భగవంతునికే తెలియాలి.

౮ మే, ౧౯—

అంతా క్రొత్తగానే వుంది. మనస్సు వ్యాకులత చెందసాగింది. నా కేమీ తెలియడం లేదు. నే నిక్కడ యే విధంగా వుండగలను? బావిలోనుండి బైటపడి వొక కందకంలో పడినట్టు వుంది. ఇక్కడనుండి పారిపోతే? పారిపోతే పొట్ట నింపుకునే దెట్లా? ఈశ్వరీ! నీవేశరణ్యం.

౧౬ మే, ౧౯—

ఇక్కడకు వచ్చి సరిగా పదిరోజులైంది. కాని పదియుగాలు గడిచినట్టుగా వుంది. మనస్సులో వ్యాకులత హెచ్చింది. నటులు లంతా దారిన పోయే బిచ్చగత్తెనుకంటె నీచంగా చూస్తున్నారు. నా కేదో నేర్పుతూవున్నారు. దాన్ని తలుచుకుంటేనే నాకు భయమేస్తూవుంది. నన్ను పరిహాసం చేయడానికే అందరూ జన్మించినట్టు వుంది. ఈ నాటకకంపెనీమొత్తంలో నేను, తరుబాల యిద్దరమే స్త్రీలం. మిగతా వారంతా పురుషులే. కాని నే నెప్పుడూ తరుబాలదగ్గరనే వుంటూ వుంటాను. ఆమె నావైపు కన్నెత్తైనా చూడడం లేదు. తా నొక మహారాణి అయినట్టు నే నొక అడవి మృగాన్ని అయినట్టుగా భావించుకుంటూవుంది. ఆమె సౌందర్యంలో గాని యింక యితరవిషయాలలో గాని నాతో పోటీ చేయలేదు. నేనుకూడ అంత తీసివేయదగ్గదానను కాదని ముందు ముందు తెలుసుకునేటట్టు చేయగలుగుతాను.

కాని నే నిక్కడ యెల్లా వుండగలుగుతాను? పెద్దవాళ్లూ, చిన్నవాళ్లు అందరూ నన్నొక అడవి మృగంగా భావించుకుని వ్రేలెత్తి చూపించడం యెందుకు? అందులో ముఖ్యంగా నటులే! వాళ్లనుండి రక్షించవలెనంటే భగవంతునికి తప్ప యింకెవరికీ సాధ్యం కాదు. వాళ్లు తలుచుకుంటే యేపనైనా చేయగల్గుతారు. వాళ్లకు అడ్డుచెప్పడానికి యేమాత్రం వీల్లేదు.

వాళ్లకు వ్యతిరేకంగా యేమి చెప్పినా కంపెనీ మేనేజరు వినిపించుకోడు. వినిపించుకోకపోగా 'ఇట్టి స్వల్ప విషయాలలో జోక్యం కలిగించుకుంటే ఈనాటక

కంపెనీని వదిలేసి వచ్చినవారి పట్టవలసి వుంటుంది. నీ కిష్టమైతే వుంచు; లేకపోయిన నీదారి నీవు చూచుకో' అంటాడు. అతని తల బ్రద్దలుచేసి యెక్కడికైనా పారిపోదామని అనిపిస్తుంది. కాని యెక్కడికి పోను? ఓ భగవంతుడా! నీవు దయాళుడవే అయితే నాకు మృత్యువు రప్పించి నన్ను కాపాడు.

౩౦ మే, ౧౯—

ఇంతవరకు యే నాటకంలోనూ పార్టు తీసుకో లేదు. అయినా రోజురోజుకు ధైర్యం వస్తూనేవుంది. మేనేజరు నటకులతోను, నాకర్లతోనూ తప్పక యేదో చెప్పివుంటా డనుకుంటాను. అందువల్ల నన్ను వాళ్లు యెక్కువగా పరిహాసం చేయడం మానుకున్నారు. కాని నేను అటుయిటు వెళ్లుతూవుంటే చూచి వ్రేళ్లు చూపిస్తూ పాటలు పాడడం వాళ్లకు మహాసరదాగా వుంటుంది. నేను వాటిని లక్ష్యం చేయడంలేదు. వాళ్లేమి చేసుకుంటే నాకేమి?

తరుబాల అప్పుడప్పుడు నావైపు చూచేపుణ్యం కలిగింది. ఈమె పగటికంటె రాత్రిపూటే అందంగాకనిపిస్తుంది. అద్దంలో చూచుకొని శృంగారించుకోవడంతోటే రోజల్లా సరిపోతుంది. నేనుకూడ ఆమెలాగ గుడ్డలు ధరించుకుని, ఆమెలో యేపదోవంతో నేనూ శృంగారించుకుంటే, ఆమెకంటె నేను వెయ్యిరెట్లు అందంగా వుంటాను. కాని యెట్లా వుంటేనేమి? ఆమెకు నాకు సంబంధం యేమిటి? ఈ విపత్తు నాకు సంభవించి వుండకపోతే నేను ఇక్కడకు ఎందుకొస్తాను?

౨౦ జూలై, ౧౯—

రెండు మాసాలైంది. నన్ను క్రొత్తగా వేయబోయే నాటకంలో వేషం వేయించాలని చూస్తున్నారు. నాకు సంగీతం నేర్పడానికి వొక వుపాధ్యాయుణ్ణి నియమించారు. పగలంతా నాపోర్షను వల్లించుకుంటూ వుంటాను. ముఖ్యనటకులవద్దకుకూడా వెళ్లి అభినయం నేర్చుకోవలసి వస్తుంది. నిజంగా వాళ్లవద్దకు వెళ్లడమంటేనే నాకు మహాభయం. నా అదృష్టంవల్ల వుపాధ్యాయుడు ముసలివాడు దొరికాడు. నేను ఆయన దగ్గరకు వెళ్లేసమయంలో తరుబాల నవ్వుతూ 'పరవా లేదు, యిక దారికి వస్తావులే' అంటూ వుంటుంది ఆమె కండ్లకు సురమా పెట్టుకొని పెదవులకు రంగువేసుకుంటుంది. ఆమెకు నేనంటే అమితద్వేషం. ఆ ద్వేషాన్ని బైటికి కనబర్చదు. ఆయన నేర్పినట్లు అభినయించడానికి నాకు కొంచెం సిగ్గువేస్తూవుంది. నాగదిలో వొక్కతెనే వుండి అభినయం చేయమంటే యేవిధంగానైనా చేయగల్గుతాను. కాని శంకరుని యెదుట నేనే మాత్రం చేయలేకుండా వున్నాను. ఇంకా శరీరం అటు యిటు వంచి అభినయించాలంటే మనస్సులో వుత్సాహం వుండాలి. నేను దుఃఖంలో మునిగివున్నాను.

గ్రీష్మ ఋతువులోని ప్రచండ తాపానికి శీతల ప్రవాహాలు యెండిపోక వుంటవా?

౩౧ జూలై, ౧౯—

ఇవ్వాళ తరుబాల వెక్కి వెక్కి యేడుస్తూ గదికి వచ్చింది. గుడ్డలు చిందరవందరగా పారవేసి వెళ్లి పరుపు మీద పండుకున్నది. నేను వోదార్చడానికి వెళ్తే కోపం వస్తుందేమో ననుకున్నాను. తర్వాత వొక గ్లాసుతో మంచినీళ్లు తీసుకుని ఆమెదగ్గరకు వెళ్లాను. ఆమె తలను చేత్తో సవరించుతూ మంచినీళ్ల గ్లాసు ఆమె నోటి ముందు పెట్టాను. ఇంకో సమయంలో అయితే నా చేతిని విదిలించి కొట్టేదే. కాని ఈరోజు కన్నార్పకుండా నావైపు చూస్తూ కొంతసేపటికి నీరు త్రాగింది. నేను ఆమె వీపును సవరించుతూ వున్నాను. కొంతసేపటికి ఏదో జ్ఞాపకం వచ్చినదానివలె స్థిరంగా నావైపు చూస్తూ వొక్కపర్యాయంగా 'నీవు ఇక్కడికి ఎందుకొచ్చావు?' అని అడిగింది.

ప్రారంభంలో నాకేమీ అర్థం కాలేదు. కాని కొంతసేపటికి పొట్ట నింపుకోవడానికి వచ్చానన్నాను. నేను చెప్పినది ఆమెకు నచ్చక పోవచ్చు. అందువల్ల దుప్పటి కప్పుకుని మళ్లీ నిద్రపోయింది. నేనుకూడ ఏ పనీ లేకపోవడంచేత వెళ్లి మంచంమీద పండుకున్నాను.

తరుబాల విచిత్రమైన మనిషి. ఈ రోజు తప్పక నాతో మాట్లాడుతుం దనుకున్నాను. నా కిక్కడ యే మాత్రం తోచడంలేదు. ఈమె అయినా కొంచెం మాట్లాడుతూవుంటే బాగుండును. ఓ భగవంతుడా! నేను యెక్కడ పుట్టి పెరిగాను? యెక్కడకు వచ్చాను?

నీవు ఇన్నివిధంగా దుర్గతిపాలు చేయదలచుకుంటే ఏ నీచకులంలోనో పుట్టించివుంటే బాగుండేది.

౫ అగష్టు, ౧౯—

అబ్బా! ఇక్కడ వుండడమే దుర్భరంగా వుంది. నేను శంకరునికి భార్యనై అభినయించాలట. అది కాకుండా ఈదినంనుంచి అతనే నాకు నేర్ప మొదలు పెట్టాను. అయ్యో, అయ్యో-

తలెత్తి చూడడానికికూడా సిగ్గవేస్తూవుంది. ఈ వొక్క జీవితంలోనే యెన్నో జీవితాలు అనుభవించి నట్టుగా వుంది.

ఓ ప్రభూ! అధోగతిపాలు చేయడానికే నన్ను పుట్టించావా? యెంత పతనస్థితికి తెచ్చావు? ఇంకా యెక్కడికితీసుకొనివెళ్లి విసిరిపారవేయదలచుకున్నావు?

౬ అగష్టు, ౧౯—

'ఆ విధంగా అభినయించడం నావల్ల గాదు. ఇంకెవరినైనా అభినయించమనండి' అని నేను మేనేజరుతో అన్నాను. 'స్త్రీలచేత చెలికత్తెలవేషాలు గాని యింకే యితరమైన వేషాలుగాని వేయించే ఆచారం యిక్కడ లేదు. ప్రధానపాత్రలనే ధరించవలసివుంటుంది. ప్రతి నాటకంలోనూ అంతే. నీవు దానికి ఇష్టపడకపోయిన ఆగ్రిమెంటు పూర్తి అయిన తరువాత యిక్కడనుండి వెళ్లవచ్చు. ఇప్పుడే పోదలచుకుంటే నీకోసం ఖర్చు పెట్టిన డబ్బు ఇవ్వవలసివుంటుంది' అని మేనేజరు సమాధాన మిచ్చాడు.

తరుబాల 'మేనేజరు చెప్పిన సమాధానం చాల బాగుంది. లేకపోతే—' అని వాక్యం పూర్తిచేయకనే వెకిలిగా నవ్వింది.

కొంచెంసేపటికి ఆమె మళ్లీ వచ్చింది. నేను మంచంమీద పండుకుని యేడుస్తూవున్నాను. ఆమె నా పాదాలవైపు కూర్చున్నది.

కాసేపటివరకు ఏమీ మాట్లాడలేదు. ఆ తర్వాత 'నీవు సీత, సావిత్రులలాగా పవిత్రంగా వుండదలచుకుంటే ఇక్కడికి ఎందుకొచ్చావు?' అన్నది. నాకు దుఃఖం ఆగలేదు. ఇక్కడకు నేను వచ్చి యెన్నో రోజులైంది. కాని నన్ను ఎవరూ వొక మనిషినిగా కూడ చూడడంలేదు. దుఃఖాతిరేకహృదయాన్ని శాంతి పరుచుకునే తలంపుతో నా విపత్కథనంతా ఆమెకు చెప్పి వినిపించాను.

నాతల్లి చనిపోకుండా వుండినను, అథవా గిరీశుడు నన్ను వివాహముచేసుకుని వుండినను ఈ దురవస్థ నా కెందుకు సంభవించేది? నా దురదృష్టం కాకపోతే ఆ భర్త అయినా వుండరాదూ? నన్నింత అధోగతిపాలు చేసి పోవడ మెందుకు?

ఈ దుర్దశ సంభవించడానికి నే నేమి తప్పుచేశాను? ఆ భావముంగాకొడుకు నన్ను అన్ని విధాల సర్వనాశనంచేశాడు. అత్తయింటివాళ్లు, పుట్టింటివాళ్లుకూడ నన్ను ఎందుకూ పనికిరానిదాన్నిగా చేసి వెళ్లగొట్టారు.

అహమదాబాదు అనాథాశ్రమములో ఆశ్రయం దొరకకపోయినట్లైతే ఈనాటికి బ్రతికి వుండేదానినో, కాదో!

* * *

నా ఆత్మకథనంతా తరుబాలకు చెప్పి వినిపించాను. ఆ తరువాత ఎక్కువకాలం కూర్చోకుండానే వెళ్లిపోయింది. ఆవిచారంలో ఆమె యెప్పుడు లేచివెళ్లినదో కూడ తెలియలేదు. నా వృత్తాంతమంతా శంకరునితో ముచ్చటించుతూ నవ్వుతూ వుంటుం దనుకుంటాను. ఓ భగవంతుడా! అనాథనాథా! నన్ను రక్షించు, నా జీవితంలో ఈనాటివరకు తెలిసివుండి ఏపాపం చేసి యెరుగను. ఇకముందుకూడా నా కా వుద్దేశ్యం లేదు. నీవు కరుణా సముద్రుడవు. ఈప్రపంచంలో నా కింకేమీ వద్దు. తినడానికి రెండు పిడికెళ్ల ధాన్యం కట్టుకోవడానికి రెండుమూరలగుడ్డ చాలు. ఈ అనాథను దయతో కాపాడు.

దీనబంధూ! నీవే నాకు శరణ్యం. ఈ ఆపత్సముద్రమునుండి రక్షించుభారం నీది.

౭ అగష్టు, ౧౯—

నిన్నటి ప్రార్థనమూలకంగా నాలో వొక విధమైన శక్తి వుద్భవించింది. ఈరోజు శంకరుడు నేర్పిన దంతా దృఢమైన మనస్సుతో చేయగలిగాను. అతను కూడ నేర్పుతూ వేరే చిలిపిచేష్టలు చేయలేదు.

౮ ఆగష్టు, ౧౯—

నేను చేసేదానిలో తప్పేమి లేదూ? నాటకకంపెనీలో నౌకరీ చేస్తూ ఇటువంటి నీచులతో కలిసివుండడం నాలాంటి వాళ్లకు శ్రేయస్సా? అప్పుడప్పుడు నామీద నాకే రోత పుడుతూ వుంటుంది.

ఏం చేస్తాను? అందరూ నన్ను పతితురాలుగా భావిస్తున్నారు. వంటపాత్రలు తోముకోవడానికే వొప్పుకోవడం లేదు. బడి పెడితేమాత్రం నా బడిలోకి పిల్లలను ఎవరు పంపిస్తారు? ఈ మానవప్రపంచంలో మానవులు అనబడేవాళ్లుగానీ, రాక్షసులు అనబడేవాళ్లుగానీ, యెవరూ నన్ను రక్షించడానికి సిద్ధంగా లేరు.

బొంబాయి చేరుకున్నాను. యేదైనా మంచిపని దొరికితే బాగుండు ననిపించింది. బొంబాయిమినహా నాకు శరణ్యంలేదు. కాని యిక్కడకు వచ్చి యేమి లాభం పొందగలిగాను? సముద్రంలాంటి మహానగరంలోకూడ భిక్షమెత్తుకుంటూ చెడు దృష్టులకు లోనుగావలసిన దుర్దశ సంభవించింది. ఆశారద మాస్టరు నేనుకూడ యెవరి వల్లో చిక్కుకోలేదు. ఇదికూడా భగవంతుడుచేసిన వొక మేలే నని భావించాలి. ఆటువంటి నరకంలో పడితే బైటికి వచ్చే వుపాయం లేనేలేదు. ఈ బొంబాయిలో నేను అనుభవించిన కష్టాలు ఎటువంటి పగవానికైనా లేకుండ చేయవలసినదని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను.

సమయానికి ఈనాటకకంపెనీలో నౌకరీ దొరకక పోయినట్లైతే ఈపాటికి ఏ సముద్రంపాలో కావలిసి వచ్చేది.

నాహృదయంలో ఈ వ్యాకులత వ్యాపించడానికి కారణ మేమిటి? ఇక్కడ నన్నెవరు ముట్టుకున్నా సరే, ప్రాణంపోయినట్లే వుంటుంది. నాకు తెలిసినంత వరకు పరాయివాణ్ణి అంటుకుని యెరగను. బ్రతికినంత కాలం యేడుస్తూనే గడపవలసివచ్చింది. ఓస్వామీ! నా గతేమిటి?

నే నీవిధంగా ఏడ్వడ మెందుకు? ఏడ్చినంత మాత్రాన దుఃఖ మంతరిస్తుందా? వనమాలా! ధైర్యం తెచ్చుకో. ఇట్లా వెక్కివెక్కి యేడ్చినందువల్ల నీకు ముక్తి కలుగుతుం దని భావించుకో.

౨౭ ఆగష్టు, ౧౯—

ఇల్లు వదలినతరువాత గడిపిన మొదటిజీవితానికి యిప్పటి జీవితానికీ పోల్చుకుంటే యిప్పుడే కొంచెం సుఖ మనుభవిస్తూ వున్నట్టు నాకు తోస్తూవుంది. దానికి కారణం యిప్పుడు కొంచెం కొంచెంగా మనశ్శాంతి కలుగుతూవుంది. నేను విధవను. అయినా నిన్న అభినయం నేర్చుకోవడానికి సువాసినిలాగా వస్త్రాలు ధరించి అద్దం ముందు నిలబడినాను. అప్పటి నాసౌందర్యం చూస్తే నాకే ఆశ్చర్య మేసింది. నన్ను నేను గుర్తించుకో లేనంత భ్రమలో పడిపోయాను.

స్టేజిమీద తరుబాలకంటె నేనే అందంగా వుంటా నని చెప్పగలను. నన్ను చూడగానే ఆమె నేత్రాలు ఈర్ష్యతో నిండిపోయినై. నేను వెళ్తూ వుంటే మిగతా నటులు అంతా ఆశ్చర్యంగా చూస్తూ నిలబడ్డారు.

కాని శంకరు డంటేమాత్రం నాకు భయం. అక్క దగ్గరకు వెళ్లగానే నావైపు వొకపర్యాయం చూచాడు. ఆ చూపుతోనే నా వుత్సాహమంతా చల్లారిపోయింది.

తరుబాల గదిలోకి వచ్చినపుడు శాంతంగా లేదు. తలనొప్పిగా వున్నదా యేమి అని అడిగాను. కాని సమాధానం చెప్పక విసుక్కుంటూ ముసుగుపెట్టుకుని నిద్రపోయింది. నేనుకూడ ఆమెను పలకరించడం అంత బాగుండ దనుకున్నాను.

ఎందువల్లనో మంచి మంచి గుడ్డలు కట్టుకుని అందంగా వుండడమంటే నాకు మహాయిష్టం. నాజీవిత మంతటిలో నాకు నచ్చిన గుడ్డలు కట్టుకుని వుండలేదు. ఇప్పు డింకేముంది? నాజీవితమే వ్యర్థమైపోయింది. ఈ ప్రపంచంలోని స్త్రీలంతా నవ్వుతూ, పాటలుపాడు కుంటూ, కేరింతలుకొడుతూ వున్నారు. నేనుమాత్రం అట్లా యెందుకు వుండరాదూ? నేను నాభర్తను చంపానా?

౫ సెప్టెంబరు, ౧౯—

అహమదాబాదు అనాథాశ్రమంనుండి నాపిల్లవాడు మరణించాడని వార్త వచ్చింది. నా పూర్వజీవి

తములో మిగిలివున్న ఈ వొక్క స్మృతి చిహ్నంకూడా ఈ విధంగా లోపించినది. దానికి నాకేమాత్రం చింత లేదు.

వాడివల్లే యిన్ని కష్టాలు పడవలసివచ్చింది. ఈ జీవితంలో వాడు కావాలని యెప్పుడూ కోరుకో లేదు.

న న్నొక అస్పృశ్యురాలనుగా చూస్తున్నారు. ఇంట్లో చాకిరీ చేయడానికికూడ పనికిరానిదాని నై పోయాను. నే నెప్పుడూ బైట కాలు పెట్టి యెరగను. రాత్రింబవళ్లు పాకుపులతో బిచ్చగాండ్లతో తిరుగవలసి వచ్చింది. పనికోసం లెక్కలేనన్ని గడపలు త్రొక్క వలసి వచ్చింది. ఈ నాటకకంపెనీలో నే పనిదొరకక పోయినట్లైతే ఆత్మహత్య చేసుకొనవలసివచ్చేది.

కాని నా కిట్లా యేడుపు వస్తూవుందేమి? ఆ పిల్లవాడు బ్రతికివుండి యెప్పటికైనా వాణ్ని వెంట పెట్టుకుని ఈ విశాలప్రపంచంలో యేదో వొకమూలకు వెళ్లితే శాంతి దొరికేదికాదూ? వాడు కేవలం నన్ను... నన్నేప్రేమించుతూవుంటే ముసలితనంలో వాణ్ని చూచి నా కెంత సంతోషంగా వుండేది ?

నే నెంత పిచ్చిదాన్ని ? ఇటువంటి సంతానం వల్ల సుఖ ముంటుందా ? పాపానికి ప్రతిఫలం నే నెందుకు పొందాలి ?

వాణ్నిగురించి యిక ముందు అనుకొననుకూడ అనుకోను.

౧౦ సెప్టెంబరు, ౧౯—

ఎప్పుడు చూచినా సరే శంకరుడు తరుబాల దగ్గర కూర్చుని యేదో వొకటి మాట్లాడుతూనే వుంటాడు. వొకరి నొకరు పరిహాసాలు చేసుకుంటూవుంటారు. నేను అటుయిటు పోయేసమయంలో నావైపు చూచి కండ్లతో సైగలు చేసుకుంటూ నవ్వ మొదలుపెట్టారు. నా వశంలో వుంటే యిద్దర్నీ చెంపలు పగలగొట్టే దాన్ని. కాని శంకరుడు నాటకకంపెనీకంతా నాయకుడు. అతన్ని యెవరూ యేమీ చేయలేరు. చివరకు మేనేజరుకూడా అతనికి లొంగివుంటాడు. నేను శంకరునితో పోట్లాడి వొక్కరోజుకూడ ఈ కంపెనీలో వుండలేను.

తరుబాలకూడ సారా త్రాగుతుందని నిన్న నాకు తెలిసింది. అంతకుపూర్వం నాకు తెలియదు. నాటకం పూర్తి అయినగంటకు గదికి వచ్చింది. ఆమెకాళ్లు తడబడుతూవున్నై. శరీరం కంపిస్తూవుంది. ముఖానికి వేసుకున్నరంగుకూడా కడుక్కోలేదు. మంచినీళ్లిచ్చి పండుకోబెడదా మనుకున్నాను. కాని క్రోధస్వభావు రాలుకావడంవల్ల నే నేమీ జోక్యం కలుగచేసుకోలేదు. పల్చటిగుడ్డతో ముఖం కప్పుకుని ఆమెను చూస్తూ పండుకున్నాను.

ఆమె నేత్రాలు పక్తికాయల్లాగా ఎర్రబడి వున్నై. వాటిని చూడగానే నాకు భయమేసింది. కొంతసేపటికి మంచంమీద పండుకుని వళ్లు తెలియ కుండా నిద్రపోయింది.

స్త్రీకూడ సారా త్రాగుతూ వుండంటే అంత కంటె చింతించవలసినవిషయం ఇంకే ముంటుంది ?

నాకు అయిదుగంటలదాకా నిద్ర పట్టలేదు. తరుబాల రెండోదినం పగలు పన్నెండుగంటలకు నిద్ర లేచింది.

౧౯ సెప్టెంబరు, ౧౯—

నే నిప్పుడు రిహార్సలులో పార్టు తీసుకుంటు న్నాను. బాగా అభినయించ లేకపోయినా, బాగా పాడగలుగుతున్నాను. నాకు భయమే లేకపోతే యింకా బాగా పాడి అభినయం చేయగలుగుతాను. ఇంకా వీళ్లతో కలిసిమెలిసి వుండలేకపోతున్నాను. అప్పుడప్పుడు నటకులు పశువుల్లాగ ప్రవర్తించుతూ వుంటారు.

ఇక్కడ జరిగేవన్నీ చూస్తూవుంటే నాకు చాలా అసహ్యంవేస్తూవుంటుంది. చిన్నచిన్నకుర్ర కుంకలుకూడ నా యీడు ఆడవాళ్లను పరిహాసం చేస్తూ వుంటారు. వాళ్లు ఏమి మాట్లాడుతున్నారో వాళ్లకే అర్థం కాదనుకుంటాను.

నిన్న నేను బాగా పాడి అభినయించాను. మేనేజరుకూడ చాలా సంతోషించాడు.

౨౧ సెప్టెంబరు, ౧౯—

క్రొత్తగా వచ్చిన ఆ కవిరాజు కూడా గొప్ప రసికుడు లాగా కనిపిస్తూవున్నాడు. నాటకాలు వ్రాయడమే కాకుండా నటకులతో చేరి గోలకూడా చేస్తూవుంటాడు. ప్రారంభంలో తరుబాలను ఎక్కువగా ప్రేమిస్తూవుండే వాడు, కాని ఆ ప్రేమ యిప్పుడిప్పుడే నావైపుకు మరలుతూవుంది. దొరలాగా సూటు వేసుకుని కిల్లీ నములుతూ దర్జాగా వస్తాడు.

మాతండ్రికి సూటు వేసుకున్న వాళ్లను చూస్తే అరికాలిమంట నెత్తికెక్కుతుంది. కాని నీతి లేనప్పుడు ఇవన్నీ యెందుకు పనికివస్తవి?

౨౨ సెప్టెంబరు, ౧౯—

ఈరోజున నేను బాగా అభినయించాను. మేనేజరుకూడా నావద్దకు వచ్చి 'మిస్ వసంతసేనా! ఈ నాటకానికి నీవల్లే మంచిపేరు రావాలి' అన్నాడు. ఆమాట వినగానే నాకు అమితానందం కలిగింది. ఆ ఆనందంతోపాటు ఏడ్పుకూడా వచ్చింది. తరుబాల నేత్రాలు నిప్పులు గ్రక్కుతూవున్నై.

శంకరుడు ఆమెతో యేదో మాట్లాడుతూవున్నాడు. కాని నావైపు ప్రశంసాదృష్టితో చూడక వుండలేకపోయాడు. శంకరుడు ఎటువంటివాడైనా అద్భుతంగా అభినయించుతాడు. అతను మెచ్చుకున్నాడంటే మామూలువిషయం కాదు. అతనితో స్నేహం యెక్కువైనకొద్దీ అతనిలో వున్న విశేషాలన్నీ తెలుసుకుంటూ వున్నాను.

అతను నన్ను మర్యాదగా చూస్తూవున్నట్లైతే అన్ని విషయాలలోనూ తరుబాలకంటె నేను గొప్పదానవని అనుకునేలాగు చేసేదాన్ని.

శంకరుడికంటె జీవనుడే మంచివాడని తలంచవలసివుంటుంది. ఇప్పుడందరూ నన్ను మర్యాదగానే చూస్తున్నారు. ఆ ప్రాణజీవనుడు — విదూషకుని వేషం వేస్తూ వేస్తూ విదూషకుడుగా మారిపోయాడు— నన్ను ఆదరభావంతో చూస్తాడు. ఇతనన్నా, శంకరుడన్నా బొంబాయివాళ్లంతా ప్రాణాలు విడుస్తారు. ఎప్పటికైనా వాళ్లిద్దర్నీ మించగలుగుతానని నాకు గట్టి నమ్మకముంది. తరుబాలవిషయం చెప్పనే అవసరంలేదు. అభినయించడంలోనూ, పాడడంలోనూ తరుబాలకు మంచి పేరువుంది. కాని దవడలు ముడతలు పడుతూవుంటై. అవసరంకంటె ఎక్కువగా అభినయం (Over act) చేస్తుంది. నాటకం జరిగేసమయంలో నేను వింగులో కూర్చొని అందర్నీ చూస్తూవుంటాను. అందరికంటె శంకరుడే అందంగా కనబడ్తాడు. నాటకాలకు బాగా అలవాటుపడ్డాను. ఎప్పుడు ప్రొద్దుగూకుతుందా, యెప్పుడు స్టేజిమీదకు వెళ్లుదామా అనే వుంటుంది.

౨౯ సెప్టెంబరు, ౧౯—

ఈరోజు మధ్యాహ్నం రిహార్సలు జరుగుతూవుంది. నే నేదో పనిమీద లోపలకు వెళ్లి తిరిగి వస్తూవుండగా శంకరుడు ఎదురైనాడు. అందరూ వెళ్లిపోయారు. అక్కడ యెవరూ లేరు. నేను అతనివైపు చూడకుండానే వెళ్తూవున్నాను. ఇంతలో...అబ్బా! వ్రాయడానికి చేతులు రావడంలేదు. నేను బలంకొద్దీ అతనిబాహుపాశాలను వదిలించుకుని పరుగెత్తాను. నాతల గిరగిర తిరిగిపోతూ వుంది. నేను తిన్నగా గదికి వెళ్లి పక్కమీద పడుకున్నాను. నా హృదయం కంపింప సాగింది. నా బావ నా పెదవులనే తాకాడు. కాని ఈదినం అంతకంటె ఘోరమైనపని జరిగింది. ఆ సమయంలో నేను చాలా చిన్నదాన్ని అగుటవల్ల భయంచేత స్పృహ తప్పి పడిపోయాను. ఈదినంకూడా భయమేసింది కాని అంత ప్రమాదం సంభవించలేదు.

అతన్ని నానోటికి వచ్చినట్లు తిట్టాను. కొంత సేపటికి ముఖం కడుగుకుని మళ్లీ వచ్చి చూడగా శంకరుడు ఇంతకు పూర్వం వున్నచోటనే యేమీ జరగనట్లు నిశ్చింతగా కూర్చుని వున్నాడు. నా కాసమయంలో అక్కడ యేమీ పనిలేదు. అందువల్ల నేను అక్కడ లేక పోయినా నేను లేనని అనుకున్నవాళ్లెవరూ లేరు. తరుబాల అనుమానంతో నావైపు, శంకరునివైపు వోరగంట చూస్తూవుంది.

శంకరునిమీద పూర్తిగా కోపం వచ్చినప్పటికీ, ఎందుచేతనోగాని నే నొక విధమైన ఆనందాన్ని అనుభవించుతూ వున్నట్లు వుంది. అందువల్ల శంకరునిమీద వున్న కోపం కొంచెం కొంచెంగా తగ్గ నారంభించింది.

వనమాలా! జాగ్రత్త! ఆ కష్టాలన్నీ అప్పుడే మరిచిపోయావా? వొకతప్పుకే యెన్నోకష్టాలు అనుభవించావు. మళ్లీ తప్పుచేశావా నీవు కడతేరేమార్గం లేనే లేదమ్మో.

ఓ తల్లీ! నన్ను రక్షించడానికి నీవెందుకు బ్రతికి వుండలేదూ? నీవు బ్రతికివుంటే నేను ఇన్నికష్టాలు పడవలసిన అవసర మేముంది? నీవు స్వర్గంలో వుండి నీకూతురు అనుభవిస్తూవున్న కష్టాలను జూచి కంటతడి పెట్టుకుంటూవుంటా వనుకుంటాను. అమ్మా! ఓ అమ్మా! నన్ను రక్షించు. ఈపాపపంకిలంలో పడుతూ వున్నదాన్ని రక్షించు.

అమ్మా! నీవు జ్ఞాపకం వచ్చినప్పుడల్లా నాకు కొంచెం మనశ్శాంతి కలుగుతూ వుంటుంది. ఈప్రార్థన వాక్యాలు కాగితంమీద వ్రాస్తూవుంటే నా కొకవిధ మైనబలం చేకూరుతూవుంది. అమ్మా! నీవు నాసమీపం లోనే వున్నావా? తప్పక రక్షించుతావు. నా తప్పు లన్నిటినీ మన్నించుతావు.

౯ అక్టోబరు, ౧౯—

ఇం కొక వారం రోజుల నాటికి క్రొత్తనాటకం వేస్తారు. ఇప్పటినుండే ప్రయత్నాలు బాగా జరుగుతూ వున్నై. వొక్క క్షణంకూడా యెవరికీ తీరిక వుండడం లేదు. కథానాయిక వేషం నేనే వేస్తాను. నేను ధరించ బోయే దుస్తులుకూడా చాలా అందంగా వున్నై. వాటిని చూడగానే నాకు అపరిమిత ఆనందం కలిగింది. అవి ధరించుకుని స్టేజీమీదకు వచ్చినపుడు చాలా అందంగా కనుపించుతాను.

ఇన్నికష్టాలు అనుభవించుతూకూడా వొకవిధ మైన ఆనందాన్ని పొందుతూవున్నాను. ముఖం అద్దం లో చూచుకున్నప్పుడు నాకు నవ్వు వస్తూవుంటుంది.

ఈసౌందర్యం యెందుకు? యింకొకరికొరకు కాకపోయినా నాకొరకే యెల్లప్పుడూ సౌందర్యంగా వుండ ప్రయత్నిస్తాను. నాకు ఆనందం కలుగుతూ వున్నప్పుడు నే నీవిధంగా చేస్తేమాత్రం తప్పేముంది? రేపు గ్రాండురిహార్సలు జరుగుతుంది.

౧౩ అక్టోబరు, ౧౯—

ఈవేళ గ్రాండు రిహార్సలు జరిగింది. ముఖానికి రంగు అద్ది దుస్తులను ధరించి అద్దంలో చూచు కున్నాను. నాముఖంలో కలిగిన మార్పుకు నాగుండె దడదడ కొట్టుకోసాగింది. నేను పదిహేనేళ్ల వయస్సు గలదాన్నిగా కనిపించాను.

నేను స్టేజీమీదకు పోగానే నటకు లంతా కొంచెంసేపటివరకు నన్ను చూస్తూనే వున్నారు. శంకరుడు తెరవెనుక నన్ను కలుసుకున్నాడు. నన్ను చూచి అక్కడనే ఆగిపోయి చెయ్యిపట్టుకుని రానివ్వకుండా ఆపాడు. నేను చెయ్యి వదలించుకో ప్రయత్నించాను కాని అతను వదలలేదు. 'నేనా! నీ వింత అందంగా వుంటావని నా కేం తెలుసును? నిజంగా నాకు తగిన ప్రియురాలవు దొరికావు' అంటూ నవ్వుతూ వెళ్లి పోయాడు.

౧౪ అక్టోబరు, ౧౯—

నిన్న నేను శంకరునికి స్వాధీన మైనాను. ఎట్లా స్వాధీన మైనదీ నాకే తెలియడంలేదు. మొదట వున్న భయం యిప్పుడు లేనేలేదు. మొదట వున్న సంకోచం కూడా లేదు. ఇదంతా యేవిధంగా జరిగిందో నాకు యిప్పటివరకు తెలియకుండావుంది.

శని, ఆదివారాలు బాగా పరిశ్రమ చేయడంవల్ల నిన్నరాత్రి నాకు చాలా బడలికగా వుంది. ఇంత సఫలత పొందినతర్వాతకూడా నే నొక్కదాన్నే గదికి పోవడ మంటే నాకు మనస్కరించలేదు. ఎవరైనా వచ్చి నన్ను కౌగలించుకుని నా ఆనందభారాన్ని తగ్గించితే బాగుండు ననిపించింది.

ఆ సమయంలోనే శంకరుడు వచ్చాడు. నాబడలిక పోవడానికి అతను యేదో కొంచెం మం దిచ్చాడు. నేను దాన్ని త్రాగాను. కొంతసేపటికి చిన్నపిల్లదాని మోస్తరుగా నేను అతనివశ మైనాను. మైమరిచి అభిన యించే సమయంలో శంకరుడే నా భర్త అని భావించు కుంటూ వుంటాను.

నేను అతన్ని ఎందుకు ద్వేషించాలి? ఈ నాటకకంపెనీలో చేరినతరువాతే నా కింతపేరు వచ్చింది.

కాబట్టి ఆ వాతావరణానికి అనుకూలంగా నేనుమాత్రం ఎందుకు వుండకూడదు? పుట్టిపెరిగిన ప్రపంచంతో నా కేమిసంబంధం? దానివలననే గడపగడప త్రొక్కుతూ నిష్కల్మషహృదయంలో పాపబీజాలు నాటుకోవలసి వచ్చింది. నిష్కారణంగా పతిత నని అనిపించుకోవలసి వచ్చింది. అటువంటప్పుడు ఆ నియమాలను ఎందుకు అనుసరించాలి? అవును. ఎందుకు అనుసరించాలి ?

శంకరుని దగ్గరకు పోవా లని బుద్ధి పుడుతూ వుంటుంది. కాని అతను కనిపించగానే వొకవిధమైన ద్వేషం కలుగుతుంది. నా ఆత్మ అతనికి దూరంగా పారిపోవా లనుకుంటుంది. అయితే శరీరంమాత్రం అతనివైపుకే గుంజుతూవుంటుంది. ఇప్పుడు మే మిద్దరం వొకటె. మే మిద్దరం వొకేమార్గాన్ని అనుసరించు తున్నాము. నాలో యేదొప్రతిభ చూచి కీర్తంతా యీవిధంగా పాకుడుతూవున్నారు? ఒకవైపు కీర్తి, ఇంకొకవైపు డబ్బు, రెండూ సమకూరుతూవుంటై. ఇప్పుడు సమాజంచేత బహిష్కరించబడిన వ్యక్తినైను కాను. స్త్రీలంతా నాపోస్తరుగా వుండడానికి ప్రయత్నిస్తారు. నన్ను, నాపాటను, నా అందాన్ని అనుకరణ చేస్తారు. నా మాదిరిగా వుండడం గౌరవ మనికూడా తలుస్తారు. ఇవన్నీ వాళ్లచే బహిష్కరింపబడిన వనమాల ద్వారా తిప్పక జరిగితీరుతవి. వనమాలద్వారా కాదు —ఆమె చనిపోయింది — వసంతసేనద్వారా.

నేను పుట్టి పెరిగిన ప్రపంచంతో ఈ నాటినుండి సంబంధం లేకుండా చేసుకున్నాను. నే నొకరిదాన్ని కాదు. నేను ఎవరికీ భయపడవలసిన అవసరం లేదు. నాకు నేనే. నాయిష్టం వచ్చినట్లు ప్రవర్తించుతాను. న న్నెవరు కా దంటారు?

అమ్మా! నీవే బ్రతికివుంటే నావిజయానికి ఎంత సంతోషించేదానివి! ఏవిధంగా సంతోషించగలిగే దానివి? నీవు వుంటే యిటువంటిమంచిరోజులు ఎట్లా చూడగలిగేదాన్ని? నీవు లేకపోవడమే మేలు.

వెనుకటిదినాలు నా కేమాత్రం జ్ఞాపకం రావడం లేదు. నాకండ్లకు వొకవస్తువుమాత్రం కనబడుతూవుంది. అదే విజయం ! విజయం !! విజయం !!! ఓహో! తెల్లవారబోతూవుంది. నిద్రపోతేగాని వీల్లేదు; లేక పోతే పగలు వేయబోయేనాటకంలో అవులింతలు వస్తై.

శంకరునిదగ్గర అభినయం నేర్చుకో మొదలు పెట్టినపుడు అతను తాకితే సరి నామనస్సు కెంతో అయిష్టంగా వుండేది. ఇప్పుడు ఆ విధంగా వుండడమే లేదు. నాటకరంగంమీద వుండి మగవారిని తాకకుండా మడికట్టుకుని వుండా లనుకుంటే యెట్లా వీలౌతుంది ? నేను ఇంకో చోటికి ఎక్కడికైనా వెళ్లగలుగుతానా?

నేను చాలా అందంగా వున్నానని అనుకోవడం వల్లనే కావచ్చు ఈ రోజున బాగా అభినయించగలిగాను. తరుబాల మినహా అందరూ ప్రశంసించారు. శంకరుని ఆనందం చెప్పడానికే వీలులేదు.

నా కిప్పుడు అలసటగా వుంది. ఈ రోజున చేసినట్టు ప్రతిరోజూ చేయగల్గుతానా ? అనేకవిధాలుగా పొగడుతూ ప్రకటనలు చేస్తున్నారు. కాని సఫలత పొందగలనా? తరుబాలను నే నేమి చేశాను, ఆమె న న్నింతగా ద్వేషించడానికి ?

౨౮ అక్టోబరు, ౧౯—

మేనేజరుకు ఇంకా నచ్చలే దనుకుంటాను. అందువల్ల యింకా రెండుమూడు పర్యాయాలు రిహార్సలు జరగవలసివచ్చింది. రేపు సరిగా చేయగలుగుతానో లేదో అనేభయం కలుగుతూవుంది.

౨౯ అక్టోబరు, ౧౯—

నేను నెగ్గగలిగాను. చూడవచ్చిన జనం కొట్టిన చప్పట్లధ్వని నా చెవులలో ఇంకా ప్రతిధ్వనిస్తూనే వుంది. వొకస్వప్నంలాగా అంతా బాగా జరిగింది. తెల్లవారింది. కాని నాకంటికి నిద్ర వుంటేగా? ఇప్పటికికూడా చూడవచ్చినజనం, స్టేజీతెరలు నాకండ్లకు కనబడ్తూనేవున్నై.

అతన్లో యేదో మంత్రశక్తి వుంది. లేనట్టయితే వొకవైపు అతన్ని ద్వేషించుతూకూడా అతనిదగ్గరకే ఎందుకు వెళ్లుతున్నాను ?

30 నవంబరు, ౧౯—

ఎన్నోరోజులతర్వాత మళ్లీ ఈ వేళ వ్రాయడానికి కూర్చున్నాను. వ్రాస్తూవుంటేనేగాని నా

మనస్సుకు తేలికగా వుండదు. డైరీచేతితో ముట్టుకోవడానికే భయమేస్తూవుంది. నాకు జ్ఞాపక మున్నదంతా వ్రాయనా? రోజురోజుకూ అధఃపతనానికి పోతూ వున్నాను. దానినిగురించి వ్రాయడ మంటేనే నాకు వణుకుపుడుతూవుంది. వీటి నన్నిటినీ మరిచిపోవడానికి ఇం కొక్కటిమాత్రం మిగిలివుంది — సారా.

తరుబాల మొదటిలాగా ద్వేషించడం లేదు. దాదాపు మే మిద్దరం వొకే శ్రేణిలో వున్నాము. శంకరుడుకూడా ఆ విధంగానే భావించుకుంటున్నాడు. అతనికి ఎవరిమీద యిష్ట ముంటుందో వాళ్లనే పిలిపించుకుంటాడు.

తరుబాల అంటే నా కేమాత్రం ద్వేషం లేదు. ఎందుకు ద్వేషించాలి? శంకరు డంటే నా కిష్టం లేదు. నిజానికి నా అంతరాత్మ అతన్ని ద్వేషించుతూనేవుంది.

శంకరుడు నామీద వొకవిధమైన అధికారం చెలాయించుకుంటూ వున్నాడు. అందువల్ల వొక యంత్రంలాగ అతను చెప్పినట్టు చేయవలసి వస్తూవుంది. కాని అప్పు డప్పుడు అతను నిద్రపోయేసమయంలో గొంతు పిసికివేయాలనేటంత కోపంకూడా వస్తూవుంటుంది.

ఇదంతా వ్రాయడంమూలంగా పిచ్చిదాన్ని అయిపోయేటట్లున్నాను. సారా......సారా......

౧౩ జనవరి, ౧౯—

క్రొత్తనాటకం అయిపోయింది. దానిలో మొదటి కంటె యెక్కువ మంచిపేరు వచ్చింది. కాని మునుపటిలాగా నాకు ఆనందం కలగడంలేదు. కొంతమంది బుద్ధిహీనులు వుత్తరాలు, పారితోషికాలు పంపసాగారు. వాటితో నాగది అంతా నిండిపోతూవుంది. అప్పుడప్పుడు కొంతమంది నన్ను చూడడానికని వచ్చి తెగ పొగుడుతూవుంటారు. వాళ్లను చూస్తే నాకు నవ్వువస్తూ వుంటుంది. వాళ్లలో నాకళను ఆకర్షించి వచ్చేవాళ్లెవరూ లేనట్టు తోస్తూవుంది.

౨ ఫిబ్రవరి, ౧౯—

వనమాలబావ వసంతసేనను పూజించడానికి వచ్చాడు. ఎంత విచిత్రం! ఒకప్పుడు అంట్లుతోముకుని బ్రతికిన వనమాలనని స్వప్నంలోనైనా అనుకున్నాడా? నా రూపమంతా మారిపోయింది. ఇటువంటి వాళ్లు ఎంతమందో నాపాదాలు ముద్దుపెట్టుకోవడానికి వస్తూవుంటారు.

వాళ్లస్థితి అంతా మారిపోయిన దనుకుంటాను. దరిద్రం తాండవిస్తూవుంది. అతన్ని చూచినప్పుడు కోపంగాని, అనాదరభావంగాని కలగలేదు. జాలి కలిగింది.

నే నెటువంటిదాననైనా యిటువంటి నరాధముని చేతిలో చిక్కుకునేటంత నీచురాల్ని కాదు. ఇప్పటి నాజీవితం మీకు యెంతో నీచంగా కనుపిస్తూవుండవచ్చు. కాని నాకు మొదటిజీవితముకంటె ఈ జీవితమే యెన్నో రెట్లు హాయిగా వుంది.

౪ మార్చి, ౧౯—

దాదాపు రెండునెలలనుండీ వొకమనిషి వచ్చి మధ్యకుర్చీలో కూర్చుంటూవున్నాడు. అతన్ని చూడాలని నాకు మహాకోరికగా వుంటుంది. ఆయన్ని చూడనిది నామనసుకు ఆనందం వుండదు.

ఆయన నన్ను చూడడానికే వస్తూ వున్నట్టు కన్పిస్తూవుంది. దానికి కారణం నేను వేషం వేయకపూర్వం ఎప్పుడూ వచ్చినట్టు లేదు. నన్ను కన్నార్పకుండా చూస్తూవుంటాడు.

నేను ఆయన్ని యెక్కడనో చూచాను. తెల్లవాళ్లలాగా సూటు వేస్తాడు. మిగతావాళ్లకు ఆయనకు చాలా భేదం వుంది. ఆయనముఖం చూడగానే సజ్జనుడు అని తలంచవలసి వుంటుంది. ఆయన యెవరు? నాకెప్పుడూ వుత్తరంగానీ, పారితోషికంగానీ పంపించి వుండలేదు. నన్ను చూడడానికికూడా ప్రయత్నించలేదు. అయితే యెప్పుడూ యెందుకు వస్తూవుంటాడు? నేను ఆయన్ని చూచాను. కాని నేను చూచిందెక్కడ?

౯ మార్చి, ౧౯—

ఆయన ఈదినంకూడా వచ్చాడు. 'ఆయన ఎందుకు వస్తున్నాడు? యేమి చూస్తున్నాడు?' అనే చింత నాకు కలుగుతూవుంది. నటకులంతా నన్ను ఎగతాళి చేస్తూవుంటారు. వారిలో శంకరుడు, ప్రాణజీవనుడు ముఖ్యులు.

శంకరుడు నన్ను ద్వేషించడం యిదే మొదటి పర్యాయం. ప్రాణజీవనుడుకూడా నన్ను కొంచెంకొంచెంగా ప్రేమించసాగాడు. శంకరుణ్ణి యేడిపించడమంటే నాకు మహాసరదా. అందువల్ల అతను చూస్తూ వుండగానే ప్రాణజీవనునితో పరిహాసా లాడసాగాను. శంకరుడు ఏమి చేసినా సరే నేను చూస్తూ వూరుకో వలసినదేనా ?

౩౧ మార్చి, ౧౯—

అవసరానికి మించి సారా త్రాగ ప్రారంభించాను. నా దవడలుగూడా కుంటలుపడుతూవున్నై. తరుబాల మోస్తరుగా నేనుకూడా కృత్రిమశృంగారం చేసుకో సాగాను. అప్పుడప్పుడు నాలో వున్న ఆలోచనాశక్తి అంతరిస్తూ వుంటుంది.

కాని ఆ మనిషి! ప్రతిదినం రావడానికి కారణం? నాలో కలిగే పరివర్తనకు ఆయన నిరాశ చెందుతూ వున్నట్టు కనబడుతూవుంది; లేక నా బుద్ధిమాంద్యం వల్లనే ఆవిధంగా అనుకుంటూవున్నానేమో. ఆయన ప్రతిదినం రా మొదలుపెడ్తే నేను పిచ్చిదానినై పోయేటట్టున్నాను.

౧౦ ఏప్రిల్, ౧౯—

శంకరుడు, తరుబాల, నేను వొకటిగా కూర్చుని సారా త్రాగుతున్నాము. శంకరుడు తరుబాలను 'యేదో' చేశాడు. నాకు కోప మొచ్చింది. ఎప్పుడూ యిట్లా జరుగుతూనే వుంటుంది. కాని కోపం యెప్పుడూ రాలేదు. ఏ కారణంచేతనో ఈరోజు కోపం వచ్చింది. అక్కడనుండి లేచి నాగదికి వెస్తూవున్నాను. మధ్యలో ప్రాణజీవనుడు ఎదురైనాడు. నేను స్పృహలో లేను. అతను ఏమన్నాడోకూడా నాకు జ్ఞాపకంలేదు. కాని ప్రొద్దుననే లేచి చూస్తే ప్రాణజీవనునిగదిలో వున్నాను. ఇదీ కొంత మేలె. ఆ శంకరుడు వొక పెద్దమనిషిలాగా నామీద అధికారం చెలాయించుకో చూస్తాడు. నరకంలో పడబోయేదానికి నా కేం భయం? ఏపనిచేసినా బాహాటంగానే చేస్తాను. తరుబాలకంటె నేనే మంచిదాననని నేను లేనప్పుడుగాని అతనికి తెలియదు. దాహం వేసినప్పుడే మంచినీళ్ల విలువ తెలుస్తుంది.

౧౪ ఏప్రిల్, ౧౯—

శంకరుడు తరుబాలను వదిలేశాడు. అతను నన్ను రెచ్చగొట్టడానికే ఆమెతో సఖ్యం చేసుకున్నాడు. ఇప్పుడు దుఃఖిస్తున్నాడు. పిచ్చివాడిలాగా నావైపూ ప్రాణజీవనునివైపూ చూస్తూవుంటాడు. సారాకూడా బాగా త్రాగుతాడు. ఇకనుండి అతనివైపు చూడదలుచుకోను చూడను.

కొద్దిరోజులనుండీ ఆయన రావడమే లేదు. నాదృష్టంతా ఆయన కూర్చునే కుర్చీమీదే వుంటూవుంది. కాని ఆయనకు బదులు ఇంకెవరైనా కూర్చుని వుంటారు. ఆయన రాకపోవడంవల్ల నా కెట్లాగో వుంది. కాని ఆయన రాకుండా వుంటేనే నయం. ఆయన వస్తే నేను అభినయం బాగా చేయలేను. మళ్లీ నాకూ తరుబాలకూ స్నేహం కుదిరింది.

౫ మే, ౧౯—

ఇక జన్మజన్మాంతరాలకుకూడా ముక్తి కలగడం అసంభవం. నేను నానాటికి ఇంకా పతనస్థితికి పోతూవున్నాను. ఈరోజు ఆదివారం. నాటక హాలంతా జనంతో కిక్కిరిసిపోయింది. ఈరోజున మళ్లీ ఆయన వచ్చి తనచోట్లో కూర్చున్నాడు. ఇన్నిరోజులకు మళ్లీ ఆయన రావడం చూస్తే నాకు ఆశ్చర్యమేసింది.

నాటకం పూర్తి అయినతరువాత నేనూ తరుబాలా 'డ్రెస్సింగు రూమ్'లో దుస్తులు మార్చుకుంటూ వున్నాము. ఇంతలో కంపెనీ మేనేజరు వచ్చి 'గిరీశ పాండ్య అనే ఆయన నీతో మాట్లాడడానికి వచ్చాడు' అని నాతో చెప్పాడు. ఎప్పుడూ ఇట్లా జరుగుతూనే వుంటుంది. అందువల్ల ఆయన్ని ఇక్కడకు పంపించమన్నాను.

కొంచెంసేపటికి ఆమనిషి వచ్చి వాకిటిదగ్గర నిల్చున్నాడు. 'గిరీశపాండ్య' అనేపేరు వినగానే ఇంకా యేదో జ్ఞాపకం వచ్చింది. మా యింటిపొరుగున వున్న మాఅమ్మ స్నేహితురాలి కొడుకా?

ఆయన వాకిటి దగ్గరనే నిలబడిపోయి యేదో ఆలోచించుకుంటూ కొంచెంసేపటిదాకా యేమీ

మాట్లాడలేదు. నేనుకూడా శ్వాస బిగబట్టి ఆయన ఎప్పుడు మాట్లాడుతాడో విందామని ఎదురు చూస్తున్నాను.

'మిస్ వసంతసేనా! కష్టపెట్టడానికి వచ్చాను క్షమించాలి. కాని నేను...నేను వొక అమ్మాయిని' అని యేదో చెప్పబోయి సందేహించాడు. కొంతసేపటికి మళ్లీ ప్రారంభించి 'ఎరుగుదును. ఆ అమ్మాయే నీ వని అనుకుంటాను. నేను చాలారోజులు ఇంగ్లండులో వుండి వచ్చాను. తిరిగి వచ్చినతరువాత ఆ అమ్మాయి ఎక్కడికో పోయిందని తెలిసింది. నిన్ను చూసినప్పటినుండీ ఆఅమ్మాయివి నీవేనని మనస్సులో అనుకుంటూవుంటాను. నీవు మాష్టరు వసంతరాయిఠాకూరు వనమాలవు కామా?' అని అన్నాడు.

కొంచెంసేపటివరకూ నాగుండె ఆగిపోయినట్లైంది. చిన్నప్పటివిషయాలన్నీ కొంచెం కొంచెంగా జ్ఞాపకమొస్తూవున్నై. ఈ నరకంనుంచి విముక్తి చెందడానికి నాఆత్మ పరితపిస్తూవుంది.

కాని నాకు విముక్తి దొరకడమనేది సులభసాధ్యం కానిపని. నేను మనస్సు గట్టిపర్చుకుని 'కాదండి ఆమెను నేను కాదు' అన్నాను.

ఆయన విచారపడుతూ బైటికి వెళ్లిపోయాడు. నేను తరుబాలవైపుకు తిరిగి దగ్గరగా వున్న సీసాను తీసుకుని వొకగిన్నెడు ఎక్కించాను. తరుబాల ఆశ్చర్యంగా చూస్తూ ఆయన యెవరని అడిగింది. 'ఎవరో' అని పూర్తిగా జవాబు చెప్పకనే రెండోగిన్నె నింపాను. ఆశ్చర్యంగా చూస్తూవున్న తరుబాలను వదిలిపెట్టి నేను నాగదికి పోవడానికి లేచి నిల్చున్నాను.

ఈ సారంలేని జీవితాన్ని ఇంత గొప్పగా చూడడం దేనికి? ఈ కాలమంతా సారా త్రాగడంలోనే గడిపినట్లైతే యెంత బాగుండేది!

(గుజరాతీ కథ ననుసరించి)

# రసాయనశాస్త్రము

## అణువాద చరిత్ర

శ్రీ కుప్పా ప్రసన్నాంజనేయులు

ఆదికాలమునుండియు మానవుని ప్రజ్ఞను 'ప్రపంచ మెట్లు కలిగినది' యను ప్రశ్న యాకర్షించుచున్నది. ప్రతిజాతివారును ఈ ప్రశ్న కుత్తరము చెప్ప ప్రయత్నము చేసియున్నారు. ఈ ప్రశ్న కివ్వబడిన సమాధానమునుబట్టియే ఆయాజాతుల నాగరికతకు విలువ కలిగినది. ప్రస్తుతకాలపు నాగరికత లన్నిటియందును పాశ్చాత్యనాగరికత మిన్నయైయున్నది. పాశ్చాత్యులు ఈ ప్రశ్నను చాలముఖముల పరిశీలనచేసియున్నారు. భౌతికశాస్త్రము, రసాయనశాస్త్రము, వృక్షశాస్త్రము, మృగశాస్త్రము, భూపారశాస్త్రము, జ్యోతిశ్శాస్త్రము మొదలగు శాస్త్రములు ప్రకృతి నొక్కొక్క విధముగ విమర్శించి విశేషములను కనుగొనుచున్నవి. ఈ విషయమున పాశ్చాత్యుల కృషి యెంతయు ప్రశంసనీయము.

అయినను పాశ్చాత్యులకు పూర్వము ఈ విషయము నేజాతివారును విచారించి యుండకపోలేదు. భారతీయులు, ఐగుప్తులు, గ్రీకులు, రోమనులును ఇట్టి విషయములను బాగుగనే విమర్శించియున్నా రనుటకు పెక్కు నిదర్శనములు గలవు. పాశ్చాత్యపండితులకు శాస్త్రములకృషి సలుపుటకు ప్రథమమున ఆధారములైనవి గ్రీకుల గ్రంథానువాదములే! భారతీయులును గ్రీకులును చాల పూర్వకాలమందే శాస్త్రీయ విషయములందు కృషి సలిపిరి. గ్రీకుపండితులు క్రీస్తునకు ౬౦౦ సంవత్సరములకు పూర్వమునుండి ౧౦౦౦ సంవత్సరములవరకు ప్రబలియున్నట్లు పరిశోధనలు నిరూపించుచున్నవి. భారతీయుల విజ్ఞానము ఏకాలము నాటిదో నిర్ణయించుటకు పరిశోధకులకు ఎవరెస్టు శిఖారారోహణమువలె అగమ్యముగ నున్నది. అయినను ప్రస్తుతము రసాయనశాస్త్రమున కవసరమైనంతవరకు కొన్ని విషయములను పరిశీలించెదను.

గ్రీకుపండితులచే ప్రతిపాదనచేయబడిన సూత్రములు పాశ్చాత్యపండితులకు దారిచూపినవి. డెమొక్రటిస్, డిమోసాక్రిడీసు పరమాణువాదమును కొంత వివరించిరి. వీరు పరమాణువులను కొన్ని జాతులుగా విభజించిరి. కొన్ని ప్రత్యేకగుణములుగల పరమాణువులచే నేర్పడుటచే పదార్థములు వేరు వేరు విధములైయున్నవని వారు ప్రతిపాదించిరి. వారి ననుసరించియే డాల్టన్ పండితుడు పాశ్చాత్య ప్రపంచమున ప్రథమమున అణువాదమును ప్రతిపాదనచేసెను. గ్రీకుపండితుల కాలమునుండి డాల్టనుకాలమువరకు శాస్త్రపరిశోధనవిషయము అవగింజయంతైన నభివృద్ధి గాన్పించదు.[1]

డాల్టను పండితుడు తన అణువాదము నీ క్రింది విధమున నిర్వచించెను:—

(౧) ప్రతి ద్రవ్యమును అణువు లనబడు అతిసూక్ష్మరేణువులచే నేర్పడును.

(౨) ఒకేతత్త్వము(Element)యొక్క అణువు లన్నియు ఒకేవిధముగ నుండి మరియొకతత్త్వపు అణువులకంటె విలక్షణముగ నుండును.

(3) అణువులు నిత్యములు (అనగా పుట్టుకయు నాశనమును లేనివి.)

(౪) ఒకజాతి అణువులు మరియొకజాతి అణువులతో కొద్ది పూర్ణాంకసంఖ్యలచొప్పున సేకకలయిక చెందును.

1. ఇందుకు కారణములను 'రసాయనశాస్త్రము: చారిత్రికము' అనువ్యాసమునందు భారతి పత్రికయందు నేను పూర్వము వివరించియున్నాను.

(౫) ఒకసంకరము (compound)యొక్క విశిష్టాణువు లన్నియు (molecules) ఒకేవిధముగా నుండును.

ఈయణువాదము స్పష్టముగా నిర్వచింపబడినప్పటి నుండియే పాశ్చాత్యపండితులు భౌతికవికారము (Physical change)నకును రసాయనప్రక్రియకును భేదమును బాగుగ గమనింపసాగిరి. రసాయనప్రక్రియచే వేరువేరు జాతియణువులు కలసి క్రొత్తజాతి అణుపుంజము (molecules)లుగా నేర్పడునని పైయణువాద సిద్ధాంతములబట్టి తేలుచున్నది. భౌతిక వికారమునందు ఒక పదార్థముయొక్క బాహ్యగుణములయందు తాత్కాలికముగ మార్పు గలిగినను, దానిఅణువుల విన్యాసమునం దట్టి మార్పును గలుగదు. ఈ విషయములను డాల్టను ప్రథమమున ఊహచేతనే నిశ్చయించి పిమ్మట వానిని కొన్ని ప్రయోగములచే యథార్థములని ఋజువుచేసెను.

ప్రయోగము:— రెండు గాజుప్రమిదెలయందు (Watch Glass) కొంత గంధకమును కొంత లోహక్షోదము (Iron filings)ను గ్రహించుము. రెంటిని విడివిడిగా రెండుకల్వములయం దుంచి బాగుగ చూర్ణము చేయుము. సన్నని రేణువులుగా నగును. ఒక భూతద్దములో పరిశీలింపుము. గంధకరేణువు లన్నియు ఒకరంగుగను, లోహరేణువు లన్నియు ఒకరంగుగను కనిపించును. మరియొక కల్వమునందు కొన్ని గంధకరేణువులను, కొన్ని లోహరేణువులను చేర్చి కలియనూరుము. ఒక మిశ్రద్రవ్యము లభించును. ఇది గంధకమంత పసుపువన్నెయు లోహమంత నలుపువన్నెయు గాక మధ్యరంగుగా నుండును. గంధకాణువులను లోహాణువులను కలసియున్నట్లు ఒక భూతద్దముతో పరిశీలింపుము. గంధకరేణువులును లోహరేణువులును విడివిడిగా కనిపించును. రేణువులు కలయిక చెందలేదు. తిరిగి కొన్ని గంధకరేణువులను కొన్ని లోహరేణువులను ఒకమూసయం దుంచి కాచుము. కొంత సేపటికి గంధకము ద్రవించును. కొంత గంధకము లోహముతో గలసి యొక నల్లని పదార్థము నేర్పడును. మూస చల్లబడినతరువాత దానియందలి పదార్థమును వేరుగ తీసి పరిశీలించుము. గంధకరేణువులుగాని లోహరేణువులుగాని గానరావు. అయస్కాంతము(magnet)తో పరిశీలింపుము. మూసలోని పదార్థ మాకర్షింపబడదు. పిమ్మట దానిని కర్బనద్విగంధకిదము (Carbon-di-sulphide)న నుంచి కదలించుము, లీనము గాదు. క్రొత్త పదార్థ మేర్పడినదని నిర్ణయమగుచున్నది.

పై ప్రయోగమునం దేర్పడిన క్రొత్తపదార్థము లోహగంధకిద మనబడును. ఇది లోహముయొక్కయు గంధకముయొక్కయు మిశ్రణముచే గలిగిన ద్రవ్యము గదా! అయినను లోహగంధకముల కల్వములో కలియనూరుటచే లభించిన మిశ్రద్రవ్యమునకును దీనికిని తేడా గలదు. కల్వమందలి మిశ్రద్రవ్యమును భూతద్దముచే పరిశీలింపగా లోహరేణువులును గంధకరేణువులును విడివిడిగా గనిపించెను. మూసయందు తయారైన మిశ్రద్రవ్యమునందు వట్టికంటితో జూచినగాని భూతద్దములో జూచినగాని లోహగంధకముల రేణువులు కనిపించలేదు. మొదటి మిశ్రద్రవ్యమునందు లోహముయొక్కయు, గంధకముయొక్కయు భౌతికగుణములు మార్పుచెందలేదు. రెండవమిశ్రద్రవ్యమునం దవి మారిపోయెను. దీనికి కారణ మేమైయుండును? మొదటి యుదాహరణమందు లోహమును గంధకమును సూక్ష్మములగు రేణువులుగ విభజన చెందినను పరమాణుపర్యంతము విభజన చెందలేదు. రెండవదానియందు ఆ పదార్థములు పరమాణుపర్యంతము విభజనచెంది ఒక్కొక్క గంధకపరమాణువు ఒక్కొక్క లోహపరమాణువుతో గలసి గంధకవిశిష్టాణువుగ నేర్పడినది. ఈ విశిష్టాణువులు గల దగుటచే క్రొత్తపదార్థము లోహగంధకిదము (Ferrous Sulphide) అనబడును.

లోహగంధకముల భౌతికమిశ్రణమునకు ఈ పేరు వర్తించదు. ఈరెం డుదాహరణములయందుగల ప్రక్రియాభేదమును తెలుపుటకు రెండు భిన్నపదములు వాడబడుచున్నవి. ఆంగ్లమున మొదటిరకపు మిశ్రద్రవ్యములు (Mixtures) అనియు, రెండవరకపు మిశ్రద్రవ్యములు (Compounds) అనియు చెప్పబడును. ప్రాచీనపదార్థశాస్త్రములందు రసాయనప్రక్రియ గుర్తింపబడినను పైభేదమును తెలుపుటకు స్పష్టముగ భిన్నపదములు వాడబడియుండలేదు. అయినను ఈ భేదములకు పోలికగల భేదములు అలంకారశాస్త్రమునందు చెప్పబడినవి. రెండుపదార్థములు తమ స్వరూపములందు

మార్పు చెందక, స్వతంత్రముగ తిలతండులములవలె నొకచో చేరియుండుట 'సంసృష్టి' యనియు, రెండు పదార్థములు అంగాంగీభావమున (ఒకటి మరియొక దానిలో అవయవముగ చేరిపోవునట్లు) చేరియుండుట 'సంకరము' (Compound) అనియు విచక్షణచేయబడి నది. భౌతికమిశ్రణమునందును రసాయనికమిశ్రణము నందునుగల భేద మట్టిదే. కావున మొదటిరకపు మిశ్రణ ములను మనము సంసృష్టు లనియు, రెండవరకము మిశ్రణములను సంకరము లనియు వ్యవహరింతము.

శాస్త్రచరిత్రయందు భౌతికప్రక్రియలకును రసా యనికప్రక్రియలకును భేదమును ప్రథమమున స్పష్టము చేసిన గౌరవము డాల్టన్‌పండితునకే పాశ్చాత్యులు ఒసంగుచున్నారు. డాల్టనకుపూర్వము రాబర్టు బాయిల్ అనువతడును, అతనికి ౨,౩ శతాబ్దములకు పూర్వము కొందరు ముసల్మానుపండితులును ప్రక్రియలం దీభేద ములు గుర్తించియుండిరట. కాని వారు డాల్టనువలె విశదముగ నిర్వచింపలేదు. ఈ భేదమును ప్రాచీన శాస్త్రజ్ఞులు ఎంతవరకు తెలిసికొనియుండిరో పాశ్చా త్యచారిత్రకులకు తెలియలేదు. ప్రాచీనశాస్త్రజ్ఞులు ఈ భేదమును బాగుగ గుర్తించిరి. పీలుపాకవాద మనియు, పిఠరపాకవాద మనియు మన తర్కశాస్త్రము నందు ప్రసిద్ధమై యున్నవి. పీలుపాకవాదులు వైశేషి కులు, పిఠరపాకవాదులు నైయాయికులు.

పాక మనగా విజాతీయ తేజస్సంయోగము. దీనికి ఉదాహరణములు కావునందుంచిన మామిడిపండు, ఆవమునందుంచిన కుండ, ఆవుతినిన పచ్చిక మొదలగునవి. పాకముచే పదార్థముల పూర్వగుణములు పోయి క్రొత్త గుణములు గలుగును. ఒకవిధమగు పాకముచే రంగు మార్పు చెందును. మరియొక విధమగు పాకముచే రసము మారును. మరియు నింకొకవిధమగు పాకముచే గంధము మారును. అట్లే మరియొకపాకముచే స్పర్శ మారును. కావులోని మామిడిపండునందు ఒక్కొక్క సమయ మున ఒక్కొక్క పాకము కలుగు చుండును. అందుచే నొకప్పుడు పండువర్ణము మారి రసగంధములు మారకుండ వచ్చును. మరియొకప్పుడు అన్నియు మారవచ్చును. ఇంతవరకు పీలుపాకవాదమునకును పిఠరపాకవాదమున కును భేదము లేదు. విజాతీయ తేజస్సంయోగముచే గలుగు ప్రక్రియవిషయమునందే ఈరెండు వాదముల కును భేదము. పీలుపాకవాదముప్రకారము ఆవము నందలి ఘటమునకు తేజస్సంయోగము గలిగి దాని యందలి పరమాణువుల సంయోగము నశించును[2].

పిమ్మట విజాతీయ తేజస్సంయోగములచే పర మాణువుల పూర్వరూపాది గుణములు నశించి క్రొత్తరూ పాదిగుణములుగల పరమాణువుల క్రొత్తసంయోగము పిమ్మ ట గలిగి ద్వ్యణుకాదిక్రమమున క్రొత్తఘట మేర్పడును. పిఠరపాకవాదమున విజాతీయ తేజస్సంయోగముచే పీలువులు విభజింపబడకయే పీలువులయందును ఘటము నందును ఒకేపర్యాయము పాకము గలిగి వానిపూర్వ రూపాదులు నశించి క్రొత్తరూపాదులు పుట్టును.

ఇట్టి రెండువాదములును వర్ణించినది రసాయన ప్రక్రియనే. ఇందు రసాయనికప్రక్రియకు కారణము ఉపాదానపదార్థములందు గలుగు తేజోవ్యత్యాసమే అనియు, రసాయనికప్రక్రియకు అధికరణములు పర మాణువు లనియు చెప్పబడినది. రసాయనప్రక్రియలందు తేజోవ్యత్యాసము తప్పక కలుగుచుండునని పాశ్చాత్య పండితులు తరువాత కనుగొనిరి. మరియు పరమాణువు లన అవిభాజ్యపదార్థము లని నిర్వచించుటకంటె రసా యనికప్రక్రియాధికరణము లనుట యుక్త మనియు

2. పరమాణువు లనమూర్తద్రవ్యముల ఆత్యంతికావయవములు. ఆత్యంతికము లనుటచే వీనిని విభజించు టకు వీలులేదని యర్థము. వీనిచే గలుగు ద్రవ్యము క్రింది విధమున నేర్పడును. రెండు ద్వ్యణుకములు కలసి ద్వ్యణుకము ఏర్పడును. మూడు ద్వ్యణుకములు కలసి యొకత్ర్యణుక మేర్పడును. నాలుగు త్ర్యణుకములు కలసి యొకచతురణుకమును, అయిదు చతురణుకములు కలసి యొకపంచాణుకమును ఏర్పడును. ఈ క్రమమున మహత్పరిమాణముగల ద్రవ్యమును ఏర్పడును. ఈ ద్రవ్యము నశించుట ఈ క్రింది విధమున జరుగును. పరమాణు వుల సంయోగము నశించుటచే ద్వ్యణుకములు నశించును. ద్వ్యణుకములు నశించుటచే త్ర్యణుకములును, అవి నశించుటచే చతురణుకములును, ఈ క్రమమున మహాద్రవ్యమును నశించును.

నిర్ణయించిరి. పీలుపాకవాదమునకు మూలపురుషుడు కణాదుడు. పిఠరపాకవాదమునకు మూలపురుషుడు గౌతముడు. కావున రసాయనిక ప్రక్రియను సూత్రించిన గౌరవము వీరి కొసగవలసియున్నది.

భౌతిక ప్రక్రియలందు పదార్థములు పెద్దమొత్తములుగ వ్యాపారించుననియు, రసాయనిక ప్రక్రియలందవి అణువులుగ వ్యాపారించుననియు పైన సూచించియున్నాము. ఈ భేదము భౌతికశాస్త్రమునకు రసాయనికశాస్త్రమునకును కొంత భేదమును సూచించును. ఈ భేదము నిట్లు మరికొంత స్పష్టము చేయవచ్చును. భౌతికశాస్త్రము పదార్థముల బాహ్యగుణములగురించి చెప్పును. రసాయనశాస్త్రము వాని అభ్యంతరగుణములను గురించి చెప్పును. బాహ్యగుణము, అనగా పొడువు వెడల్పులు, ఘనమానము భారమానము, వీనియందా యా పదార్థముల కున్న యన్యోన్య సంబంధములు మొదలగునవి. అభ్యంతరగుణము లన పరమాణువులు, వానిపుంజములు, ఆయాపదార్థములందు వానివిన్యాస క్రమము. ఆయాజాతిఅణువులతో చేరియుండు తేజస్సు (Internal chemical energy) మొదలగునవి. ఒకపదార్థముయొక్క అణువులును వానితో చేరియుండు తేజస్సును ఆయాపదార్థములయొక్క రసమనవచ్చును. రసమునుగురించి చెప్పు శాస్త్రము రసాయనశాస్త్రము[3].

ఒక ఇనుపకడ్డీని కాచినచో దానిపొడవు హెచ్చును. మరింత కాచినచో దాని నల్లవర్ణము మారి ఎఱ్ఱనగును. మరింత హెచ్చుస్పర్శ (Temparature) యందు కాచినచో నది ద్రవించును. ఈ ప్రక్రియ రసాయనిక ప్రక్రియయా భౌతికప్రక్రియయా? దీనియందు గ్రహింపబడిన పదార్థముయొక్క బాహ్యగుణములు కొంతవరకు మారియున్నవి. అణువిన్యాసమునందు మాత్రము మార్పు కలుగలేదు. కావున ఈ ప్రక్రియ భౌతికప్రక్రియక్రిందనే గ్రహించబడుచున్నది. మరియు ప్రక్రియ అంతమందు క్రొత్తపదార్థ మేర్పడుటలేదు. ఇనుపకడ్డీని కాచివేయుట మానివేయుగనే అది తిరిగి మామూలు రూపమును జెంది మామూలు ఇనుముగనే గుర్తింపబడుచున్నది.

ఒక ఇనుపకడ్డీ పొడవునను రాగితీగను చుట్టి దానిగుండ విద్యుచ్ఛక్తిని ప్రవహింపజేసినచో ఆ కడ్డీకి అయస్కాంతశక్తి కలుగును. అది చిన్న యినుపముక్కలను ఆకర్షించగలిగియుండును. విద్యుత్ప్రవాహమును ఆపినచో కడ్డీయొక్క అయస్కాంతశక్తి తొలగిపోవును. ఇందు ఇనుపకడ్డీ రసాయనికప్రక్రియ ననుభవించెనా? భౌతికప్రక్రియ ననుభవించెనా? నిశ్చయముగ భౌతికప్రక్రియను అనుభవించెను; ఏలన ప్రక్రియచే ఇనుపకడ్డీయందలి పదార్థము మారలేదు.

ఒక ద్రవపదార్థమును శీతలించినచో నది ఘనీభవించును. కాచినను అది ఆవిరియగును. ఈ ప్రక్రియలు రసాయనప్రక్రియలా? కాదు. ఇచట క్రొత్తపదార్థ మేర్పడుట లేదు. ఘనీభవించిన ద్రవమును గాచినచో నది తిరిగి ద్రవమగును. ఆవిరిని శీతలించినను అదే ద్రవ మేర్పడును. కాని జలమందు కొంత ఉప్పు నుంచినచో అది లీనమగును. ఈసంసృష్టి బాగుగ కాచి ఆరబెట్టినచో తిరిగి ఉప్పు మార్పుచెందకయే లభించును. అయినను ఈప్రక్రియ రసాయనప్రక్రియగనే ఎంచబడుచున్నది; ఏలనన జలమందు లీనమైన ఉప్పుపుంజములు (Molecules) ఒక విధమగు విభజనము చెందును. ఈవిభజనము యొక్క స్వభావము గూర్చి ముందు వివరింపబడును. ఈప్రక్రియ రసాయనికప్రక్రియ అనుటకు మరియొక హేతువు గలదు. ఉప్పు జలమందు లీనమగునపుడు జలము యొక్క స్పర్శ తగ్గును; అనగా లీనస్థితిని జెందుటకు ఉప్పు జలమునుండి తేజస్సును తీసికొనును. అభ్యంతర తేజస్సునందు వ్యత్యాసము కలిగినది. అభ్యంతర తేజోవ్యత్యాసము గలుగుట రసాయనిక ప్రక్రియకే చిహ్నము.

ఇంతవరకు పేర్కొనబడిన భౌతిక రసాయనిక ప్రక్రియాభేదములు ఇట్లు సంగ్రహింపవచ్చును:

౧. భౌతికప్రక్రియలందు ఒకపదార్థ మణుపర్యంతము విభాగము చెందదు. రసాయనికప్రక్రియయందు అణుపర్యంతము విభాగము చెందును.

౨. భౌతికప్రక్రియచే నొకపదార్థపు గుణముల యందు స్థిరమైనమార్పు గలుగదు. రసాయనికప్రక్రియల యందు స్థిరమైనమార్పు గలుగును.

3. భౌతికప్రక్రియయందు అభ్యంతర తేజో వ్యత్యాసము కలుగదు. రసాయనికప్రక్రియయందు అభ్యంతర తేజోవ్యత్యాసము కలుగును.

---

౩. ఆంగ్లమున 'కెమిస్ట్రి' (Chemistry) యను పేరు ఎట్లు నిష్పన్నమైనదో నేను 'రసాయనశాస్త్రము: చారిత్రికము' అను వ్యాసమున స్పష్టము చేసియున్నాను.

# క్షయ

## హిందూదేశము - క్షయనివారణ ప్రత్యేకప్రాముఖ్యము

శ్రీ "ఉపాధ్యాయ" వి. సి.

భారతదేశమున ప్రాచీన నాగరికతా సౌధము శారీరక మానసికారోగ్య సౌఖ్యములను పునాదిగా జేసికొని నిర్మింపబడెననుట నిస్సందేహము. తన్మూలముననే పూర్వమున మనదేశములో ఈనాడు నిరాఘాట విహారము చేయు అసంఖ్యాక భయంకర వ్యాధులు బహు అల్పముగా గానవచ్చెడివి.

ఈకాలమున నెలకొనిన వివిధ రోగములు ఆధునిక నాగరికతాజనితములు. అందు ముఖ్యముగా క్షయ 'నాగరికత'తో సమానముగా వృద్ధిజెందుచు వచ్చిన రోగము. ఈ విషయమును ఒకపాశ్చాత్యు డెట్లు చెప్పెనో గమనింపుడు—

"Tuberculosis is essentially a disease of civilisation, being quite unknown in primitive races and amongst animals in natural habitat."

మనదేశములో మున్నెన్నడును క్షయ విస్తారము వ్యాప్తిచెందినట్లు కానబడదు. కాని ప్రస్తుత పాశ్చాత్య నాగరికతానుసరణ సంజనితమైన అసంఖ్యాక రోగములలో క్షయ అగ్రస్థానాన్ని ఆక్రమించు ననుట నిశ్చయము.

పూర్వమునుండియు మనదేశము వ్యవసాయముపైననే ఆధారపడియుండుటచేత స్వర్గతుల్యములైన గ్రామములందు నివసించుట కలవడినవారు — మన పూర్వులు. ప్రకృతి నారాధించుటకు ప్రపంచ మంతటిలో ముందంజ వేసినవారు హిందువులే.

వారికి ఆరోగ్యభాగ్య ప్రదాయిని యైన 'వాయువు' భగవంతుని స్వరూపవిశేషము. ప్రాణాధారమగు 'జలము' త్రిలోకపాలనియగు జగజ్జనని అవతారము. త్రిభువన ప్రాణికోటి రక్షకుడైన 'సూర్యుడు' శ్రీమన్నారాయణుని ప్రత్యక్ష స్వరూపము.

ఈవిధముగ సాధారణోపయుక్తములైన ప్రకృతి సిద్ధవస్తువులకు దేవత్వ మారోపించి, మతావేశ పూరిత హృదయులగు భారతీయులు ఆరోగ్యసూత్రములకు జీవనసూత్రములతో అవినాభావమగు సంయోగము గల్పించి సౌఖ్య జీవనమార్గదర్శకులైరి.

నేటికిని 'సూర్యభగవానుని'కి ప్రాతఃకాలమున యథావిధిగా 'నమస్కారము'లు చేయువారు సర్వవిధ రోగముల నుండియు విముక్తులగుదురన్న జ్ఞానము ప్రతి హైందవుని రక్తనాళములలోను ప్రవహించుచున్న దనుట నిర్వివాదాంశము.

ప్రస్తుతము పాశ్చాత్య నాగరికత పరిపూర్ణముగ ఆక్రమించుటచేత పురాతన హైందవాచారములు నిరర్థకములు నిష్ప్రయోజనములని, అంధవిశ్వాసము లాధారముగా గలవని, విజ్ఞానవిహీనులచే నేర్పాటు గావింపబడ్డవని, ఎన్నో నిందారోపణలు చేయుట సహజమైనది. కాని ఆయా సిద్ధాంతములలోగల ఆంతరంగిక అభిప్రాయములకు శోచనీయముగ అంధులమైతిమే అన్న జ్ఞానము చాల మందికి కలుగుటలేదు.

మూసుకుపోయిన మన నేత్రద్వయమును తెరచుటకు పాశ్చాత్యుడు కావలెను. ఆంగ్లభాషలో మంత్రోచ్చారణ చేసినగాని దృష్టిభాగ్యము గలుగదు. సూర్యరశ్మిలో "శక్తిదాయకములు" (Vitamins) గలవని వారు తెలిపినగాని మనవారు రోజున కొకమారైన ఎండలోనికి పోరు, స్వచ్ఛమైన గాలి పీల్చరు.

ప్రస్తుతవిషయ మేమన — భారతదేశము మున్నెన్నడు క్షయ మున్నగు వ్యాధులకు గురికాలేదు. ఇపుడు

ప్రచండవేగముతో అన్ని స్థలములలోను నిరాఘాటవృత్తి ము సల్ప నారంభించినది.

'చికిత్సకన్న నిరోధము శ్రేష్ఠము'(Prevention is better than cure); గనుక సాధ్యమైనంతవరకు ప్రయత్నించి ఈ రోగమును అరికట్టవలయును.

ఈక్షయ పశువులనుండి మానవులపై దాడివెడలి అసంఖ్యాకములైన అమాయక ప్రజలను పొట్టబెట్టు కొనుట ఎల్ల రెరిగిన విషయమే. ముఖ్యముగా చిన్న పిల్లలు పాలు త్రాగువయసువారు — అయిదు మొదలు పదిసంవత్సరముల వయసువారు — నూటికి ఏబది మొదలు ఎనుబదిమందివరకు మరణించుచున్నారు, క్షయపీడిత జంతువుల క్షీరము త్రాగుటచేత.

దారిద్ర్యముతో నేకుంగి కృశించిపోయిన భారత మాత సంతానమును ఇట్టి విషమవ్యాధులకు లోనుగా కుండ చేయుట ప్రతి భారతీయుని విధియై యున్నది. ఈ విధి నిర్వర్తించుటకు రోగముయొక్క చరిత్ర, వ్యాప్తివిధానము, నిరోధకవిధానములనుగురించిన జ్ఞానము ఆవశ్యకము.

## క్షయ

చరిత్ర:— అనాదినుండియు క్షయ అన్ని దేశ ములలోను ముఖ్యముగా పాశ్చాత్య దేశములలో వ్యాప్తియం దున్నట్లు అనేక కారణములవల్ల తెలియు చున్నది.

| | | | |
|---|---|---|---|
| హిప్పాక్రటీస్ | అనువతడు | ౪౦౦. | క్రీ॥ పూ॥ |
| అరిస్టాటిల్ | ,, | ౩౩౦. | క్రీ॥ పూ॥ |
| గాలెన్ | ,, | ౧౫౦. | క్రీ॥ శ॥ |

వీరు ఆ కాలమున ఈ రోగలక్షణములను వర్ణించి వింత పేర్లతో పిలిచిరి. 'మర్త్యముల వ్యాధి' అను నామము ముఖ్యముగా వాడుకలో నుండెడిది. ఈ వ్యాధి ముఖ్య లక్షణములను 'కణుపులను' (Tubercles) పైని చెప్పిన శాస్త్రజ్ఞులు "నాశరహిత గ్రంథు లని" పే ర్కొనిరి.

అంతకన్న పరిణత అభిప్రాయములను సిల్వియస్ (౧౬౭౯ సం॥రం), మోర్టన్ (౧౭౦౦ సం॥రం) అనువారు వెలిబుచ్చిరి.

౧౮౫౪ సంవత్సరమున 'బాహోల్' అనువారలు క్షయకు కారణము 'హానికరములగు అతి సూక్ష్మ జీవు లని, ఈ సూక్ష్మజీవులే శరీరాంతర్భాగములో గట్టి కణుపులు లేక 'గడ్డలు' (Tubercles) జనించుటకు హేతువులని తెలియజేసెను.

౧౮౮౨ సంవత్సరమున జర్మన్ శాస్త్రజ్ఞుడు రాబర్టు కాచ్ (Robert Koch) అనునతడు అద్భుత శోధనల నాధారముగా చేసికొని మహోపయోగకరము లైన ఫలితములను మార్చి నెల ౨౪-వ తారీఖున బెర్లిన్ నగరమున చదివెను. ప్రస్తుత జ్ఞానసాధనమునకు కాచ్ ద్వార శోధనా ఫలితములు పునాదిరాళ్లు. కాచ్ ద్వార ప్రకటించిన పత్రికలోని ముఖ్యాంశములు గమ నార్హములు.

౧. "క్షయ ఒక తరగతికి చెందిన సూక్ష్మజీవులచే కలుగు చున్నదనియు, ఆసూక్ష్మ జీవుల పేరు...క్షయ జనక సూక్ష్మజీవులు" ("Bacillus tuberculosis or Mycobacterium tuberculosis") అనియు,

౨. గడ్డలు లేక కణుపులు (Tubercles) ఈక్షయ జనకసూక్ష్మజీవులవలన కలుగుచున్నవిగాని నాశరహిత గ్రంథులు గాజాల వనియు,

౩. ఇది సులభముగ వ్యాప్తినొందు శక్తి గల అంటుజాడ్య మనియు తెలియ పరచెను.

తదుపరి అనేక శాస్త్రజ్ఞులు ఇందుకు తమ సమ్మ తిని వెలిబుచ్చి ఈ సిద్ధాంతములు సరియైన వని నిర్ధా రణ చేసిరి.

## వ్యాధిస్వాధీనత్వము లేక అనుఘటన

## (Susceptibility)

ఒక్కొక్క వ్యాధికి కొన్ని కొన్ని జాతుల జంతువులు మాత్రమే లోబడును. తదితర జాతులు ప్రతి ఘటించును. ఆవ్యాధికి లొంగిపోవు జాతులు వ్యాధి స్వాధీనత్వము (Susceptibility) గలిగిన వనియు, అవ్యాధిని నిరోధించు జంతువులు స్వత స్సిద్ధ ప్రతిఘట నశక్తి (Natural immunity) గలిగిన వనియు తెలియ వలెను.

ఉదా:— పశువులలో విస్తారము వ్యాప్తిచెందు పెద్దతెగులు (Rinderpest) మానవులలోను, గుఱ్ఱములలోను గాన్పించదు; ఏలనన, మనిషికిని గుఱ్ఱమునకును తద్రోగప్రతిఘటనశక్తి స్వతస్సిద్ధమగుటచేత.

కాని క్షయమాత్రము అన్ని జంతువులను సమానముగ స్వాధీనపరచుకొనును. ఇది ఇట్లు అత్యధికశక్తితో గూడిన దగుటచేతనే ఈరోగనిరోధ మత్యంతావశ్యకము. ఈ వ్యాధికి లోనగు జంతువులను చూతము.

౧. మానవుడు:— క్షయ మానవజాతితో విపరీత పరివర్తనము పొంది కొన్నికొన్ని స్థానములయందు విశ్వరూపము దాల్చి విజృంభించి ప్రళయనృత్యము చేయును.

రాబర్టు కాచ్‌దొరగారు ఈ దిగువ సంగతిని తెలిపిరి - మొత్తము ప్రపంచమున గల దేశము లన్నిటిలో ముఖ్యముగా నాగరికతా వ్యాప్తిగల దేశములలో ఏడవ భాగము క్షయవలన మృతినొందు చున్నారని.

మధ్య వయసున చనిపోవువారిలో మూడవ భాగము క్షయమూలముననే యని తెలిపిరి.

అశక్తి, దుర్బలత్వము ప్రతిపాదించు ఆధునిక నాగరికతయే క్షయకు ముఖ్యకారణ మని ఆయన దృఢముగ నమ్మెరి.

౨. పశువు:— పశువులుకూడ సులభముగ ఈ వ్యాధికి స్వాధీనమగును. పశువులలో ఈరోగము ప్రాకుటకుకూడ అనేక అవకాశము లున్నవి.

పట్నములలో, పరిశుద్ధవాయుప్రసరణలేని, క్రిక్కిరిసియుండు శాలలో నివసించు పశువులు సాధారణముగా క్షయవ్యాధిచే పీడింపబడుచుండును.

౩. గుఱ్ఱము, మేక:— ఈ జంతువులు 'స్వతస్సిద్ధ ప్రతిఘటనశక్తి'గల జంతువు లని అనేకులు పూర్వము నమ్మిరి. కాని అనేకస్థలములలో ఈ జంతువులుకూడ వ్యాధిగ్రస్తము లగుటంజేసి వాటికి సహజప్రతిఘటనశక్తి లేదనియు, అది జీవితవిధానజనితప్రతిఘటనశక్తియనియు తెలిసికొనగల్గిరి.

౪. పందులు, కుక్కలు, పిల్లులు, పెంపుడుజాతిలోచేరిన యితరమృగములు పెద్దపులులు, సింహములు, అడివిపందులు మున్నగు క్రూరమృగములు, (నిర్బంధింపబడిన) కోళ్లు, చిలుకలు మున్నగు పెంపుడుపక్షులు ఈ వ్యాధికి స్వాధీనములు. కుందేళ్లు, కోతులు, కంగారూలు, దుప్పులుకూడ ఈ రోగమునకు వశమగును.

## రోగవ్యాప్తి (Infection)

పశువులు, ముఖ్యముగా మానవకల్పితములగు అసహజమైన స్థితిగతులలో పెరుగునవి మిక్కిలి అనుభవించును. సమశీతోష్ణప్రదేశములయందు ఉష్ణప్రదేశములయందు వ్యాప్తి తక్కువ. మిక్కిలి శీతలదేశములందు, కొండలోయలయందు వ్యాప్తి చాల ఎక్కువగా నుండును.

ఇంగ్లండు, ఫ్రాంసు, రష్యా, జర్మనీ మొదలగు దేశములలో ఈ వ్యాధి విపరీతముగ ప్రబలుటకు కారణము శీతలత్వమే.

వ్యాప్తివిధానము:— ముఖ్యముగా రెండు మార్గములద్వారా రోగము వ్యాపించుటకు అవకాశములు గలవు.

౧. శ్వాసకోశముద్వారా (Respiratory)

౨. జీర్ణకోశముద్వారా (Digestive system)

౧. ప్రథమమార్గము — శ్వాసకోశముద్వారా,

వ్యాధిపీడితజంతువులు ఆరోగ్యమైన జంతువులతో కలసి ఒకేశాలలో నివసించుచున్న ట్లూహించుడు. వ్యాధిపీడితజంతువు శ్వాసకోశములు క్షయజనక సూక్ష్మజీవులచే నిండియుండును. అట్టిజంతువు దగ్గినపుడు శ్లేష్మమును ముద్దముద్దలుగా నుమ్మివైచును. క్షయజనక సూక్ష్మజీవులు ఆ ముద్దయందు లక్షలకొలది జీవించియుండును. ఆశ్లేష్మము కొంతసేపటికి ఎండి పొడిగా తయారగును. ఆసమయమున ఆపొడిముద్ద ఏ కారణముచేతనయినా కదలినయెడల అందలి క్షయజనక జీవులు వాయువులో విలీనములై పరిసరప్రాంతముల నివసించు పశువుల నాసికారంధ్రములద్వారా ఊపిరితిత్తులలోనికి జొచ్చును. అక్కడ అవి యథాప్రకారముగా సుఖజీవన మారంభించి వ్యాధి లక్షణములను పెంపొందించి అసంఖ్యాకములుగ వృద్ధిజెందును. క్షయజనక

జీవులచే ఆవరింపబడిన ఊపిరితిత్తులుగల జంతువులు ఉచ్ఛ్వాసించు(expiration)సమయమున తమతో గలిసిన వాయువుద్వారా బయటికి పోయి దరల పరిసరప్రాంతములందుండు పశువుల నాసికారంధ్రములద్వారా నిశ్వాసించు (Inspiration) సమయమున లోనికి పోవును.

ఈపై విధముగ కొన్ని లక్షల పశువులలో వ్యాధి సులభముగ అతి స్వల్పకాలములోనే వ్యాపించగలదు.

౨. జీర్ణకోశముద్వారా :— క్షయపీడిత పశువులు తరచుగా సూక్ష్మజీవులచే నిండియున్న శ్లేష్మమును దగ్గిన పిదప — గడ్డి మొదలగు ఆహార పదార్థములయందు గాని, త్రాగెడి నీటిగోలెముల యందుగాని ఉమ్మివైచును. ఆ విధముగ మలినములైన గడ్డి మొదలగు ఆహారద్రవ్యములను భక్షించిగాని, నీటిని త్రాగిగాని సూక్ష్మజీవులను ఇతర జంతువులు అజ్ఞానముచేత లోనికి తీసుకొనుచున్నవి. ఈ సూక్ష్మజీవులు జీర్ణకోశమునందు ప్రవేశించగనే తమ వ్యాపారమును నిర్దుష్టముగ సాగించుటకు ఆరంభించును. అసంఖ్యాకములైన ఈ జీవులు ఒకజంతువు జీర్ణకోశమున ప్రవేశించినపుడు కొన్ని కాలేయమున (liver) చేరి అక్కడ నివసించును. కొన్ని తెల్లరక్తకణములచే చంపబడి హరించిపోవును. కొన్ని ప్రేగుల గోడలలో నివాస మేర్పరచుకొని "క్షీరవాహకములు" (lacteals) అను లింఫ్ నాళములద్వారా సర్వాంగములందును ప్రవేశించును. కొన్ని జీర్ణకోశమునుండి పేడద్వారా బైటపడి పునర్వ్యాప్తికి కారణభూతము లగుచున్నవి. కొన్ని ఆవులయొక్క యోనినుండి ఆవుపోతుల పురుషాంగములద్వారా ఇతర ఆవులకు వ్యాపింపజేయబడుచున్నవి.

క్షయ అంటువ్యాధో, కాదో అని పూర్వము చాలమంది తర్కించిరి. కాచ్‌దొరగారు తమశోధన ఫలితము ప్రచురించిన పిమ్మట క్షయ అంటువ్యాధి యని పూర్తిగా నిర్ధారణ చేయబడినది. ఈసిద్ధాంతమును చేయుటకు కాచ్ దొరగారు ఈక్రింది శోధనను చేసిరి.

వ్యాధిగ్రస్తజంతువునుండి కొన్ని సాధనముల ద్వారా క్షయజనక సూక్ష్మజీవులను దీసి ఒక సంపూర్ణారోగ్యముగల పశువు దేహములోనికి ఎక్కించిరి. తదనంతరమున దానికి నూరు జంతువులలోను క్షయలక్షణములు విజృంభించెను. ఈశోధనకు మూలములగు సూక్ష్మజీవులను కాచ్‌దొర అత్యద్భుత సాధనములచే తన శోధనాగారములో కృత్రిమముగా పెంచి పోషించినాడు. ఆవిధాన మిందు పొందుపరచుట అప్రస్తుతము కాదని తలచెదను.

వ్యాధిపీడితజంతువు శరీరమునుండి రక్తమును గాజుశోధననాళికలలోనికి ప్రవహింపజేసి గడ్డకట్టిన తరువాత అందుండి వెలువడు లేతపసుపు లేక గడ్డిరంగుగల 'శీరపుద్రవము'ను వేరువేరు శోధన నాళికలలోనికి పంపించి ప్రత్తితో మూయవలెను. ఈతీరున తయారయిన శీరపుద్రవమును ఆరుదినములు వరుసగా ౧౩౬.౪° ఫా. ఉష్ణోగ్రతవద్ద దినమునకు ఒకగంట చొప్పున వెచ్చచేయవలెను. తదనంతరమున శీరపుద్రవములోనున్న ఇతర వ్యాధికారక సూక్ష్మజీవులు ఆల్బ్యుమన్ గడ్డకట్టకమునుపు— నశించును. తరువాత ఆశీరపుద్రవమును ౧౫౮° ఫా. ఉష్ణోగ్రతతో చాలవరకు వెచ్చచేయవలెను. అందుమూలమున లేతపసుపురంగుగల 'శీరపుద్రవము' శీరపుగడ్డగా మారును. ఈపరిశుభ్రమైన శీరపుముద్ద లోనికి ఒక సూది ద్వారా ప్రవేశపెట్టినయెడల అచ్చట వాటికనువగు ప్రదేశము లభించును. అందుచే లక్షలకొలదిగ వాటిసంఖ్య పెరుగును. వాటిసంఖ్య విపరీతముగా పెరుగునపుడు కొన్నిటికి పైన చేర్కొనిన విధానమున తయారయిన శీరపుముద్ద లోని కెక్కించిన బాగుగా వృద్ధిచెందును.

ఈ సూక్ష్మజీవులతో మిళితమైన శీరపుద్రవము ఆరోగ్యముగ నుండు పశువుల శరీరములోనికి పంపిన యెడల వ్యాధిచిహ్నములు తక్షణమే పొడసట్టును.

పిమ్మట డాక్టరు జోను డ్రెస్‌డెను ("Dr. John-Dresden") అనువారు క్షయ అంటువ్యాధిమాత్రమే కాక వంశానుగతవ్యాపకమును (Hereditary) అని నిర్ధారణ చేసిరి. దీనికి తార్కాణముగ ౮ మాసములు వయసుగల గర్భస్థ పిండమున (తల్లి క్షయపీడిత అయిన సమయమున) క్షయజనక సూక్ష్మజీవులను తజ్జనక లక్షణములను చూపించిరి.

## క్షయజనక సూక్ష్మజీవులు

ఈ జీవులు బహుసూక్ష్మమైనవి. మిక్కిలి శక్తి గలిగిన సూక్ష్మదర్శినీయంత్రసహాయమున చూడ నేత్రమునకు అగోచరములు; అనగా, ఏడు మొదలు పదివేల సూక్ష్మజీవులను ఒకదాని వెనక నొకటి చొప్పున త్రాటివలె చేర్చినచో ఒక అంగుళము మేర ఆక్రమించును.

ఈ జీవులు ఇంత సూక్ష్మతమములైనను వాటి శారీరకపటిమ (Physical Resistance) మిక్కిలి ఎక్కువ. విస్తారము చలిని గాని, వేడిమిగాని భరించుశక్తి వీటికి కలదు. ౧౭౫° ఫా. తాపక్రమం (Temperature వరకు వాటికి వేడి తగిలినగాని వాటిపటిమ చావదు.

ఈ జీవులకు సౌఖ్యతాపక్రమం ౯౮° ఫా-మొ. ౧౦౪°-ఫా. అందువల్ల మానవునియొక్క గాని పశువు యొక్క గాని శరీరాంతర్భాగ నివాసము వీటికి స్వర్గతుల్యమన్నమాట. అట్టి స్థితియందు ఈ జీవులు నిరాఘాటముగా విజృంభించి శారీరక ధ్వంసమునకు హేతుభూతము లగుచున్నవి.

## క్షయరోగి లక్షణములు

ప్రప్రథమమున క్షయ లక్షణములు బాహ్యముగా గోచరించవు, సరిగదా మీదుమిక్కిలి శరీరము ఆరోగ్యవంతముగా నున్నట్లు కాన్పించును. రానురాను శరీరము ఎంత తిండి తినుచున్నను చిక్కి శల్యమై పోవును.

సూక్ష్మజీవులు ఊపిరితిత్తులను ఆక్రమించిన రొమ్ముల లక్షణములు త్వరలోనే బయల్పడును. మొదట చిన్న పొడిదగ్గుతో ఆరంభించును. ఈపొడిదగ్గు ప్రారంభదశలో రోజునకు ఒకమారు లేక రెండుమార్లకన్న ఎక్కువ మార్లు రాదు. ఉదయమున, ఆహారము తీసుకొను సమయమున పనిచేసిన తరువాత, రోగి మిక్కిలి ఆయాసపడును. తరువాత పొడిదగ్గు ఎక్కువగును. తరుచుగా వచ్చును ఉచ్ఛ్వాస,నిశ్వాసముల కష్టతరములగును. ఆకలి మందగించుట, నేత్రములు లోనికి దిగబడిపోయి నిస్తేజములగుట కాన్పించును. చెంపలు పీక్కుపోయి శరీరమునకు అనారోగ్యపు కళ నిచ్చును. రక్తవిహీనమై తెల్లని పాండురవదనముతో మిక్కిలి నీరసించును. జంతువులలో ముఖ్యముగా పొదుగు మున్నగు మెత్తని అవయవములపై చర్మము పాలిపోయి ముడుతలుపడును. ఆవులపాడి క్షీణించును. నింఫోమానియా (Nymphomania) అనురోగము క్షయపీడితములగు ఆవులకు తరుచుగా సంక్రమించును. ఈ రోగము ఆవులలో జనించినపుడు సాధారణముగా అవు ఎదపోయిన చిహ్నములు బయటపడును.

ట్యూబర్కిల్సు అనుకణములు లేక గడ్డలు మెదడు పై పొరమీద గాన్పించిన రొమ్ముల మెడ గట్టిపడి నిరంతరము ఒకేవైపుకి వ్రాలి యుండును. ఈకణములు శరీరాంతర్భాగమున అవయవము లన్నిటిలోను అసంఖ్యాకములుగా గాన్పించును. వీటి పరిమాణము మిక్కిలి చిన్నది. ఆవగింజ మొదలు జొన్నగింజ వరకు ఉండును. రానురాను ఈకణములు ఎదుగుట ఆరంభించును. ఎదిగినకొలది రంగు వెల్లబారును. ప్రథమమున ఈకణువులు కఠినముగా నుండి పిమ్మట మెత్తటి జున్నుగడ్డలుగా మారును. లక్షలకొలది కణములు ఒక్కొక్కచో గలుసుకొని చిన్నమామిడిపిండంత ఒకే ముద్దగా గన్పించుటయు కద్దు. ఈకణములు కాలేయము (Liver), ప్లీహము (spleen), మూత్రపిండములు (Kidneys) మున్నగు అంగముల నావరించిన అపరిమితముగ బాధ కలుగును. క్షయజనక జీవులు పొదుగు నావరించుచో అది విస్తారము ఉబ్బును. గట్టిపడును. బాధ ఉండదు. పాలు పిండినను ఉబ్బు తగ్గదు.

## నిర్ధారణ చిహ్నములు
(Diagnostic Symptoms).

మొదట వర్ణింపబడ్డమాదిరి దగ్గు, తదనుసరిత లక్షణములు: నోటియందు గాని కంఠమందు గాని కణువులు లింఫ్ గ్రంథుల ఉబుకు - పాలుపిండినను ఆవులలో పొదుగు మెత్తపడక బిగబిగసుకొనియుండుట.

క్షయనిర్ధారణ కష్టము. పైని చెప్పిన్న లక్షణములు కొన్ని క్షయపీడిత జంతువులలో పొడగట్టవు. దీనికి సరియగు నిర్ధారణకు ఒక్క శోధన గలదు. దీని వలన అతిసులభముగ క్షయను తెలిసికొనవచ్చు. ఈశోధనకు ట్యూబర్క్యులిన్ (Tuberculin) శోధన అని పేరు.

## ట్యూబర్కులీన్ శోధన

ఇది మృతజీవియగు కాక్ దొరగారిచే కనుగొనబడెను. తత్కాలమున ప్రపంచమందలి మానవులకు పశువులకుగూడ మహోపకారము గలిగినదన్న సత్యమారము గాదు. ఈ విషయమున కాక్ దొరగారియెడల మానవకోటి సదా కృతజ్ఞమై యుండవలెను.

ట్యూబర్కులీన్ కేవలము "రసాయన సంయోగజనితద్రవమని" నిరూపింపబడినది. క్షయజనక క్రిములు తమ జీవితకాలమున తీవ్రవిషపదార్థములను తయారుచేయును. ఈ విషపదార్థములు గ్లిసరినులో కరుగును. తన్మూలమున గ్లిసరినులో విషపదార్థములను పైకి తీయ వీలగుచున్నది. ఈ విధముగా వచ్చు గ్లిసరిన్-విషపదార్థముల సంయోగమును వడగట్టి, అందున్న క్రిములను లోనికి జొరకుండ కాపాడుదురు. తరువాత ఆ ద్రవమును బాగుగా మరగబెట్టి క్షయజనకసూక్ష్మక్రిముల నుండి వేరుపరచుటకు మరల వడగట్టుదురు. తజ్జనితద్రవమునకు ట్యూబర్కులీన్ అనిపేరు.

నూటికి ఒకపాలుగల కర్బొలికామ్లద్రవములో (carbolic acid) నూటికి ౧౦పాళ్లుగల ట్యూబర్కులీన్ తయారుచేయుదురు. తత్సంయోగ జనిత ద్రావకమును జంతువు వయస్సునుబట్టి ౦.౧ మొదలు ౦.౨ c. c. వరకు శరీరములోనికి పంపింతురు. తదనంతరము నూటికి ౪ భాగములుగల క్రిమోలిక్ ద్రావకమును క్రిమిసంహారముకొరకు ఉపయోగించవలెను.

ఈ ట్యూబర్కులీన్ ద్రవమును వాల్గువిధములుగా శరీరములోనికి పంపించవచ్చును.

౧. నేత్రములద్వారా (Opthalmic)

కొన్ని ట్యూబర్కులీన్ చుక్కలను కంటిక్రింది భాగములోనికి వదలవలెను. రెండవనేత్రము 'తారతమ్య పరీక్షణ' (Control)కి వుపయోగపడును.

అనుకూల్య లక్షణములు (Positive symptoms): చీముతో కూడిన మ్యూకస్ ద్రవము క్రింద నేత్రకోణము వద్ద చేరుకొనును. అట్లు అర గంట లుండును. కనుబొమలు ఉబ్బును. కన్నులు సగముమూత పడును.

(౨) అంతర్ త్వగింద్రియశోధన (Introdermal తోకయొక్క ప్రక్క భాగమున చర్మముద్వారా పంపించుట.

అనుకూల్యలక్షణములు :— చర్మము దళసరి ఎక్కును. రెండింతలకు పైగా దళ మెక్కును. ఈ మార్పు అర గంటలలో వచ్చి చాలదినము లుండును. ఈ శోధనవలన మంచి ఫలితము కలిగెనని తెలియు చున్నది. ఇంకు విశేషమేమన జంతువుయొక్క వయస్సు పాటింప నవసరము.

## ట్యూబర్కులీన్ శోధన: ఆధునిక విధానము

[ప్రత్యేకపశువైద్య సంఘమువారిచే ప్రకటింపబడినది.]

"ఈశోధన ఈదిగువ వుదాహరింపబడిన తీరున చేయవలెను.

౧. వాలుగు చదరపు అంగుళములమేర పశువు మెడభాగమున పరిశుభ్రము చేసి నున్నగా క్షౌరము చేయవలెను.

౨. అట్లు శుభ్రము చేయబడిన భాగమును బొటన వ్రేలికిని నాలుగువ్రేళ్లకు మధ్యన నిరీకించి గట్టిగా పట్టుకొనవలెను.

3. అవసరమయినంత ట్యూబర్కులీన్ ద్రవము — శుద్ధమైన ద్రవమును — లోనికి సిరింజీగుండా పంపవలెను.

౪. సిరింజిని దింపు లోతుకూడ గమనించవలెను. ఎక్కువ లోతుగా చర్మాంతర్భాగములలో నిముడునట్లుగాక — పూర్తిగా పైనను గాక మధ్యస్థముగా సిరింజికొనను పంపవలెను.

ట్యూబర్కులీన్ ద్రవమును రెండు భాగములుగా విభజించి పైని చెప్పినరీతిని ఒకభాగమును ఇవ్వవలెను. ఆభాగము ప్రమత్తీకరణభాగము — (మోతాదు "sensitising dose")

ఆ ప్రమత్తీకరణపు మోతా దిచ్చిన అర గంటల వెనుక శోధన మోతాదు (test-dose) పైన చెప్పిన విధముగానే ఇవ్వవలెను.

ఆ ట్లివ్వబడియెడల శరీరము దళసరి యొక్కట, జ్వర చిహ్నములు కన్పించును. ఈ లక్షణములు పొడ గట్టినచో ఆ జంతువుకు క్షయరోగము లే దన్నమాట. మిగిలిన రెండువిధములకు శోధనలు అంతముఖ్యములు గావు. పై విధములలో నేదే నొకదాని ప్రకారము ట్యూబర్కులీన్ ఒక జంతువున కిచ్చితిమేని అనుకూల్య తీరు (Positive) అయినచో ఈక్రింద నిరూపించిన సామాన్య లక్షణములకు గురియగును. తీవ్రజ్వరము వచ్చును. తాపక్రమము సామాన్యముకంటె అయిదు మొదలు ఆరు అంశములవరకు హెచ్చును.

ఈ జ్వరము గాక తదనుసరణ లక్షణములు — ఆకలి మందగించుట, విరేచనములు- వణుకు మున్నగునవి కన్పించును.

తాపక్రమము (Temperature) గంట కొకమారు చొప్పున ౨౦ గంటలు చూడవలెను. అనుకూల్య తీరు శరీర తాపక్రమము రెండు అంశముల కన్న హెచ్చుగా నుండును.

ఉ. ఈ ఓ (yeo) — క్రియోసోట్ నిశ్వాసము (Creosote .. Inhalation)

లేక మేకపాలు

లేక కాంథరిడేట్ ఆఫ్ పొటాష్ (Conthardate of potash)

లేక అరిస్టోల్ ఆలివ్ ఆయిల్ (Aristole in olive oil).

## నిరోధవిధానములు

వ్యాప్తికారకములైన రోగపీడితజంతువుల పాలు మాంసము బహిష్కరించవలెను.

వ్యాధిగ్రస్త జంతువులు ఉమ్మివైచిన శ్లేష్మము నెంత జాగ్రత్తగ నశింపచేసిన అంత మేలు. చనిపోయిన జంతువుల కళేబరములను దహనముగాని, లోతుగా సమాధిగాని చేయించవలెను. జంతువులలో అనుమానము గలిగినంత నే-ట్యూబర్కులీన్ శోధన చేసి-నిశ్చయముగా వ్యాధితో బాధపడువాటిని వేరుచేయుట

ఉదాహరణ పట్టిక :

| రోగి సంఖ్య | తాపక్రమం గం॥ | ౬ x | ౭ x | ౮ | ౯ | ౧౦ | ౧౧ | ౧౨ | ౧౩ | ౧౪ | ౧౫ | ౨౦ | [illegible] |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క | ౧౦౦.౪ | ... | ... | ... | ౧౦౩.౬ | ... | ౧౦౪.౬ | ౧౦౬.౨ | ౧౦౫.౪ | ... | ... | ... | ౪.౮ |
| ఖ | ౧౦౦.౦౫ | ... | ... | ౧౦౦.౭ | ౧౦౨.౭౭ | ౧౦౩.౮ | ౯౫.౫ | ౧౦౦.౬౬ | ౧౦౨.౪ | ౧౦౦.౫ | ... | ... | ౩.౧ |

## చికిత్స (Treatment)

వైద్యసాధనము సంపూర్తిగ కాకపోయినను చాలవరకు నిరుపయోగమని ప్రముఖులు తెలియగల్గిరి. నిరోధన సాధనప్రాముఖ్యత ఈ రోగమువందు తేటతెల్ల మగునట్లు మరి ఏ ఇతర రోగమునను కాదు.

కొందరు ఈ దిగువ చెప్పబడు ఔషధములను చేర్కొనిరి.

గాని, చంపుటగాని యొనర్పవలెను. డా॥ జోను దొరగారు వ్యాధిగ్రస్తజంతువుల శ్లేష్మమును గురించి అన్నవాక్యములు :

"We must look upon the sputa of consumptive animals as well as substances polluted by them and animals having the disease as centres of distribution."

క్షయపీడితజంతువులలో సంతానోత్పత్తిని నిరోధము చేయు జాగ్రత్త తీసికొనవలెను. బ్రతికియున్న జంతువులు తీవ్రముగా క్షయచే బాధపడునెడల వాటిని నరికివేయుట ఉత్తమోత్తమము. ఇట్లు చంపుట కష్టమనియు, నష్టమనియు ఎంచుట మిక్కిలి ప్రమాదకరము. అజ్ఞానులమాత్రము ఇట్లు విశ్వసించెదరు. తదజ్ఞాననివారణకై వారికి విద్యాబోధ మిక్కిలి అవసరము. పాశ్చాత్యదేశములలోవలె చట్టములను ప్రభుత్వమువారు అమలులో పెట్టి ఈరోగ గ్రస్తజంతువులను చంపించి పరిహారద్రవ్యము రైతుల కిప్పించవలెను.

ఈసందర్భమున ఈవాక్యములు స్మరణీయములు.

"False economy might prompt him to retain the diseased animal as long as it is productive, but by this course, the health of the consumers of the milk will be placed in danger and the value of other cattle in the herd and men will be jeopardised."

"Undoubtedly the truely economical course is to remove all the diseased animals in order to protect the patrons of the dairy, and cattle may remain."

## సంరక్షణోపాయములు

సాధ్యమైనంతవరకు రేయింబవళ్లు పశువులను బహిరంగప్రదేశములో స్వచ్ఛమగు వాతావరణము నందు తిరుగనిచ్చుట.

పశుశాలలో పరిశుభ్ర వాయుప్రసరణ నిరాఘాటముగ జరగనిచ్చుట,

సూర్యరశ్మి శరీరముపై సోకు ఏర్పాటులను చేయుట.

పశుశాలను నీటితోను, క్రిమిసంహారక ద్రావకములతోను ప్రతిదినము పరిశుభ్రముగా కడుగుట.

క్షయలేకుండ మందను కాపాడవలెనన్న (అనుమానప్రదేశములలో)

౧. ట్యూబర్కులీన్ శోధనము చేసి అనుగుణ్యములైన వాటిని వేరుచేయుట.

౨. క్రొత్తగా తెచ్చు పశువులను ట్యూబర్కులీన్‌తో శోధించుట.

౩. అన్ని పశువులకును ఆరుమాసముల కొకసారి ట్యూబర్కులీన్ శోధన చేయించుట.

౪. ఆవుబోతులను క్షయరోగ పీడితములైన ఆవులపై దాటింపకుండుట.

౫. వెలుతురు, ఆహారము, వ్యాయామము మున్నగునవి క్రమమైన వాడుక ప్రకారము ఇప్పించుట.

# పుస్తకసమీక్ష

## అమ్మ

మాక్సిమ్ గోర్కీ "మదర్"కు అనువాదం.
అనువాదకులు:— శ్రీ క్రొవ్విడి లింగరాజుగారు.
వెల ౧-౮-౦. అడ్రస్ — రాధు బుక్కు డిపో—రాజమండ్రి.

అనువాదకులు రాసినట్లు కాంగ్రెసువారి కృప వలన అమ్మకు చెరసాలవిముక్తి కలిగి ద్వితీయముద్రణ రూపంలో మనఎదుటకు వచ్చినందుకు ఎంతో సంతోషించాలి. అన్ని భాషలవారిచేత ప్రశంసింపబడిన అమ్మ యొక్క విశేషములను తెలియపరచటానికి పూర్వం ఒక్క విషయం చెప్పాలి. మూడు సంవత్సరాలకుపూర్వం ఈపుస్తకాన్ని ఒకసారి చదివాను. ప్రారంభంనుంచి చివరవరకు భాషలోవున్న తీపి, ప్రవాహం, పదముల కూర్పు- ఇవన్నీ ఆశ్చర్యం కలిగించాయి. వ్యావహారిక భాషలో ఇంత చక్కని కూర్పు గలిగిన రచయితలు ఎక్కడ ఉన్నారా అనే వింత గలిగింది. రైతులు-పాటకజనముకొరకు రాసిన గోర్కీ "మదర్"కు క్రొవ్విడి లింగరాజుగారివంటి అనువాదకులు దొరకటం 'బంగారమునకు తావి అబ్బినట్లై' అయినది. తెలుగులో అమ్మకు గలిగినంత ప్రచారం, ఇంక ఏఅనువాదిత పుస్తకానికీ జరగలేదంటే అతిశయోక్తికాదేమో. ఆంధ్ర పాఠకలోకం అమ్మను ఇంతగా ఆదరించుటకు ఒకకథలోని ఆకర్షణయే కాదని నానమ్మకం. నిజంగా అమ్మయొక్క భాషా పోకడలు చాలావరకు అనుకరణీయములు. ఇతర భాషనుంచి తిన్నగా అనువదించడం తేలికపని కాదని అనేకులు అనుభవజ్ఞులు చెప్పతారు. అందులోనూ గోర్కీవంటి గొప్పవాయన గాని రచనకు ఇంత తేలికగా, తెలుగులోనికి స్వంత రచనలాగ దింపడం చాల ప్రశంసనీయము. భాషలో ఎక్కడ కుంటు కనబడదు. దగ్గర దగ్గర ఏడువందల పేజీలు కలిగిన పుస్తకంలో వెతికి పట్టుకుందామన్నా మడతవాక్యాలు, అర్థంకాని, సామాన్య ప్రజలకు అందుబాటులో లేనిశబ్దాలు కనపించవు. భాషలోని ధారావాహిక ముఖ్యముగ గమనించతగినది. తెల్లవారిలేది లనువాటమే వృత్తిగా పెట్టుకున్నవారు ముఖ్యముగా అమ్మను ఒకటి రెండు పర్యాయములు చదవవలయునని నాప్రార్థన.

మాక్సిమ్ గోర్కీ పేరు ప్రతిష్ఠలు సంపాదించిన నవలారచయిత. లెనిన్కు కుడిభుజమై దేశానికి మేలు కొలుపులు పాడినాడు. ఆయనకలంలో జీవితాన్ని వున్నదున్నట్లు చిత్రించి, ఇష్టం వున్నా లేకపోయినా జబర్దస్తీగా చదివించే కళాపటిమగల విభూతి నిబిడీకృతమైవుంది. దేశకాలాలకు అనుగుణ్యంగా ఎక్కువగా రాయడంచేత ప్రజలు ఆయనను, ఆయన రచనలను మనసార ఆహ్వానించారు. ప్రజలకు ఆయనంటే ఎంతో గౌరవం. ఆ గౌరవం అంతటికి ఆయన కాలాన్నను సరించి నడవటమేనని, కాలంరుచి మారితే ఇంతగా ఆదిరేవా ళ్లుండరని కొందరనవచ్చును. ఇది కొంతవరకు నిజమే కావచ్చు. కాని ఆయన రచనలలో ఉన్న కళాసంపద దేశకాలములకు అతీతమైనది. దేశంలో జరిగిన-జరుగుతున్న ఘట్టాలనే ఆయన తీసుకొన్నాడు. కాని మానవీయప్రవృత్తి, భావసంఘర్షణ, పరిస్థితులవల్ల మానవునిలో కలుగు మార్పులు ఆయన చక్కగా కనిపెట్ట గలడు. అందుకనే గోర్కీరచనలు ఒకవంక రష్యాదేశపు విప్లవతత్వమును, దానివికాసమును విశదపరుస్తూంటే, రెండోవైపు మానవునిలోని భావసంపదను, సంఘర్షణను మనకళ్లకు కట్టినట్టు చూపిందుతాయి. అందుకనే ఆయన రచనలు కాలం గడచినకొద్దీ పాతపడటం లేదు. పైపెచ్చు వాటిలో కొత్తకొత్త రుచులు బయలు దేరుతున్నాయి.

ఇందులో పావెల్, నకోడా, నికోవెల్, రైబిన్, ఈగర్ ముఖ్యంగా వచ్చే పురుషపాత్రలు. అమ్మ, శశాంక, సోఫియా స్త్రీపాత్రలు.

అమ్మపాత్ర మొదటినుంచి చివరవరకు కడురమ్యంగా పోషింపబడింది. పావెల్ ఆమెకొడుకు. అతను విప్లవకారులకు అగ్రణి. భర్త ఉన్నంతకాలం అమ్మ ఎప్పుడూ

యమయాతనలే అనుభవింపవలసి వచ్చింది. అతను చచ్చిపోయినతరువాత కొడుకు మిగిలితే అతను విప్లవకారులలో చేరినాడు. అందువల్ల ఆమె ఎప్పుడు దుఃఖమే అనుభవించింది. మొదట్లో పావెల్ యొక్క రహస్య సంభాషణలు, మిత్రులు వస్తూపోతూ ఉండటంచూచి ఆమె మనస్సు కలతపడుతుంది. అనేక విధాల నయాన-భయాన కొడుకు ప్రవర్తన సరి దిద్దబోతుంది. కాని పావెల్ మనోధైర్యం ఆమెనుగూడ విప్లవంవైపుకు గుంజింది. క్రమక్రమంగా విప్లవంఅంటే ఆమెకు నచ్చ ప్రారంభమైంది. ఇంతేకాదు. పావెల్ స్నేహితులందరకు సపర్యలు చేయటం, వారికి సలహాలు చెప్పటం, వారికి సాయం చెయ్యడంకూడ మొదలు పెట్టింది. చివరకు పావెల్, ఇంకా కొంతమంది స్నేహితులు పట్టుపడ్డారు. అప్పుడు తానే స్వయంగా మిఠాయి అమ్మకునే జంగిడి నెత్తిన పెట్టుకొని ఫ్యాక్టరీలో చేరుతుంది. అక్కడ ఉన్నవారందరికి పేపర్లు పంచిపెట్టుతుంది.

ఆమె మాతృహృదయం బహువిశాలమయినది. ఎవరైనా బాధపడుతుంటే ఆమె చాల దుఃఖిస్తుంది. విప్లవకారులు హత్యలు చేస్తే వారిచర్యలను గర్హిస్తుంది. పావెల్ ఆమెకు ప్రాణాలకంటె ప్రియం. అతని క్షేమంకొరకు రాత్రింబవళ్లు ఈశ్వరుని ప్రార్థిస్తుంది. ఎంతో ధైర్యంగా పనిచేస్తూకూడ కొడుకుని బాధల్లో చూడలేదు. అనాయాసంగానే ఆమె కళ్లు బాష్పాలు కారుస్తాయి. లేఖకుడు మాతృహృదయాన్ని బాగా కనిపెట్టినాడు. పావెల్‌ను ఎవరైనా నిందించినా లేక విమర్శించినా ఆమె హృదయంలో కలుక్కుమంటుంది. నిందించేవాళ్లని చూస్తే చీదరించుకుంటుందికూడాను. ఈ విధంగా అమ్మజీవితాన్ని ఎంతో సజీవంగా చిత్రించినాడు. కథకుడు చూపిన అమ్మయొక్క త్యాగం, కష్టసహిష్ణుత, నూతనోత్సాహం అవర్ణనీయం.

పావెల్, శశాంక, నఖోడా, నికోలెల్, సోఫియా, ఈగర్ మొదలైనపాత్రలలో విప్లవకారులయొక్క మొక్కవోనిసాహసం, వారియెత్తులు ఒకేమాదిరిగా కనబడుతాయి. శశాంక ఆత్మత్యాగంకూడ లెక్కింపతగ్గది.

వీరితరువాత రైబిన్ పాత్ర ఒకటుంది. ఈతడు పల్లెటూరికైతు. ఆవేశం వస్తే ఒళ్లెరుగనిమనిషి. పట్టణాల్లోని విప్లవంకంటే, పల్లెటూళ్ల జాగృతి ఎక్కువ లాభకారి అవుతుందని అతనియూహ. అనేకమంది వచ్చి అతన్ని బెదరిస్తారు. నువ్వు ఎవరిలో ప్రబోధం చేయబోతున్నావో వాళ్లే నిన్ను పట్టి జైలులో వేయించుతారని చెపుతారు. అయినా అతను నిర్భయంగా పల్లెటూళ్లలో ప్రచారం సాగిస్తాడు. పట్టుపడతాడు. దెబ్బలు తింటాడు. అయినను వెనుకకు తగ్గడు. అన్నివైపులనుంచి సాగిన ఈ విప్లవగాథను ఎంతో నైపుణ్యంగా కథకుడు నడిపినాడు. పాత్రలమనోభావాలను ఎంతో తేలికశైలిలో చిత్రించిన ఈ కథకుడు ధన్యుడు.

రష్యాలోని సామ్యవాదభావాలను చూడుడు ఎంత ఆవేశంతో పావెల్ చెపుతున్నాడో:—

"కడుపు నిండ తినడమేనా మనకు కావలసినది? కాదు కాదు. మనంకూడ మనుష్యులలాగ బతకాలి. మనమూ ప్రజల మనిపించుకోవాలి. మనభుజాలమీదెక్కి మన కళ్లు మూస్తూవున్న అధికారులకు, తమ రెంత కళ్లు మూసినా మన కంతా తెలుస్తోందనీ, మనం మూర్ఖులం కామనీ, పశువులం కామనీ, కేవలం జానెడు పొట్ట నింపుకోవడమే, మా ఆదర్శం కాదనీ, అందరితోపాటు పరువు మర్యాదలతో బ్రతకగోరుతున్నామనీ తెలియపర్చాలి. ప్రతికక్షులు మనలను దాస్యభారంతో ఎంత క్రుంగదీసినా ఇంకా తెలివితేటలలోనూ వుత్సాహంలోనూ వాళ్లకన్న మనమే మేలని మనం వాళ్లకి స్పష్టీకరించాలి."

పల్లెటూరి రైబిన్ దేవుణ్ణి ఈవిధంగా విమర్శిస్తున్నాడు. "మతగురువులు దేవుణ్ణి కాస్తా చేతులూ విరగగొట్టి మూల కూర్చోబెట్టారు. వాళ్ల లోపంలేకుండా మన కెన్ని కష్టాలు తెచ్చిపెట్టాలో అన్ని తెచ్చిపెట్టారు అన్ని విధాలా మనకు శత్రుత్వం తెచ్చిపెట్టారు... దేవుడు మనిషిని తనఛాయగా సృష్టించాడు. మనిషి దేవుడులావుంటే దేవుడు మనిషిలా ఉంటా డన్నమాటేకాదూ? కాని మనం మనుష్యులులా ఉన్నామా? శుద్ధ అడవిజంతువులమై పోయాము. చర్చిలో ఒకదిష్టిబొమ్మ నొకదానిని మన ఎదుట పెడతారు. నిలోవా! మనం దేవుణ్ణి మార్చుకోవాలి. బాగు చేసుకోవాలి."

— "పవిత్రస్థలాలు ఖాళీగా ఉండకూడదు. ఎక్కడైతే బాధ వుందో అదే భగవంతుని నివాసస్థానము." "కొంచెం ఆగు చెప్తాను. క్రీస్తు చాలడు. అతడు చక్రవర్తి అధికారాలను గమనించుటకూడదు. అతడే సర్వశక్తులకూ మూలం. అతడు తనఆత్మను రెండుగా చీల్చి ఒక దానిని మానవశక్తికి రెండవదానిని దైవిక శక్తికి అర్పించడు."

ఈ విధంగా ఎన్నో వాక్యాలు ఉదాహరించవచ్చు. దేశకాలాలకు అనుగుణ్యంగా ఉండికూడ, మానవీయ భావసంఘర్షణకు ప్రధానమయిన అమ్మ అందరిచేత పఠింపబడాలి. ఉన్నదానిని ఉన్నట్లు చిత్రించుట గోర్కీ సొమ్ము. దానికి తగినట్టుగానే తెలుగు అనువాదం కూడ రమ్యంగా ఉన్నందుకు సంతోషించాలి. ఈ ద్వితీయముద్రణలో ఇంకా కొన్నిమార్పులుచేసి పుస్తకాన్ని ఎక్కువ ఉపయోగకరంగా ఉండేలాగు చేశారు- అనువాదకులు.

యు. వేం. రావు.

---

## బడదీది

గ్రంథకర్త: శరచ్చంద్ర చటర్జీ. అనువాదకుడు "చక్రపాణి". ప్రకాశకులు : యువకార్యాలయం, తెనాలి. వెల నాలుగణాలు.

శరచ్చంద్రుని గొప్పతనమును గురించి వినని ఆంధ్రుడుండడేమో. ఇతడు నూతన బంగాళీ వాఙ్మయనిర్మాతలలో ఒక్కడు. నేడు రవీంద్రుని తరువాత, ఒకవేళ రవీంద్రునికంటెనుకూడ నేమో, బంగాళీలకు శరచ్చంద్రుడంటే అమితప్రీతి. శరచ్చంద్రునిలాగ బంగాళీల జీవితాన్ని సర్వతోముఖముగా చిత్రించిన సాహితీపరుడింకొకడు లేడు. అందులోను అతని రచనలలో పటుత్వమున్నది, ప్రాణమున్నది, ఆవేదనఉన్నది. రచనకౌశల్యకమయిన ఈమూడూ ఉంటే ఇంక తక్కువేమిటి? అందువల్లనే శరచ్చంద్రుడంటే అక్షరాస్యులకు అంత ప్రీతి; ఇతని రచనలంటే బంగాళీలకే కాదు. మన దేశంవారికి కూడా అంతటి ఇష్టము. ఇతనిరచనలు — నవలలూ, కథలూ, అనేకములు మన తెలుగులోకి అనువాదరూపంగా వచ్చినవి. 'చక్రపాణి' అనువదించినవే ఉన్నవి ఎన్నో. అందువల్ల శరచ్చంద్రుని రచనలలోని గొప్పదనాన్ని గురించి వేరే చెప్పనక్కరలేదు.

ఈ 'బడదీదీ' అన్నది ఒక సంసారసంబంధమయినగాథ. శరత్ బాబు దీనిని తాను చదువుకొనేరోజుల్లోనే రచించాడట. అంతటి చిన్నతనంలో రచించినా కథంతా రంజకంగాఉండి మనస్సు నాకట్టేటంతగొప్పది. ఇందు జమీందారీసంసారాల కట్టుబాటులు, స్థితిగతులు చక్కగా వర్ణితము లయినాయి. ఒక కొంతకాలం బడదీదీ అనే మాధవీదేవి తండ్రిగారియింట్లో ఆమెఆదరణ క్రింద జీవితం గడిపి, తుదకు ఆమె అవజ్ఞతచేత – అవజ్ఞ తా అది? — చెప్పకుండా ఇల్లు విడిచి వెళ్లిపోయిన సురేంద్రుడు జమీందారై తన మేనేజరు చేసిన అన్యాయము వల్ల ఉండుటకిల్లయినా లేకపోయిన ఆమెను- బడదీదీని- వెదకిపట్టి తీసుకువస్తాడు. ఇద్దరికీ పరస్పరమూ ప్రేమ తప్ప అన్యభావములేదు. అటువంటప్పుడు సురేంద్రుడు "బడదీదీ! నీకారోజు జ్ఞాపకమున్నదా — నన్ను ఇంట్లోనుంచి వెళ్లగొట్టితివే! దానికే నిన్నిప్పుడు వెళ్లగొట్టి పగతీర్చుకొన్నాను. ఏమంటావ్ — బదులు భర్తీ అయిందా?" అంటాడు. ఇది ఉచితంగా లేదు. ఈమాటలు రసభంగం చేస్తవి కాని రసపుష్టి నీయవు. ఇంతకూ ఆమెను ఇంటినుండి వెళ్లగొట్టడంలో అతనికి ప్రమేయమూ లేదు. అది మేనేజరు చేసినపని. అందుచేత అవి అతకలేదు అక్కడ. ఆ ముగింపు చక్కగా లేదేమో. ఇంతకూ నవల శరచ్చంద్రునిది? 'చక్రపాణి' ఏమి చేయగలడు? మన మేమనగలము? రచన బాగున్నది.

"నా."

---

## అంతా సామ్యవాదులే

కర్త: యమ్. ఆర్. రాజు, వెల ఎనిమిదణాలు.

నేడు దేశములో 'సామ్యవాది' యనిపించుకొనుట హాస్యదాయకము. నిజమైన సామ్యవాదికూడ అట్లు చెప్పుకొనుటకు భయపడవలసివచ్చినది. ఈ బెదురును పోగొట్టుటయే గ్రంథకర్త యుద్దేశ్యము. సామ్యవాదము సంపూర్ణముగ మనకు సరిపడని సిద్ధాంతముకాదు. అందరును కొద్దిగానో గొప్పగానో సామ్యవాద తత్త్వ

మును తెలియకుండగనే యవలంబించుచున్నారు. ఆది కాలమున నందరును కమ్యూనిజములోనే పుట్టి పెరిగిరి. ముఖ్యముగా హిందువు లీపద్ధతి ననుసరించిరని హెన్రీ మెయిను (Sir Henry Maine) అభిప్రాయము. వ్యాపారాభివృద్ధి చేతను, సామ్రాజ్యవిస్తీర్ణత చేతను మూల శక్తి సామాన్యమానవునినుండి కేంద్రస్థానము జేరుట తటస్థించినది. ఆదికాలమునాటినుండి నేటివరకును సామ్యవాద మెట్లు మార్పులు చెందుచువచ్చి, ఇప్పుడు రష్యాలో నేవిధముగ నున్నదియు నీపుస్తకమునందు వివరింపబడినది.

ప్రపంచములో నందరును సమానముగా పుట్టి సమానముగా మరణించుచున్నారు. ఒకరు కిరీటముతో నవో పుట్టుటలేదు, ఇంకొకడు చిప్పతో పుట్టుటలేదు. కావున పుట్టుకతో నందరును కమ్యూనిస్టులే యని గ్రంథకర్త యభిప్రాయము! ఇది కేవలము ఆధ్యాత్మిక సత్యము. భౌతికముగా సత్యదూరమైన విషయము. రాజుకొడుకు తల్లికడుపునుండి కిరీటముతో జన్మించక పోయినను, కిరీటయోగ్యమైన శిరస్సుతో పుట్టుచున్నాడు. మాతృగర్భమున ప్రవేశించినప్పటినుండియు రాజలాంఛనము లతనికి జరుగుచునేయున్నవి. పుట్టిన వెంటనే తదితరములైన గౌరవము లన్నియు జరుగుచున్నవి. దేశమంతటను ఉత్సవములు, విందులు మొదలగువానిని చూచి, ఎవరైన నాపసిపాపకు కిరీటము లేదని యనుకొనుట కవకాశమున్నదా? పూరిగుడిసెలో ఏసహాయములేక పొరిగింటివారైనను చూచుటకురాని దరిద్రబాలజననమును చూచి ఎవరైన నాదరిద్రబాలుడు రాజపుత్ర సదృశుడని యనుకొనగలడా? లేదు. ధనిక దరిద్రభేద మున్నంతకాల మీ భేదము పాటింపబడును. ఆ భేదము నశించకపూర్వము అందరును జన్మతః కమ్యూనిస్టు లనుకొనుటకు వీలులేదు.

ఈ పుస్తకములో కొన్నిచోట్ల భావములు ఆంగ్లమునుండి తెనిగించినట్లు స్పష్టముగా కనుపడుచున్నవి. కాంగ్రెసు సోషలిస్టులపై ద్వేషము ప్రకటితము. వీరు నడచుమార్గము 'పిచ్చిపంథా' యనియు, 'అతి తెలివి' గా ప్రవర్తించినా రనియు వ్రాయబడినది. కాంగ్రెసు సోషలిస్టులు ద్విముఖముగా నడచుచున్నారని గ్రంథకర్త యభిప్రాయము. తరువాత సామ్యవాదులపై చర్య తీసికొనినందుకు కాంగ్రెసుకూడ విమర్శింపబడినది. కాని సక్రమ పంథా యేదియో గ్రంథకర్త సూచింపలేదు. గ్రంథకర్త కాంగ్రెసేతర పార్టీలను విమర్శించినాడు. కాంగ్రెసులో నుండుటకైనను సత్యము, అహింస సిద్ధాంతములు రుచింపలేదు. ఇంకే త్రోవయు సూచింపబడలేదు. ఈవాదము తార్కిక కౌశలముతో నొనర్చినది; ఇది నిజమైన సంస్కార వాంఛతో నొనర్చిన విమర్శగా కన్పట్టదు.

వెం. శ్రీ.

---

## శ్రీ ప్రమాది సంవత్సర గంటల పంచాంగం

ఇది బ్రహ్మశ్రీ ముంజూరు వీరభద్ర సిద్ధాంతి గారిచే గుణింపబడి రాజవైద్య పొన్నాడ భాస్కరం అండ్ బ్రదర్సువారిచే ప్రకటింపబడినది-రాజమండ్రి. ఈపంచాంగమునందు తిథి, వార, నక్షత్ర, వర్జ్య, దుర్ముహూర్తములు వగైరాలపైను ఇప్పటివారికి సులభంగా తెలిసేటట్లు గంటలు, నిమిషములలో తెలుపబడినది. గడియల లెక్కలు తెలియని, ఆ గడియలను గంటలలోకి మార్చుకోవడమునే చీకాకు పడలేని ఆధునికులకు చాలా ఉపయోగంగా ఉంటుంది. అణా పోస్టేజి పంపినవారికి పంచాంగం ప్రతి ఉచితము.

---

## పత్రికా స్వీకారము

కిన్నెర :— ఇది నిజాం ఇలాకా బూర్గంపాడునుండి ఆంధ్రవాఙ్మయ సేవాసమితి తరఫున ఉగాది కానుకగా వెలువడిన సాహితీ సంపుటము. సాహిత్యప్రియులకు హృదయానందము చేకూర్ప బయలువెడలిన మధురవాణి. ప్రఖ్యాతులయిన భాషాప్రవీణులు, కవులూమున్నగువారి శుభాశీర్వాదము లందుకొని మరీ వెలువడింది. శాసనలేఖల బరిశీలించి అర్థము తీయగలదిట్టలలో శేషాద్రి రమణకవులు వకరు. వారు 'శాసనములు - ఆంధ్ర కవిత్వము' అను వ్యాసమున నన్నయకు పూర్వ ముండిన తెలుగుభాషను గురించియు, నన్నయకు తిక్కనకూ మధ్య గలిగిన తద్భాషా పరివర్తన

అభివృద్ధులనుగురించియు, తిక్కన యనంతరము గలుగు చూవచ్చిన మార్పుల సుగురించియు, ఆయా కాలములందలి శాసనాలలోని లేఖలనే యాధారములుగ గొని వానిలోని పద్యముల నుదాహరించుచు మిగుల మనోరంజకము సుకీతి వ్రాసియున్నారు. నిజముగా వారి యభిప్రాయానుసారం దేశమందు నాల్గు మూలలగల శాసనము లన్నింటిని ఇంకనూ ఎక్కువ శ్రద్ధతో కనిపట్టి పరిశీలించినయెడల ఆంధ్రభాషావిషయమున ఇంకనూ పెక్కులు క్రొత్త సంగతులు బయట పడగలవనుట నిర్వివాదము. "వేదవాఙ్మయము—త్రోయతిశ్యాప్రము" నందు నా॥ వేంకటానంద రాఘవరావుగారు పురాణములందలి కథా ప్రపంచమును వైజ్ఞానిక విధానంగా బరిశీలించి, ఈ కాలంలో పుక్కిటి పురాణాలనీ, అర్థంలేని వ్రాతలనీ ఎగరగొట్టబడుచున్న అనేక సమాచారములను సత్యవృత్తాంతములని రూఢిపరచియున్నారు. భద్రాద్రి శ్రీరామనవమి యుత్సవసందర్భాల్లో యాత్రీకు లనుభవించు నానావిధకష్టపరంపరలను తాత కృష్ణమూర్తిగారు ఒక కథలో వర్ణించియున్నారు. యాత్రీకుల కీయగచాట్లూ, తిప్పలూ గలిగేది ఈ ఒక్క క్షేత్రంలోనే గాదు. గమనాగమన సౌకర్యాలు ఏర్పడ్డ ప్రతి క్షేత్రంలోనూ వెలిశాయి. యాత్రీకులభాగ్యం — దైవేచ్ఛ. ఒక లేఖకమహాశయుడు తిక్కనయందుగల నానా విశిష్టశక్తిసామర్థ్యాలనూ మహానిపుణంగా వ్రాసి ప్రకటించారు. శ్రీహరి నాగభూషణంగారు సంగీతవిషయంలో వ్రాస్తూ త్యాగరాజులవారు రచించిన గేయములనే యాధారములుగా దీసుకొని ధార్మికంగా వారి యాశయమెట్టిదో లోకానికి స్పష్టీకరించారు. భావకవిత్వంలో మిత్రకవులు అటుసనాతనులకూ ఇటు అధునాతనులకూ పొత్తు సమకూర్చ బాగా పాటుపడ్డారు. ఇదిగాక నాదోపాసనం, సత్య-పారిజాతాపహరణం, రామరాజభూషణుడు ఆదిగాగల గద్యరచనలూ, పెక్కులు పద్యరచనలూ ఈ సంచికను మరింత పఠనీయంగా చేస్తున్నాయి. అనేకవిర్వంఘములు గలిగియు, రాజాదరణం బొత్తుగా లేకయు, పడివున్న నిజామాంధ్రికి ప్రఖ్యాతిని చేకూర్చ నచటివాస్తవ్యులు ఎంతటి దృఢసంకల్పం గలిగియున్నదియు ఈ కిన్నెర అఖండాంధ్రదేశాని కంతటికీ సాటించగలదు.

నిడుబ్రోలు ఎడ్వర్డ్ బోర్డ్ హైస్కూలు మేగజైన్:—ఇది ఒక ఆంగ్లాంధ్రపత్రిక. ఉపర్యుక్త హైస్కూలు అధికారుల, ఉపాధ్యాయుల అందును ముఖ్యంగా ప్రొఫెసర్ రామాగారి యొక్క ఉద్బోధనమువల్లనూ వారికార్యాచరణ దీక్షాపాటవములవల్లనూ ఈ పత్రిక ఉపాదర్శనము గావింపగలిగినట్లు తోచుచున్నది. ప్రస్తుత మిది షాణ్మాసికముగా వెలువడినదని అర్థమవుతున్నప్పటికీ ముందుముందు మాసపత్రికగా మారడమే కాకుండా ఆంధ్రమండలములలోని ఏతాదృశ ఉన్నతపాఠశాల లన్నిటినుండి మాసపత్రికలు వెల్వడి, వాని కన్నిటికీ ఇది కేంద్రమనదగిన ప్రధానమాసపత్రికగా మారినచో కృతకృత్యుల మవుతామని పత్రికలోని వ్యాసరచయితలలో ఒకానొకరు తమ యభిప్రాయమును వెల్లడించియున్నారు. ఇది మిగుల ఉదారపూర్ణమైన, న్యాయమైన, సహజమైన కోరిక. అదినెరవేరులాగున భగవంతు డనుగ్రహించుగాక. స్కూలునందలి ఉపాధ్యాయులలోని కొందరు వ్రాసిన ఆంధ్రాంగ్ల వ్యాసము లన్నియు విద్యార్థులకేమి తక్కుంగల జనులకేమి అందునూ ముఖ్యంగా విద్యావ్యాసంగంగలవారి కందరికీ అవశ్యం పఠనార్హములు. ఇక S. S. L. C. మొదలు నాలుగో ఫారంవరకూగల విద్యార్థులలో కొందరు వ్రాసిన వ్యాసములూ, కథలూ, చిత్రరచనలూ మరింత మనోహరంగావున్నాయి. నిజానికి పైన పేరూ, క్లాసు లేకుండా ముద్రించినట్లయితే ఇవియు నెవరో పెద్దవాళ్లు వ్రాసినవే యని తోచునుగాని బాలకులు వ్రాసినవని ఎంత

